# భారతి

సాహిత్య మాస పత్రిక

నవంబర్
1986

వెల :
4 రూపాయిలు




# గెలవండి! రూ. 20,000/-ల విలువైన బహుమతులు!




## కలువబాల చందాదారులకు లక్కీడిప్: ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.



మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

రు. 60లు సంవత్సర చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు.

"చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా 'కలువబాల'కు ఏడాది 'చందాదారులుగా' చేరడమే! కాకపోతే మీ 'చందా' మొత్తంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి 'కలువబాల' నుంచి ఒక 'చిరుకానుక' కాలక్రమంలో అందుతుంది.

"లక్కీడిప్" 1-11-1986 లేదా
ఆ లోపల కట్టే చందాలకి
మాత్రమే వర్తిస్తుంది.

కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా:

కలువబాల,
కేరాఫ్: ఆంధ్రపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-3.

---

కత్తిరించాలి

నిజమయితే ✓
కాకపోతే ×
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. (   )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే వచ్చింది. (   )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక (   )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ (   )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు: ..............................

..............................

చిరునామా ..............................

..............................

..............................

ఎమ్. ఓ. పంపిన తేది ..............................
లేదా
డి. డి. జత చేయడమైనది

సంపుటము : 63 నవంబరు, 1986. సంచిక : 11

# భారతి
## సాహిత్య మాసపత్రిక

*

సంస్థాపకుడు
కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

*

సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్
(1938-1972)

## విషయానుక్రమణిక

ముఖచిత్రం కుమారి శోభానాయుడు



# స్వవిషయం

వర్ధమాను తవ్వకాలు జరిపించిన డా. టి. వి. జి. శాస్త్రిగారు అక్కడిది జైనక్షేత్రమే అంటూ రాసిన వ్యాసాన్ని ఈ నెల భారతిలో చూడవచ్చు...

** ** **

నవలల పోటిలో రెండవ బహుమతి పొందిన "యాత్ర" (రచన శ్రీ బులుసు వేంకటేశ్వర్లు గారు) ఈ సంచికలో ప్రచురిస్తున్నాము....

** ** **

పెద్దవెగి తవ్వకాలని గురించి వాటిని నిర్వహించిన డా. ఇంగువ కార్తికేయశర్మగారు ఒక చక్కని వ్యాసం చిత్రాలతో పంపారు. దీనిని వీలయినంత త్వరలో పాఠకులకి అందించటానికి ప్రయత్నిస్తున్నాము...

** ** **

"చమత్కారాష్టకము" రచించిన వారు శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు గారి సతీమణి...

** ** **

భారతిలో ప్రచురణకి స్వీకరించబడని రచనలని తిప్పి పంపాలంటే వాటితో స్వంత చిరునామా, తగు మాత్రం పోస్టేజి కల కవరులు జతపరిచి ఉండాలని మనవి! ఈ మధ్య కొంత కాలంగా తమ రచనలు పడిన భారతి ప్రతులు (ఇక్కడి నుంచి కాంప్లిమెంటరీ కాపీలుగా పంపినవి) తమకి అందటం లేదని కొందరు రచయిత్రులు, రచయితలు మాకు రాస్తున్నారని ఇంతకిముందే తెలియచేశాము. అందరికీ రిజిస్టర్డ్ పోస్టులో కాపీలు పంపటం వీలు కాదని కూడా రాశాము. వీలయిన చోట భారతి స్థానిక ఏజంట్ ద్వారా కాంప్లిమెంటరీ కాపీలు అందచెయ్యటానికి ప్రయత్నించగలమని మనవి చేసు కుంటున్నాము...

విడి పత్రిక వెల : నాలుగు రూపాయలు

నాగేశ్వరరావు ఎస్టేట్సు ప్రయివేట్ లిమిటెడ్ తరఫున ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు;
ముద్రణ : ఆంధ్రపత్రికప్రెస్, గాంధినగరం, విజయవాడ-3, సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ.
ఫోన్లు :- బిజినెస్ 61247, 61248, ఎడిటోరియల్ : 75667

# నవగ్రహ స్తుతి

ఈ పద్యాలు నాకు ఒక చిత్తుప్రతిలో దొరికినవి. వీనిని జినుకుంట నివాసి పెద్దపంతులయ్యగారు వ్రాసిఉంచుకున్నాడు. ఆయన వీధిబడి చెప్పేవాడు. ఆనాడు తన విద్యార్థులకు నిత్యపారాయణంగా నేర్పినాడుకాని ఇవి చాలా సంస్కారాపేక్షంగా ఉన్నవి. యతత్కృతమో తెలిసిరాలేదు.

వీనికి సంబంధించిన సూర్యస్తుతి వేటూరివారి చాటుపద్య మణిమంజరి రెండవభాగం పేజి 6లో ఆశీర్వచనంలోని మొదటిపద్యం పేజి 12లో ఉన్నవి. తక్కినవి లేవు. అందుచేత వీటిని పాఠభేదం కలుగనంతవరకు సరిచేసి యిస్తున్నాను.

పురాణోక్త కర్మప్రకాశికలోని మంగళాష్టకాలలో నవగ్రహస్తుతి ఉంది. కాని వానికంటె ఈ పద్యాలలో వివరం ఎక్కువగా ఉంది. వీని మూలం, కర్తృత్వం తెలిసినవారెవరైనా ఉంటె తెలిపితె సాహిత్యలోకానికి ఉపకారంగా ఉంటుంది.

## సూర్యుడు

కాశ్యపగోత్రుడై ఘనత కెక్కినవాడు
ధరలక్షయోజనాంతరము వాడు
గ్రహరాజ వర్తనాకార మండలివాడు
వ్యోమదృష్టి కళింగభూమివాడు
హారకిరీట కుండలరత్నతనువాడు
మేరుప్రదక్షిణ మేగువాడు
సప్తాశ్వ రథశంఖచక్రముల్ గలవాడు
రత్నకాంచన సింహాసివాడు

అంబుజాప్తుండు ఐదబాయాత్మవిభుడు
ధర్మరాట కర్మశని విశ్వకర్మ గురుడు
రాజకులుడైన సూర్యనారాయణుండు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## చంద్రుడు

అత్రేయగోత్ర జుండమృతాంశుకిరణుండు
గ్రహసమ్మతుడు బుధగ్రహము తండ్రి
ధవళ మాల్యాంబరధ్వజ ధర్మకుండల
హారకేయూర విహార పరుడు
హరితాశ్వరథయాను డంగనాకారుండు
రెండులక్షలనుండు రే విభుండు
కర్కటాధీశుండు కాశ్మీరనాధుండు
విశికులేశుడు సామవేదపరుడు

కలువలకువిందు నక్షత్రగణముపొందు
కాముకులమిత్తి జక్కవగణముకత్తి
ఇందిరాదేవి సైదోడు హిమకరుండు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## అంగారకుడు

కుజుడు భారద్వాజగోత్రుండు లోహిత
వర్ణుండు క్షత్రియ వంశకరుడు
మేషాశ్వరథగామి మేరుప్రదక్షిణుం
డంబుజలోచనుండవనిజుండు
మేషవృశ్చికముల మేటి హారధరుండు
చక్రగదాశూల సాధనుండు
బభ్రుకేశిని పతి భానువిందుని తండ్రి
పురుషుడవంతికా భూవిభుండు

రత్నమాల్యాను లేపనరత్నమకుట
ఘటిత కంకణకేయూర కర్ణభూష
ఘనచతుర్బాహు సంహితు డంగారకుండు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## బుధుడు

హేమవర్ణాంగుడత్రేయస గోత్రుండు
పంచాస్యరథికుండు వైశ్యకులుడు
బాణాసనుండిల ప్రతిపార్శ్వ నయనుండు
పీతాంబరధరుండు ప్రియకిరీటి
మిధున కన్యలయందు మెలగెడు చతురుండు
కమలారిసుతుడు మాగధవిభుండు
ఘనపురూరవు తండ్రి కపిలధేనుహితుండు
సౌమ్యవాసర నపుంసక హితుండు

యౌవనాకారుడతుల దివ్యాయుధుండు
హారకుండల కటక కేయూరహార
కాంచనసుచేల సౌమ్యమార్గుండు బుధుడు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## బృహస్పతి

సురనాథమంత్రి భూసురుడు ఆంగీరస
గోత్రుండు హేమవర్ణత్రయుండు
వేదశాస్త్రార్థ సంవేది ప్రజ్ఞాశాలి
దండాక్షసూత్ర కమండలుండు
మీన ధనుస్సులమేటి దీర్ఘశరీరి
హాటకాంబరుడు కిరీటియుతుడు
దీర్ఘమౌ చతురస్ర దివ్యాసనస్థుండు
కాంత తారాదేవి కచునితండ్రి

పుంసవర్ణుండు ఘనచతుర్భుజయుతుండు
పుష్యరాగాది మణికాంత భూషితుడు
పాకశాసన సన్నుతప్రభుడు గురుడు
మనల కరుణా విధేయుడై మనచుగాత!

## శుక్రుడు

ధవళవర్ణుండు తా కావ్యుని తనయుండు
ఆమ్నాయ పఠనుండు అఘవిదారి
కరచతుష్కుడు భోజకటక మేలెడుసామి
పంచకోణస్థుండు ప్రాఙ్ముఖుండు
కలధౌతరథుడు భార్గవగోత్ర జాతుండు
మౌక్తికాలంకృత మయశరీరి
ఘనసార చందనకస్తూరి లేపను
దండగాకారుండు అసురగురుడు
అజినదండ కమండలుండక్షసూత్రి
దేవయానను గన్నట్టి దీర్ఘదేహి
ధారయజ్ఞోపవీతుండు భార్గవుండు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## శని

కటికచీకటి మేనుకప్పు ఛాయాపట్టి
కాశ్యపాన్వయ చతుష్కరయుతుండు
సౌరాష్ట్రవిభుడు భాస్వన్నీలమాణిక్య
కుండలుండు కిరీట మండలుండు
మహిషశతాంగుడు మరి నీలదేహుండు
హాటకరథుడు కిరీటయుతుడు
కార్ముకాసన శూలగదచాపహస్తుండు
మకరకుంభేశుడు మందచారి
మృగమదసులేపనుండు యామిశితతనుడు
పంగుకాయుండు సంకరవర్ణహితుడు
అసితవర్ణాంగుడైన శనైశ్చరుండు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## రాహువు

పన్నగదేహ శూర్పాసనాయన ముఖ
పైఠినిగోత్రుండు బర్బరుండు
మేఘవర్ణతనుండు మ్లేచ్ఛజాతస్థుండు
నీలమాణిక్య మండిత శిరుండు
హిమకరవైరి సింహిక గన్న కొమరుండు
ఘోరబాహుండు సదాకుపితహృదుడు
పరశు ముద్గర శూలపాశకార్ముకధారి
శతకేతుగుణముల జనకవిభుడు
కృష్ణచందనపిత సమ్మిశిత తనుడు
పుండరీక రథాశ్వ సద్భూరిబలుడు
రత్నసాను ప్రదక్షిణ రాహుఘనుడు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## కేతువు

రాక్షసకులుడు ధూమ్రమాకార చక్షుడు
జైమినిగోత్రుడాజానుకరుడు
క్రోధమనస్కుండు (గుధ) వాహనయాను
డున్నతపుచ్ఛుండు ఉరగరథుడు
జలజాప్తవైరిధ్వజాకారదేహుండు
మరకత మాణిక్య మకుటధరుడు
మందరసుతుడు ధూమ్రమాకారవర్ణుండు
రాజు అంతర్వేదిరాజ్యమునకు
దక్షిణాలోక మేరు ప్రదక్షిణుండు
దనుజసహితుండు వరగదాదండహస్త
వికృతమానసభుజగ మద్విభుడు కేతు
మనల కరుణావిధేయుడై మనచుగాత!

## ఆశీర్వచనం

భానుండుతగు మీకు భవ్యతేజంబిచ్చు
కరుణచంద్రుడు మీకు కాంతియిచ్చు
అంగారకుడు మీకు మంగళప్రదమిచ్చు
బుధుడు సఖ్యత మీకు బుద్ధినిచ్చు
నెంజి బృహస్పతి మీకు నిర్మల మతియిచ్చు
శుక్రుండు మీకును శుభములిచ్చు
రవినందనుడు మీకు రాజ్యపదంబిచ్చు
రాహువు మీకును రత్నమిచ్చు

కేతువును మీకు లోకవిఖ్యాతినిచ్చు
ఘనతకెక్కిన ఈ నవగ్రహములెల్ల
వెలగి యేకాదశస్థాన శుభములొసగు
ధరణివర్ధిల్లుడా చంద్రతారకముగ!

దీర్ఘాయురారోగ్య దివ్యతేజంబును
పుత్రమిత్ర కళత్ర భోగసమితి
ధనధాన్య పశుపుత్ర దాసీజనంబును
ధర్మంబు కీర్తియు దయయు ప్రజ్ఞ
శౌర్యంబు బలిమియు జయము నైశ్వర్యంబు
నవరత్నమయ భూషణాంబరములు
ఘనసారచందన కస్తూరి బహుళముల్
విభవ సమృద్ధిగావింతురెపుడు
నళినమిత్రాబ్జ కుజసౌమ్యనవకమంత్రి
మిత్రశని రాహుకేతువుల్ మేలొసంగి
అరయకృపతోడ రక్షింతురనుదినంబు
మనల కరుణావిధేయులై మన్నతుగాత!

సూర్యుడు చంద్రుడున్ కుజుడు సోమసుతుండు గురుండు శుక్రుడున్
సూర్యజ రాహుకేతువులు శోభనభీష్టము భూమి బుద్ధియౌ
దార్యము విద్యయున్ సుఖము ధైర్యము ధర్మగుణంబునాయువై
శ్వర్యములిచ్చి ప్రోతురు నవగ్రహముల్ దయ లోకసంతతిన్!

శ్రీ కపిలవాయి లింగమూర్తి



# జై జవాన్ జై కిసాన్

మూలం: శ్రీమతి నందినీ శతపథి
తెనుగుసేత: శ్రీ బాసంగి శ్రీరాములు

" అమ్మా—ఓ అమ్మా "

మణి కాంచన చీర చెంగుతో చేతులు తుడుచుకుంటూ వంటింటిలోంచి బయటి కొచ్చింది. ద్వారం దగ్గర నిలబడి - "ఏమైంది శ్రీ కాంత? నన్నెందుకు పిలుస్తున్నావు? " అంది.

వాకిలి ఖాళీగా అనిపించింది. పొగనిండిన వంటగది నుంచి వచ్చిన ఆమె కళ్ళకు మధ్యాహ్న సూర్యకాంతి మిరిమిట్లు గొలుపుతోంది. వాకిట్లో కట్టిన తాడుమీద బట్టలారేసున్నాయి.

వాకిట్లోంచి, శ్రీ కాంత పరుగులాంటి నడకతో తల్లి దగ్గర కొచ్చాడు. అతడు పెద్ద వాడైనప్పటికీ, చిన్నపిల్లాడి చేష్టలింకా మానలేదు. ఏదైనా కనుగొంచే "అమ్మా, నేనేం తెచ్చానో చూడు" అంటూ ఆవేశంతో చిన్నప్పుడు అరిచేవాడు. ఇప్పుడు కూడ అలాగే అరిచాడు. ఏడేళ్ళనాటి శ్రీకాంతకు, ఇరవై ఏడేళ్ళ నేటి శ్రీకాంతకు, తేడా ఏమీ కనబడలేదా తల్లికి.

'అమ్మా నేనేమి తెచ్చానో చూడు!' అంటూ కవరు నుంచి కాగితాన్ని బైటికి తీస్తూ తల్లికి చూపించాడు.

ఒక క్షణం, భయంతో మణి కాంచన కంపించింది. ఉత్తరం అందుకోడానికి చెయ్యిచాపిందే కాని దానిని చదవలేదు. కొడుకువైపు అదే పనిగా తదేక దృష్టితో చూస్తూ వుండిపోయింది.

శ్రీకాంత తల్లిని కదిల్చాడు. " అలా చూస్తున్నావేమమ్మా? వసంత ఈ ఉత్తరం పంపాడమ్మా - యిప్పుడు ఫిరోజపురంలో వుంటున్నాడు".

మణికాంచన కేమీ అర్థం కాలేదు. ఫిరోజపురం నుండి వసంత భోగట్టాను తీసుకొచ్చిందా, యీ వుత్తరం? భోగట్టా ఏమయి వుంటుందో? కాని శ్రీకాంత ఏం చెప్తున్నాడు?

'వసంత బ్రతికే వున్నాడా?' అని మణి కాంచన తనలోతానే భయంగా గొణుగుకో సాగింది.



తల్లి తీరుకు శ్రీకాంత చికాకు పడ్డాడు. ఉత్తరాన్ని తల్లి చేతిలోపెట్టి 'ఏమమ్మా, అలా చూస్తున్నావు? వసంత స్వంతంగా నీకే ఈ ఉత్తరం వ్రాసాడమ్మా. తీసుకొని చూడు.' మణి తన చీరతో కళ్ళను తుడుచుకుంది. జీవితమంతా తన కళ్ళను అలా తుడుస్తూనే వుంది. కాని తనని తానెప్పుడూ నిగ్రహించుకుంటూనే వుంది.

ఆవేశం వరదలా వచ్చినపుడు మాత్రమే కొట్టుకు పోతుంది.

'నా కళ్ళ జోడు లేదు - నీవే ఉత్తరం చదివి వినిపించు' అందామె గొంతు సవరించుకుంటూ.

'అయితే విను'. శ్రీకాంత ఉత్తరం చదవసాగాడు :

" అమ్మా, యుద్ధభూమి నుండి ఈ ఉత్తరాన్ని వ్రాస్తున్నాను. చిన్నప్పటి నుండి, నాన్నగారి ఆదర్శాలను నాకు చెప్పావు, మా జీవితాలను ఈ ఆదర్శాల చుట్టూ మలుచుకోవాలని నాన్నగారేకాదు, నీవుకూడ కోరుతున్నావని నా నమ్మకం. మొదటినుండి నీవు అన్ని బాధలను, కోరికలను ఎదుర్కొంటూనే వున్నావు. మమ్ములను మనుషులుగా చేయడానికి నీవు సాగించిన పోరాటం కూడ తక్కువేమీ కాదు. అందుకే నన్ను యుద్ధానికి పంపినపుడు కూడ నీవేమీ భయపడలేదని నేను నిజంగా భావిస్తున్నాను.

మేమిపుడు ముఖాముఖి యుద్ధంలో వున్నాం. మర తుపాకుల శబ్దం చెవులను అదరగొడుతోంది. ఉత్తరం వ్రాయడానికిది సరైన సమయంకాదు. కొద్ది క్షణాలలో నేనొక పటాలాన్ని యుద్ధభూమి లోనికి తీసుకొని వెళ్ళబోతున్నాను. అప్పుడు ఉత్తరం వ్రాయడానికి సమయంగాని అవకాశంగాని వుండదు. అందుకే యుద్ధానికి బయలుదేరే ముందు, నీ కొడుకు, అతని స్నేహితులు, వాళ్ళ శక్తినంతా ఉపయోగించి ధైర్యంతో పోరాడుతున్నారని నీకు చెప్ప దలచుకొన్నాను. శత్రువు దగ్గరున్న అత్యాధునిక ఆయుధాలు కూడ మన సైనికుల సాహసం, అంకితభావన, త్యాగ నిరతులముందు ఓటమి నంగీకరించాయి. అందువలన మన సైనికులొకనికి ఇరవైమంది, శత్రుసైనికులు కూడదీటు రాలేరు. మన దేశ స్వాతంత్ర్య సంపాదనలో నాన్నగారు తన జీవితాన్ని అంకింతం చేసారు. అలాగే నా జీవితాన్ని అంకితం చేసినా, నీవు విచారించ కూడదు. నేనెంత గర్విస్తున్నానో, నీవు తప్పకుండా తెలుసుకోవాలి!

దుర్గాపూజ ఆశీస్సులతో నీవు పంపిన పువ్వును నేను భద్రపరిచాను. మేము భయమేమీ లేకుండా యుద్ధం చేస్తున్నాం. తప్పని సరిగా గెలుస్తాం, నా గౌరవాభివందనములు నీతోపాటే నాదేశానికి అందిస్తున్నాను-జైహింద్'.

శ్రీకాంత గొంతు పూడుకు పోయింది. తన కన్నీళ్ళు తల్లికి కనబడనీయకుండా బయటికెళ్ళి పోయాడు. మణి కాంచనకుకూడ కన్నీరు వరదైంది. గత సంఘటనలు ఒకటొకటిగా, ఆమె కళ్ళముందు మెదలసాగాయి.



చాలా కాలం క్రితం —- 1942లో ఇటువంటి ఉత్తరమే భర్తనుండి వచ్చిందామెకు. అప్పుడాయన బ్రిటిష్ వాళ్ళ చేతుల్లో బందీగా వున్నాడు.




అప్పటికి మణికాంచన వయస్సెంతో లేదు. శ్రీ కాంతకు మూడేళ్ళయినా నిండలేదు. మరి వసంతకో? తల్లి గర్భంనుండి బయటికు రావడాని కెదురు చూస్తున్నాడాబిడ్డ.

ఆమె జ్ఞాపకాలు, వంటింటిలో కుతకుతమంటూ వుడుకుతున్న బియ్యంలా వున్నాయి. ముఖ్య విషయాలతో పాటు చిన్న సంఘటనలు కూడ ఆమె మనస్సులో తొక్కిస లాడసాగాయి. తలుపుకు ఆనుకొని వున్నదల్లా, ఎప్పుడు కూర్చుండి పోయిందో ఆమెకే తెలియలేదు.

మణికాంచనకు పెళ్ళయి ఈ ఇంట్లో అడుగు పెట్టిన వెంటనే, ఇంటి బాధ్యతంతా ఆమెపై పడింది. విధవరాలైన అత్తగారు ఆశీర్వదిస్తూ 'నీ వీ యింటి లక్ష్మివి. సదా పిచ్చివాడు. అతని పిచ్చి అంతా ఈ దేశం గురించే. ఇంటి విషయమేదీ పట్టించుకోడు. జైలు కెళ్తాడు. పోలీసులు పెట్టిన బాధలనుభవిస్తాడు; ఇంటి కెందరినో మనుషులను తీసుకొస్తాడు, సమావేశాలు జరుపుతాడు. ఇంతవరకు, దీని నంతటినీ నేను భరించాను. ఇక నీవే ప్రతి విషయం భరించాలి. వానిమీద కోపం తెచ్చుకోవద్దు. అలాగే అతనిని పట్టించుకోకుండా కూడ ఉండొద్దు" - అన్నది.

ప్రక్కనేవున్న సదావ్రత నవ్వుతున్నాడు. అతని అందమైన ముఖం మణికాంచనకు ఆశ్చర్యాన్ని కలిగించింది. వాళ్ళ పెళ్ళికి ముందు సదావ్రత తన దేశసేవ చేస్తున్నాడని మాత్రమే తెలుసు. కాని ఆ చేసేసేవ, దాని అర్థమేమిటో ఆమెకు పూర్తిగా తెలియనే తెలియదు.

మణికాంచన భర్తతో ఏకాంతంగా వున్నప్పుడు సదావ్రత తనతల్లి మాటలను భార్యకు గుర్తు చేసాడు. 'మణి, మా అమ్మ మాటలను విన్నావా? నన్ననుసరించ గలవా?" అతని పెదవుల మీద మళ్ళీ అదే రకమైన నవ్వు కనబడింది.

ఆమె దీంతో చాల ఆశ్చర్యపడింది. పెళ్ళి, భర్త, అత్తింటి వాళ్ళ గురించి, తనకున్న ఖచ్చితమైన అభిప్రాయం, తప్పని గుర్తించడానికి ఎంతో సేపు పట్టలేదామెకు. సదావ్రతను శూన్య దృష్టితో చూసి 'అలాగే, మిమ్ములననుసరించగలనని సమాధాన మిచ్చింది. అలా ఆరోజు నుండి అనుసరిస్తూనే వుంది. ఒక క్షణమైనా విచారంగాని కోపంగాని కలగలేదామెకు. మనుషులను గుంపులుగా సదావ్రత ఇంటికి తీసుకొని వచ్చేవాడు, మణికాంచన వంట చేసి, వాళ్ళ నందరినీ భోజనాలతో తృప్తి పరిచేది. ఒక క్షణమైనా ఆగి ఆలోచించడానికి అవకాశమే లేదు. పోలీసులు ఇల్లు సోదా చేసి వాళ్ళ సామాన్లన్నీ వశం చేసుకున్నారు. సదావ్రతను అరెస్టు చేసారు. ఆస్తి తనఖా పెట్టవలసి వచ్చింది. రెండు పూటలా తిండి తినడానికైనా చాలినంత డబ్బులేదు. అయినా మణికాంచన ముందుకు సాగిపోతుంది. జైలునుండి తిరిగి వచ్చిన సదావ్రత బాధలేమీ లేనట్లు చిరునవ్వు ముఖంతో ఎదురైన మణి కాంచనను చూస్తాడు. తన పద్ధతే ఆమెలో ప్రతిబింబించే సరికి ఆశ్చర్య పోయాడు. "మణి, నవ్వుతున్నావా?" అన్నాడు.

'దీనిని మీ వద్దే నేర్చుకున్నాను' అని చిరునవ్వుతో సమాధాన మిచ్చింది మణి.

ఆ జీవితమెంత వేగంగా గడిచిపోయింది! పోలీసుల లాఠీ దెబ్బలకు గురై గాయపడి ఇంటికి తీసుకొని రాబడిన సదావ్రతను గుర్తించడానికే వీలు కాలేదా రోజు. అందంగా, హుషారుగా వుండే ఆ వ్యక్తి ఒక రాత్రిలో కదల లేని స్థితిలో కర్రలా పడి వున్నాడు. అయినా మణి ధైర్యాన్ని చిక్క పట్టుకొని, అతనికి సేవ చేసింది. కాని అతనింకా పూర్తిగా కోలుకోక ముందే అతనిని పోలీసులు మళ్ళీ అరెస్టు చేసారు. తనను బయటకు తీసుకొనిపోయే ముందు మూడేళ్ళ కొడుకు శ్రీకాంతకు, తల్లి కడుపులోవున్న బిడ్డకు; సదావ్రత తన చివరి మాటలు చెప్పాడు. 'దేశంకోసమై పనిచేసేలా పిల్లలను ప్రేరేపించు, నన్ను మరచి పోవద్దని చెప్పు' - అన్నాడు భార్యతో, బహుశ సదావ్రత జైలునుండి రానేమోనని భావించి వుంటాడు.

*    *    *    *

# దశావతార స్తోత్రము

మత్స్య

శ్రుతి విజ్ఞాన సువర్ణపేటి ప్రళయార్ణోరాశి మధ్యంబులో
పతితం బైన విచేష్టుఁడై సలువ సంప్రార్థింప తత్సాదనో
ద్యతకాలాయసయంత్రమో యనఁగ వక్త్రింబున్ విదారించు నీ
యతిలోకంబగు మత్స్యమూర్తి నెదలో నర్చింతు నశ్రాంతమున్.

కూర్మ

సకలచరాచరా కృతుల సంపుటమై చను విశ్వరూపమున్
ప్రకటము సేయనోయనగు రత్నములున్ గజముల్ తురంగముల్
సకియలు నోషధీతతి విసఁబు సుధారసముల్ వెలార్చ నీ
యకుటిల కూర్మరూపమున కంజలి సేయుదు తాప శాంతికై.

వరాహ

దానవుఁ డీతఁ డాత్మబలదర్పితుఁడా పయి భూత ధాత్రికిన్
హాని దలంచెఁ జూడుఁడని నట్లు హిరణ్యు ని శాతదంష్ట్రికా
దీన శరీరుఁ జేసి నలు దిక్కులఁ ద్రిప్పుచు నూగు చెక్కగా
గానుగ నాడు నీదు కిటికాయము నాయఘమున్ హరించెడున్.

నారసింహ

శాత క్రూర నఖాగ్ర నిర్దళిత నక్షస్తారణ ద్వార ని
ర్యాతం బైన మహాస్రధార కర దీపాలోకమై యొప్పగా
భీతంబై పఱతెంచు వేల్పుగ మి నన్వేషించు నీ సింహ వి
ఖ్యాతా కారము నన్ను బ్రోచు నఘ సంహారంబు గావించుచున్.

వామన

కాల విపర్యయోప నత గాఢభరంబున నొక్కవంక పా
తాళముఁజేర జాఱిపడ దానపలక్ష్మి మరొక్కవంక నా
భీల జవంబునన్ పయికిఁదేలి నభంబునఁ బ్రాకిపోవునా
కాలయలక్ష్మి నా నెసగు నంఘ్రులు ప్రోచు మమున్ త్రి విక్రమా.

పరశురామ

ఆగమపార పూత జమదగ్నిశిరంబె ఋణంబుగొంచు న
ర్గేగిన కార్తవీర్య గుణహీను సబాంధవ సా న్వయంబు గా
నీఁగల తిండిఁ జేసి శతవృద్ధిగ దానిని దీర్పఁజేయు నీ
యాగడ మస్మదీయ కలుషాగ పరశ్వథమై తెగ న్రెపడున్.

శ్రీరామ

జనకుఁడు తల్లి సోదరుఁడు జాయ తలంప నెవంబెగాని నీ
మనుజకులావతార మహిమంబు సముద్ధతయాతు ధానమ
ర్దన ఘనకార్య దీక్షకెగదా తలపోయగ వేయునేల ఓ
యినకుల సార్వభౌమ ! యొలయింపుము మాకు సుఖంబు శాంతియున్

బలరామ

ముసలం బొక్కటి లాంగలం బొకటి, పై మోహ ప్రదా స్వాదనా
భ్యసనం బొక్కటి నీలచేల మొకపై - ప్రచ్ఛాదనం జేసినన్
వన గోల్పోవని లోని సత్త్వగుణ విస్ఫారద్యుతుల్ చిమ్మ నీ
ప్రసర త్పాండుర దేహయష్టి బలభద్రా ! నాకు భద్రంబిడున్,

శ్రీకృష్ణ

రాగములో సదాగుర విరాగములో సకల ప్రజా వనో
ద్యోగములో సముల్లసిత యోగములో ఒకటేమి టన్నిటన్
భోగమొ మోక్షమో తెలియఁబోని మహోన్నత భూమికా విహా
రాగతమైన కృష్ణ పురుషాకృతి దుష్కృతి సంహరించెడున్.

కల్కి

మ్లేచ్ఛ జనావ కీర్ణమయి మేదిని ఖేద విభావరీతమో
విచ్ఛురితంబు గాక నుడు వీధిని దోచు సవారుణ ప్రభ
గుచ్ఛము వోలె నీ దయిన కోప విఘూర్ణిత దృష్టి యీ . వి
స్వేచ్ఛ నడంచి యింక కృత కృత్యత మాకు నొసంగుఁగావుతన్.

## శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు

' అమ్మా '

మణికాంచన, తన గత స్మృతులనుండి తేరుకొని, కొడుకు చెప్పబోయేదాన్ని వినడానికి, కొద్దిసేపు పట్టింది.

' అమ్మా ! గతరాత్రి దేశ ప్రజలనుద్దేశించి రేడియోలో శాస్త్రిగారేమి చెప్పారో తెలుసా?" అంటూ శ్రీకాంత తల్లి ముందు వార్తా పత్రిక విప్పి వుంచాడు. చెమటోడ్చి దేశానికి ఆహారాన్నందించే మన రైతులుకూడ యుద్ధ భూమిలో శత్రువులతో పోరాడే మన సైనికులంత గొప్పవారు.'

మణికాంచన తన చేతితో శ్రీకాంత తలను నిమిరింది. కొడుకు ఉద్దేశ మేమిటో అర్థం చేసుకోవడం కష్టమేమీ కాదామెకు. తన తమ్ముడు వసంత మాదిరిగా తానుకూడ దేశంకోసం కృషి చేస్తున్నానని తండ్రిగారి ఆఖరి కోరి కను తీరుస్తానని తల్లికిచెప్పాలనుకున్నాడని ఆమెకు తెలుసు. వ్యవసాయంలో డిగ్రీ సంపాదించి, తమ వూరిలోనేవుండి పొలాల్లో పని చేసుకుంటున్నాడు.

తన చదువు, తెలివి తేటల నుపయోగించి, ఎక్కువ పంట దిగుబడిని సాధించడానికి ప్రయత్నిస్తున్నాడు. 'దేశసేవలో తాను విఫలుడవుతున్నాడా' అనే ప్రశ్న అతని మనసులో తరచు వేధించేది.

మణికాంచన నవ్వింది. కొడుకు తలపై నిమిరి " చివరకు శాస్త్రిగారి ప్రసంగం నుండి నీ ప్రశ్నకు సమాధానం దొరికింది. ఇంకా సందేహం తీర లేదా? " అన్నదామె.

సహకార వ్యవసాయ సంఘ సభ్యులు ఇంటిలో ప్రవేశించి, " శ్రీకాంతన్నయ్యా. శాస్త్రిగారి కొత్త నినాదం విన్నావా? ' అన్నారు.

" జై జవాన్ — జై కిసాన్ "

సదాప్రత నాటి రోజుల మాదిరే - వచ్చిన అతిథులందరికీ వంట చేయ డానికి వంటింట్లోకి వెళ్ళింది మణికాంచన, తృప్తిగా నవ్వుకుంటూ.

# ఈ మాసం - మీ నక్షత్రఫలం
# నవంబరు నెల 1986

**1. మేషము :-** (అశ్విని, భరణి, కృత్తిక 1 పా.

అశ్విని వారికి నెల ప్రారంభంలోను, నెల చివరి వారంలోను చిక్కులుగా ఉన్నను, మధ్యకాలము అనగా (2, 3 వారాలు) కొంచెము మెరుగుగా ఉండును ప్రతి కార్యములోను మందకొడితనము హెచ్చుగా వుండును. ధన వ్యయము, శ్రమ హెచ్చుగానే ఉండును. ఫలితం తక్కువగానే ఉండును. అనుకొనని విషయములు అప్రయత్నముగా ఫలించుట, హెచ్చు ప్రయత్నము చేసిన పనులు ఆశ్చర్యకరంగా వాయిదా పడుట జరుగును. భరణి వారికి ఈ నెల 18 వ తేదీతో బాలపరకు శని దోషము తొలగిపోవును. వక్రంలో ఉన్నా, గురు శుక్రులు అనుకూలుర. కొంతవరకు పట్టు విడవక బాధించుచున్న శని పీడ తగ్గినను అష్టమస్థితి వలన చిక్కుల శేషము ఇంకా ఉండును. కాని అధిక బాధ ఉండదు. అవయోగం తొలగి శుభయోగం అనుకూలం ప్రారంభం కావడానికి ఇది సంధి కాలము. వర్తకులకు, విద్యార్థులకు, అనుకూలం. ఉద్యోగులకు, వ్యవసాయదార్లకు స్వల్పంగా చిక్కులు కలిగి తొలగిపోవును కృత్తిక 1 పా. వారికి 18 వ తేదీనుండి కొన్ని చిక్కులు కలిగి వ్యవహారములు స్తంభించుట జరుగును. శుభకార్య ప్రయత్నాలు కలసివచ్చును. బంధుమిత్రాదుల పీడ, వత్తిడి హెచ్చుగా ఉండును, దశమ గ్రహంవల్ల చిక్కులు కలుగును. మనస్థిమితం తక్కువగా ఉండును.

**2. వృషభం :-** (కృత్తిక 2, 3, 4 పా రోహిణి. మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4 పా. వారికి గతంలో ప్రారంభమైన యోగము కొంత స్తంభించును. అయితే ఆర్థికంగా కలసి వచ్చును. వ్యవహారములు ఫలించును. దుబారా ఖర్చు జరుగును అనవసరపు మాటలు, నిందలు పడవలసి వచ్చును. మొత్తంమీద అన్ని విధముల కలసి వచ్చినా, అసంతృప్తి హెచ్చుగా వుండును రోహిణి వారికి ఈ నెల అంతా అనుకూలంగా ఉండును. ఉద్యోగ వ్యవహారములు బాగా లాభించును. ఉద్యోగులకు ప్రమోషను లభించును. అన్ని విషయములలో బాగుగా యోగించును. కార్యాలు ఫలించి ఉత్సాహాన్నిస్తాయి. మృగశిర 1, 2. పా. ఆర్థికంగా కొన్ని చిక్కులు కలిగినను ధనలాభం బాగుగా కలసి వచ్చును. బంధుమిత్రాదులవల్ల సుఖశాంతులు కలుగును. శుభ కార్య ప్రయత్నములు నెరవేరుతాయి. వర్తకులకు, ఉద్యోగులకు అనుకూలమైన కాలము. విద్యార్థులకు విజయం కలుగును. పుష్కలముగా, అకస్మాత్తుగ ధన లాభం కలుగును. దూర ప్రయాణాలు ఫలించును.

**3. మిథునము :-** (మృగశిర 3, 4 పా. ఆర్ద్ర. పునర్వసు 1, 2, 3 పా.)

మృగశిర 3, 4 పా. వారికి మొదటివారమంతా చిక్కులతో గడచును రెండవ వారమునుండి కార్యానుకూలత, ప్రయాణాదులవల్ల లాభం కలుగును. ఇంతవరకు వున్న చిక్కులు, మనోవైకల్యం తొలగిపోయి, కుటుంబంలో సుఖశాంతులు కలుగును. మూడవవారం నాటికి నానా విధముల ధనలాభం, విజయం, ఉత్సాహం, పెద్దలతో మైత్రి, సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు, గౌరవ సన్మానములు కలుగును. కాని మనోవైకల్యం మాత్రం హఠాత్ సంఘటనల వల్ల ఒకటి, రెండుసార్లు కలిగి తొలగిపోవును ఆర్ద్ర వారికి యోగంతోపాటు శరీరశ్రమ కలుగును. భార్యావర్గం, అధికార వర్గములతో. అధిక సుఖ సంతోషములతోపాటు, విరోధ, ఖేదములను, సుఖములతోపాటు కష్టమును, మానముతోపాటు అవమానమును విశేష ధనాదాయముతోపాటు స్థిరాస్తి సంపాదనకై ధనవ్యయమును కూడ కలిగించును. పునర్వసు 1, 2, 3, పా. వారికి మొదటి వారం యాక్సిడెంటు దెబ్బలు, మనఃఖేదము కలుగును. రెండవ వారమునుండి ధనలాభం, ఉద్యోగాభివృద్ధి, అన్ని విధముల మంచి ఆదాయం, కుటుంబంలో శుభకార్యములు చేయుట కలుగును. వ్యవసాయదారులు, వ్యాపారస్థులు, విద్యార్థులు, ఉద్యోగులు మొదలగు వారందరికి మంచి యోగ ప్రదముగా వుండును.

**4. కర్కాటకము :-** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4 పా. వారికి మొదటివారము, చివరి వారము అత్యధికంగా శరీరశ్రమ, నలత కలుగును. మధ్యలో ధనాదాయం బాగుండును. ప్రతి విషయములోను ఆందోళన హెచ్చుగా వుండును. అతిస్నేహం వలన అనాదరము, చిక్కులు, ఖేదమును పొందవలసి వచ్చును. తలపెట్టిన ప్రతి పనిలోను ఏదో విధముగా మనస్సునకు బాధ, ఖేదము తప్పదు. పుష్యమి వారికి 18 వ తేదీ వరకు గతంలో వున్న శారీరకమైన నలత కొనసాగి తరువాత ఆర్థికంగా, ఉద్యోగ విషయకముగా, ఇతర విషయములుగా . మంచి అభివృద్ధి కొనసాగును. ఎంత మేలు ఎన్ని విధముల కలిగినా, అంత శ్రమ, అంత ఆందోళన కలుగుచుండును. మొత్తంమీద శుభా శుభ మిశ్రమ ఫలంగా వుండును. ఆశ్లేష వారికి గతంలో కొన్ని చిక్కులు పట్టి పీడించి, కొంత తెరిపిని కలిగించినా, ఈ నెల మాత్రం తిరిగి చిక్కుల బాధల శత్రువుల సుడిగుండంలో పడవేయును. మనస్సునకు విశేషమైన శ్రమను కలిగించును. దానితోపాటు పనికిమాలిన వ్యయమును కలిగించును.

**5. సింహం :-** (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘ వారికి మొదటివారము వరకు స్వల్ప శ్రమ, తరువాతనుండి మంచి యోగదాయకంగా వుండును. పుష్కలంగా ధనలాభం కలసి వచ్చును. నెల చివరిలో కొన్ని చిక్కులు కలిగి తొలగిపోవును. అన్ని వృత్తుల వర్గముల వారికిని బాగుగా కలసివచ్చుట, అభివృద్ధి కలుగుట, శుభకార్యములలో పాల్గొనుట, తలపెట్టిన ప్రతి పని విజయమగుట జరుగును.

పుబ్బ వారికి ఈ నెల 18 వ తేదీనుండి అనారోగ్యపు చిక్కులు క్రమంగా తొలగిపోవును. ధనలాభం కలుగును. కార్యవిజయము కలుగును. స్థిరాస్తి సంపాదన కవకాశ మేర్పడును. సంసారంలో చిన్న చిన్న కలతలు కలిగినను, సర్దుకొని పోవుట మంచిది. అర్ధాష్టమ శని ప్రభావం తగ్గిపోవును. కార్మికులకు హెచ్చు లాభం కలుగును, రాజకీయ వాదులకు ధనలాభము కలుగును. విద్యార్థులకు మంచి అభివృద్ధి కలుగును ఉత్తర 1 పా. వారికి శరీరంలో నలత ప్రారంభమై 18 వ తేదీనుండి అర్ధాష్టమ శని ప్రభావం మరింత బాధను కలిగించును. బంధువిరోధము కలుగును. నెలాఖరునాటికి ఒక్కసారిగా అన్ని రకముల వత్తిడులు కలుగును. మొత్తంమీద రోజులు గడుస్తున్నకొద్దీ మనఃఖేదము, కలతలు, ధనవ్యయము హెచ్చుగుచుండును,

**6 కన్య :-** (ఉత్తర 2, 3, 4 పా. హస్త. చిత్త 1, 2 పా)

**ఉత్తర 2, 3, 4 పా.** వారికి మొదటి పాదం వారికంటె కొంత మేలుగా వుండును. ధనం విషయంలో బాగుగా కలసి వచ్చును. కాని బంధువులతో స్వల్ప చిక్కులు, మాట పట్టింపులు, అధికార్లతో అభిప్రాయ భేదములు. కొన్ని విషయములలో అధిక వ్యయము కలుగును. అయితే పుణ్య, తీర్థ, క్షేత్ర యాత్రలు, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట జరుగును. హస్త వారికి గతంకంటె బాగా మేలుగా వుండును. ఒడుదుడుకులు ఒక్కొక్కటే తొలగి పోవును. సంసార కుటుంబ సౌఖ్యం బాగుగా వుండును. సంతానమునకు అన్ని విధముల అభివృద్ధి కలుగును. ధనలాభం కలిగి నూతన నిర్మాణములు చేయుట జరుగును. శుభకార్యములలో పాల్గొనుట, నోములు, వ్రతములు, పూజలు మొదలయిన దైవకార్యములలో పాల్గొనుట జరుగును. చిత్త 1, 2 పా. వారికి ఈ నెల అంతా బాగుగానే వుండును. శారీరక శ్రమ హెచ్చుగా వున్నను, లాభం అన్ని విధముల కలసి వచ్చును. బంధుమిత్ర సౌఖ్యం సామాన్యం. అకారణముగ కుటుంబంలో కలహములు కలిగి, తొలగిపోవును. మొత్తంమీద ఈ నెల యోగ దాయకంగానే గడచును. ఫలించనివానికై హెచ్చు ప్రయత్నములు చేయుట. తనకు లోబడిన కుటుంబ సభ్యులమీద విరుచుకొని పడుట, మూర్ఖముగా ప్రవర్తించుటయు, జరుగును.

**7. తుల :-** (చిత్త 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

చిత్త 3, 4 పా. వారికి అనేక విధముల ధనము కలసి వచ్చును. వ్యాపార వ్యవహారములన్నియు అనుకూలంగానే వుండును. సంతానమునకు అన్ని విధముల విద్యా-ఉద్యోగ-వ్యాపార రంగాలలో మంచి అభివృద్ధి కలుగును. కుటుంబంలో అన్ని విధముల సుఖశాంతులు కలుగును. మొత్తంమీద అన్నివిధాలా బాగుగా వుండును.

స్వాతి వారికి ఈ నెల అంతా శుభయోగంతో గడచును. కాని మనస్సునకు ఆందోళన అసంతృప్తి కలుగుచుండును. శుభకార్య ప్రయత్నములలో పాల్గొనుట జరుగును. ఆరోగ్యం బాగుగా వుండును. ధనము బాగుగా కలసి వచ్చును. విద్యార్థులకు, ఉద్యోగులకు, రాజకీయ నాయకులకు అన్నివిధాల కలసి వచ్చును, శ్రమజీవులకు విశేషముగా ధనము కలసివచ్చును. విశాఖ 1.2,3పా. వారికి ప్రతి పనిలోను అధికశ్రమ కలుగును. అధికంగా శరీరశ్రమ తప్పదు. 18 వ తేదీ తరువాత శుభకార్యముల నిమిత్తము ధనవ్యయము జరిగి కొంత ధనమునకు తొట్రుపాటు పడవలసి వచ్చును. అయినను పడిన శ్రమ చక్కగా ఫలించుట వలన బాధ అనిపించదు. మంచి సుఖానుభవం కూడ కలుగును. విందులు, వినోదములు, మృష్టాన్నభోజనము లభించును

**8. వృశ్చికము :-** (విశాఖ 4 పా. అనూరాధ. జ్యేష్ఠ)

విశాఖ 4 పా. వారికి 18 వ తేదీవరకు ధనలాభం, తరువాత నెలాఖరు వరకు చిన్న చిన్న చిక్కులు కలిగి తొలగిపోవును. కార్య విజయం, పుణ్య ధర్మకార్యములు, తీర్థయాత్రలు, వివాహాది శుభకార్యములందు పాల్గొనుట, ఉద్యోగ వ్యాపారాది విషయాలలో మంచి అనుకూలత ఏర్పడును. శరీరశ్రమ హెచ్చుగా వున్నను, ధన, గృహ, సువర్ణాది ప్రాప్తి కలుగును. అనూరాధ వారికి 18 వ తేదీ వరకు, శని, 6-26 తేదీ మధ్య కుజుడు చాలా శ్రమను, ఖేదమును, ధన వ్యయము మానసిక వ్యథ హెచ్చుగా వుండును. చిరాకు, కోపము, మూర్ఖత్వం, పనికిమాలిన పట్టుదల, నిష్ప్రయోజనమైన ప్రయత్నములు కొనసాగును. ధన వ్యయము హెచ్చుగా వుండును. జ్యేష్ఠ వారికి నెల ప్రారంభము నుండి సామాన్యముగాను, 18 వ తేదీనుండి హెచ్చుగాను చిక్కులు కలుగును. బంధుమిత్రులతో అకారణ వైరము, పరిస్థితు లనుసరించి మాట నిలుకడ లేక పోవుట, కార్యభంగము, పాడిపంటలవల్ల నష్టము, ఇతరులవల్ల గౌరవభంగము, శక్తికి మించిన పరుగులు పెట్టుట మొదలగు ఫలములు కల్గును. శ్రమ హెచ్చుగాను, ఫలితము తక్కువగాను వుండును. మొత్తం మీద ఈ నెల అనుకూలంగా వుండదు.







M.V.K

## 9. ధనూరాశి :-

మూల వారికి ఇంకా శుభాశుభ మిశ్రఫలమే కొనసాగుతుంది. అయినా శుభగ్రహస్థితి అనుకూలం కానందున తలపెట్టిన పనులన్నిటిలోనూ, చిక్కులు, శ్రమ, ధనవ్యయం, శత్రుబాధ, బంధువిరోధం, వగైరాల వత్తిడి హెచ్చుగానే వుంటుంది. ఆర్థికపు తొట్రుపాటూ వుంటుంది. ఆత్మీయులైన బంధుమిత్రుల సహకారంతో ఎలాగో చిక్కుల్ని తప్పించుకొంటారు. శుభకార్యాల ప్రయత్నాలు ఫలించవు. చేతికందవలసిన ఫలితం సిద్ధమై చేజారిపోతుంది. వ్యవహారాలూ స్తంభించిపోతాయి. పూర్వాషాఢ వారికి చాలాకాలంనుండి వున్న శని పీడ ఈ నెల 18 వ తేదీనుండి తగ్గు ముఖం పడుతుంది. శుభగ్రహాలన్నీ అనుకూలంగానే వుంటాయి. ప్రయత్నాలు ఇంతవరకూ ఫలించకపోయినా ఇకపైనుండి ఫలోన్ముఖం కావడానికి తగిన పరిస్థితులేర్పడతాయి. ఆర్థికంగా కలసివచ్చే సూచనలు కలిగి భవిష్యత్తులో ధనలాభం కలుగుతుంది. స్థిరాస్తి ప్రయత్నాలు, శుభకార్య ప్రయత్నాలూ క్రమంగా అనుకూలపడతాయి. ఇంతవరకూ ప్రయత్న స్థితిలోనే వుండి ఫలించని పనుల ఫలితం చేతికి అందకపోయినా ఫలితం సర్వసిద్ధంగా వుండి ప్రోత్సాహాన్నిస్తుంది. ఉత్తరాషాఢ 1 పా. వారికి తొలివారం అంతా యోగదాయకం, చివరి వారం శరీర శ్రమదాయకం, మధ్యకాలం సర్వానుకూలం, భూగృహాది లాభం, సువర్ణాది ప్రాప్తి, బంధుమిత్రాదులతో సుఖసంతోషాలు, విందులు, వినోదాలు మొదలయినవి కలుగును. అయినా మనశ్శాంతి తక్కువ. పనికిమాలిన చిన్న చిన్న విషయాలని గురించిన ఆలోచనలూ, వచ్చిన ఫలితం మీద అసంతృప్తి, అధిక తాపత్రయం, పోటీవారిలో పోటీ పడడానికి ప్రయత్నించి భంగపడడం జరుగుతుంది.

## 10. మకరం :-

ఉత్తరాషాఢ 2, 3, 4 పా. వారికి శారీరకంగా, మానసికంగానూ శ్రమ అధికం. శ్రమకి తగిన ఫలం కూడా వస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. సంతానమునకు ఉద్యోగ-విద్యా-వ్యాపార రంగాలలో రాణింపు కల్గును. బంధుమిత్రాదుల రాకపోకలు, పెండ్లి పేరంటములు, విందులు వినోదాలతో గృహం సర్వదా కలకలలాడుట, అనేక విధాలుగా ధనప్రాప్తి, పదుగురిలో మాట గౌరవము, విజ్ఞాన కార్యక్రమాలలో పాల్గొనుట మొదలగునవి జరుగును.

శ్రవణం వారికి పుష్కలంగా ధనం కలసి వచ్చును. గతంలో వసూలు కాని బాకీలు, ఋణాలు అన్నీ ఈ నెలలోనే రాబట్టుకోవడం జరుగుతుంది. ప్రయాణాల మూలకంగా ధనలాభం, వ్యవసాయ, వ్యాపార, ఉద్యోగ రంగాలలో మంచి రాణింపు కల్గును రాజకీయ వాదులు, కంట్రాక్టర్లూ, ఉపాధ్యాయులూ, వైద్యులూ, శ్రమజీవులూ మొదలయిన వారందరికీ బాగా కలసివచ్చే కాలం. బహువిధ వస్తు సంపాదన జరుగును. ప్రజాదరణ కూడా హెచ్చుగా ఉండును. ధనిష్ట 1,2 పా. వారికి కూడ శ్రవణం వారికి వలెనే యోగించును. అయితే శరీరశ్రమ కొంత హెచ్చు కలుగును. తలంచిన కార్యాలన్నీ అప్రయత్నంగానే అసగా పెద్దగా కష్టపడవలసిన పని లేకుండానే నెరవేరును. ప్రతి పనిలోనూ ఆదాయం కలసి వచ్చును. గతంలో విరోధించిన వారంతా, ఇప్పుడు తన చుట్టూ తిరుగుతారు. పాత విరోధాన్ని విస్మరించి అడిగినవారందరికీ సహాయం చెయ్యడం జరుగుతుంది.

ధనిష్ట 3, 4 పాదాల వారికి శరీరశ్రమ హెచ్చు అయినా ఫలితం బాగానే వుండును. అన్ని విషయాలలోను బాగా కలసి వచ్చును. పితృ మాతృ వర్గాలనుండి భూ గృహ, సువర్ణాది సంపద కలసి వచ్చును. పదిమందికి మేలు చేసే అవకాశం లభిస్తుంది. గొప్ప కోసం, పేరు కోసం, పొగడ్తల కోసం ప్రాకులాడడం జరుగును. పుష్కలంగా సుఖభోగానుభవం కలుగుతుంది. పదుగురిలో గౌరవ మర్యాదలు లభిస్తాయి. సంసార కుటుంబ సౌఖ్యం, సంతానానికి అన్ని విధాల అభివృద్ధీ కలుగుతాయి మొత్తంమీద శ్రమ అధికం అయినా శుభయోగ కాలం ఇది. శతభిషం వారికి ధనిష్టవారికంటే శ్రమా, ఆందోళనా అధికమే అయినా శుభయోగాన్ని, ధన భాగ్యఫలాన్ని కూడా అధికంగానే పొందుతారు. ఎంత శాంత ప్రకృతి అయినా, చిరాకూ, కోపమూ, అహంకారం కూడా ఎక్కువగానే వుంటాయి. పెద్దలమీదా, తనకు ఉపకారం చేసినవారిమీదా, నిర్లక్ష్యంగా ప్రవర్తించడం, తిరుగుబాటు చేయడం, వారికి బాధ కలిగేట్టు ప్రవర్తించి, లొంగదీసుకొని లాభం పొందడం జరుగును ముఖప్రీతి మాటలకి లొంగిపోవడం తలకుమించిన పనులకు పూనుకోవడం కూడ జరుగును.

పూర్వాభాద్ర 1, 2, 3 పా. వారికి ఈ నెలనుండి శుభయోగం ప్రారంభం కాగలదు. కలిగిన పదవికో, సంపదకో, కొంచెం అహంకరించడం, నిర్లక్ష్యంగా ప్రవర్తించడంద్వారా, పరోక్షంగా విమర్శలకు, నిందలకు గురి కావడం కూడ జరుగును. ధనం పుష్కలంగా కలసి వచ్చును. సుఖ భాగ్య భోగాలను బాగా అనుభవిస్తారు. బంధుమిత్రాదులతో, సాధు సజ్జన వర్గంతో గోష్ఠి, సహవాసం కలుగుతాయి. పేరు, ప్రతిష్ఠ బాగుంటాయి. చాలా మంచి పనులు కీర్తికరంగా చేయుట జరుగును.

## మీనం :-

పూర్వాభాద్ర 4వ పా. వారికి యోగం బాగున్నా ప్రతి విషయంలోనూ ఎంతో శ్రమ పడవలసి వస్తుంది. అయినా సంతృప్తి వుండదు. ఆ వచ్చినదేదో బంధుమిత్రాదులకూ, శుభకార్యాలకూ ఖర్చు చేయడం తరువాత విచారించడం జరుగుతుంది. స్త్రీ మూలకంగా లగ్జరీ వస్తువుల మూలకంగా ఖర్చు హెచ్చు. ఆవేశాన్ని, ఉద్రేకాన్ని నిగ్రహించుకోలేక తొందరపాటుగా ప్రవర్తించడము, తర్వాత విచారించడం జరుగును. ఉత్తరాభాద్ర వారికి 18 వ తేదీనుండి అన్నీ అనుకూలంగా వుంటాయి. అంతవరకు గృహంలో స్త్రీలకు ఆరోగ్య భంగం, శరీరశ్రమ, త్రిప్పట, వృథాప్రయాస, ధనవ్యయం జరుగును. బంధుమిత్రాదుల మూలకంగా గృహంలో దైవకార్యాలు, పండుగలు పబ్బాలు మూలకంగా ధనవ్యయం జరుగును. నెల 3వ వారంనుండి ఆదాయంలో పెంపు వుండును. ఉద్యోగ, వ్యాపార వ్యవహారాలలో స్వల్పంగా చిక్కులు కలిగి తొలగును, రేవతి వారికి 18 వ తేదీ తర్వాతనుండి శరీరంలో నలత, సహవాస దోషం వలన స్వల్పంగా వ్యసనాలు, మనోవైకల్యం, భార్యకు అనారోగ్యం కలిగి నిమ్మళించుట జరుగును. వ్యవసాయ వ్యాపారాదులలో నష్టం లేకపోయినా శ్రమకు తగిన ఫలం వుండదు. ఆదాయ వ్యయాలు సమానం. అయినా కొంచెం ఋణం కూడ చేయుట జరుగును. అనవసరమైన పనులు నెత్తిన వేసికొని బాధపడుట జరుగును. బుధ గురు శుక్రులకు శాంతి చేయించుట మంచిది. నెల చివరిలో మేలు కలుగును. శుభమస్తు.

సర్వేజనాస్సుఖినోభవంతు

-సిద్ధాంతి నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం.

డా. టి. ఎ. జి. శాస్త్రి

# వడ్డమాను జైనక్షేత్రమే

శ్రీ ఇంగువ కార్తికేయశర్మ 1936 జూన్ నెల భారతిలో "వడ్డమాను స్తూపము, చారిత్రక అవశేషములు" అనే శీర్షికక్రింద ప్రచురించిన వ్యాసం చూశాను. దీనిలో ఉదహరించిన విశేషములన్నింటినీ నేను 1985 అక్టోబరునెల "భారతి"లో "వడ్డమానులో ప్రప్రథమ జైన అవశేషములు" అను వ్యాసంలో ప్రచురించారు కాని శ్రీ శర్మ నేను వ్రాసిన వ్యాసమును చూడలేదు.

నేను బిర్లా పురావస్తు మరియాసా సాంస్కృతిక పరిశోధనాసంస్థ అధిపతిగా యుండి 1981-85 వరకు వడ్డమాను కొండపై త్రవ్వకము నిర్వహించాను. ఈ నాలుగుసంవత్సరములలో లభించిన అవశేషముల చరిత్ర, కాలమానము మొదలగు విశేషములన్నింటిని అధ్యయనంచేశాను.

నేనూ, శ్రీ శర్మ భారత పురాతత్త్వ సంస్థలో చాలాకాలం పనిచేశాం. ఆయన ఇప్పుడు నాగపూర్‌లోని భారత పురాతత్త్వ సంస్థ (ఖనన శాఖ) సంచాలకులు. మేమిద్దరము సన్నిహితులవడం వల్ల హైదరాబాద్ శాఖకు అధిపతిగా యున్నపుడు, వడ్డమాను త్రవ్వకములు చూడవలసినదని ఆహ్వానించాను. దానిని పురస్కరించుకొని ఆయన 30-11-82న వడ్డమానువచ్చి త్రవ్వకములను చూశారు, అప్పటికి త్రవ్వకములలో ఎక్కువ లోతుకు పోలేదు. అవశేషములు కూడ ఎక్కువగా లభింపలేదు. కానీ అప్పటికే రెండురకములైన కట్టడములు బయల్పడినవి. పైన నిర్మించిన కట్టడములు నాగార్జున కొండలోని బౌద్ధవిహారములను పోలియున్నది. క్రిందిభాగములో నిర్మితములైన కట్టడములకు, పైవానికి చాలా తేడాలున్నవి. పైగా పై కట్టడముల కాలమునాటివారు' క్రింది కట్టడములను పునాదులువరకు కూల్ద్రోసి, విహారములను నిర్మించిరి.[2] క్రిందిభాగపు నిర్మాణములలో ఒక స్తూపము ఉన్నది. దీనికిని అమరావతి, నాగార్జునకొండలోని స్తూపములకును చాలా తేడాయున్నది. ఇందువలన క్రింది కట్టడములు మరొక మతమువారికి చెందియుండవచ్చుననియు బహుశ మొదటి నిర్మాణములు జైన మతమువారికి చెందియుండవచ్చుననియు, అనుకుంటున్నానని నేను ఆయనతో చెప్పాను. కాగా బౌద్ధమునకును, జైనమునకును కళా సాంప్రదాయములలో ఆర్ట్ ట్రెడిషన్స్ ఎక్కువ తేడా లేనప్పటికి బౌద్ధమతాన్ని నిర్దేశించు బుద్ధ పాదము, సింహాసనము మొ॥నవి వడ్డమానులో కాన్పింపలేదని తెలిపాను. కాని శ్రీ శర్మ ఇచట జైనమతము లేనేలేదు అని ఘంటాపథంగా అప్పుడు చెప్పారు. ఇప్పుడు వ్రాశారుకూడ!

శ్రీ శర్మ వచ్చివెళ్ళినతరువాత మూడు సంవత్సరములు త్రవ్వకములు జరిగినవి. ఈ త్రవ్వకములలో ఎక్కువగా క్రిందిభాగములోనుండు కట్టడములు, శాసనములుగల కుండపెంకులు, కొండకు నైరుతిదిశలో మరొకస్తూపము, సున్నపుబొమ్మలు మొదలగునవి బయల్పడినవి. వీటికిని నాగార్జునకొండ అవశేషములకును పోలికలే లేవు. దీనివలన అవశేష సాంప్రదాయములలో తేడా కాన్పించును

శ్రీ శర్మ వ్రాసిన వ్యాస సారాంశమును 4 అంశములుగా విభజించు చున్నాను [3]

1) 'వడ్డమాను' అనునది వడ్డమానుకు తద్భవనామముగాని జైన తీర్థంకరుడైన మహావీరునకు ఎట్టిసంబంధములేదు
2) వడ్డమానులో బుద్ధధర్మమును నిర్దేశించు రెండు శాసనములు శ్రీ శర్మ చదివిన ప్రకారము ఉదహరించు చున్నాను
   ఎ) రాజ్ఞో ద మ క స అనుబధి. (పటము I చూడుడు)
   బి) ఉ త రో ద శ ర భో
3) అమరావతికి పూర్వనామ 'దమ్ఞకడ' ఇది వడ్డమానులోని 'డామక' రాజు శాసనమును పురస్కరించుకొని వచ్చియుండవచ్చు.
4) వడ్డమానులో వెలికివచ్చిన స్తూపారామములు బౌద్ధమత వస్తువునకు ప్రతీకలు.

ఇక సారాంశములోని మొదటి అంశము పరిశీలింతము. శ్రీ శర్మ వూరిలోనివారందరును 'వడ్లమాను' అని పిలుచుచున్నారనియు, ఎప్పుడో 1877లో సీవెల్‌దొర ఒక గ్రంథములో 'వుడ్లమేను' అని వ్రాశాడనియు ఉదహరించారు. ఇందువలనే ఈ గ్రామమునకు జైనతీర్థంకరుడైన వర్ధమానునకు ఏమియు సంబంధములేదు అని నిర్ధారణచేసేశారు. కాని శ్రీ శర్మ వడ్లమానను పేరుకు బౌద్ధధర్మమునకు సంబంధం ఏమిటో చెప్పలేదు.

నేనూ, శ్రీ శర్మ ఉద్యోగరీత్యా ఒకేత్రాటిపైనున్నవారమే. ఆయన ఆలోచనే నాకూ రావచ్చుకదా! నేను వడ్లమానా, వడ్డమానా అని తేల్చుకోకుండ త్రవ్వకాలకు దిగలేదు. సీవెల్ వ్రాసిన గ్రంథము నేనూచూశాను.[4] దానిలో 'వూడ్లమౌను' అనియు 'వు'కు దీర్ఘం తగిరించికూడ వ్రాశాడు. కాని రెవెన్యూ చార్టాలలోను, తాలూకా, కలెక్టరేటు చిత్రాలలోను 'వడ్లమాను' అను పేరు ఎక్కడా కాన్పించలేదు. ఇదికాక కొండక్రింద ఒక రాతిబండపై విజయనగర రాజుల కాలంనాటి లిపితో వ్రాసియున్న శాసనములో కూడ 'వడ్డమాను' అనే వ్రాసియుంది కాని 'వడ్లమాను' అనలేదు. వీనివల్ల వ్రాతలన్నింటియందును 'వడ్డమాను' గానే వ్యవహరింపబడెనని ఋజువగుచున్నది.[5] సీవెల్‌మటుకు అవూరు వెళ్ళినపుడు 'వడ్లమాను' అని ఆ వూరిలోనివారు చెప్పియుండవచ్చును. అదే ఆయన ఆయనభాషలో యాసగా వ్రాశారు. కాగా మాకు లభించిన అవశేషాలపైయున్న శాసనములలో—

1. ఒక కుండపెంకుపై వదమ (పటము 2)
2. మరొక కుండపెంకుపై తక వదమాన వీవతే (పటము 3)
3. పెద్ద శిలాశాసనముపై వదమాన నివాసికస 'ధముతిస'
   సమాతుకస పితుకస భాతుకస చులధముతికస కు(మా) (పటము 4)

అని ఉన్నవి.

అయితే శాసనలిపిలో ఈ మూడింటియందును కొంత వ్యత్యాసముకలదు. 3వ శాసనలిపి పశ్చిమకనుమలలోని నాసిక్, నానాఘాట్ మొ॥గు గుహలలోని ప్రాకృత శాసనముల లిపిని పోలియుండుటవలన క్రీస్తుపుట్టిన శతాబ్దమునకు చెందినదని నిర్ధారింపవచ్చును.

ఇందువలన క్రీస్తు పుట్టిన శతాబ్దమునకే ఈ గ్రామమునకు 'వడ్డమాను' అను పేరు యున్నదనియు చదువరులు గ్రహింతురుగాక! ఇక పోతే జైనతీర్థంకరుడైన మహావీరునకు ఈ గ్రామమునకు గల సంబంధమును తరువాత వివరింతును.

సారాంశమునందలి రెండవ అంశములో రెండుశాసనములు యున్నవి. శ్రీ శర్మ ఎట్లు చదివెనో పైన ఉదహరించితి, కానీ నేను చదివిన రీతి ఇది.

## 1. రాజ్ఞో 'సో' మ క స అ ను బ ధి

అనగా మూడవ అక్షరము నేను 'సో' అని వ్రాశాను. ఆయన 'ద' అన్నారు. శ్రీ శర్మ వడ్డమాను వచ్చినపుడు ఈ శాసనమును మేమిరువురము ఒకేవిధంగా చదివాము. కాని నేను తరువాత ఈ మూడవ అక్షరము 'సో' అయి వుండునని మార్చి ప్రచురించాను. ఇందువలన మా ఇరువురి అభిప్రాయములలో అగాధమేర్పడినది. నేను 3వ అక్షరమును 'సో' అని మార్పుచేయుటకు కారణము లేకపోలేదు. ఇచట ప్రచురించిన శాసనమును చూడుడు.



రాజ్ఞో సోమ కస అనుబధి

పటము-1

ఈ పదిఅక్షరములుగల బ్రాహ్మీ శాసనములో 3వ అక్షరమునకు 6వ అక్షరమునకు 'లిపి'లో కొంత సామ్యము కలదు. ఈ రెండు అక్షరములను చదువరులు చూచి గ్రహింతురుగాక. 6వ అక్షరము 'స' అని చెప్పుకొనుటలో శ్రీ శర్మకు ఎటువంటి అభ్యంతరము యుండదు. ఇప్పుడుకూడ మనము తెలుగులో వ్రాయు 'స' కూడ మూడవ అక్షరమును పోలియుండును, ఇదియును చూచి గ్రహింతురుగాక.

ఇక పోతే శ్రీ శర్మ మూడవ అక్షరము 'ద' అని ఎందుకు ఊహించెనో ఆలోచింతము. ఇదేసారాంశములోని మూడవ అంశముగా గ్రహింపగలరు.

అమరావతిలో మ్యూజియంనందు ఒక సున్నపురాతి స్తంభము ప్రదర్శింపబడియున్నది.[6] దానిపై కొన్ని చిత్రిత శాసనములు కలవు. దానిలో ఒక నదీ ప్రాంతమున స్తూపము, ఆరామములు మున్నగునవి చిత్రితములై యున్నవి. దీనికి సూచనగా ఒక శాసనము కలదు అందు ఈవిధముగా ఉదహరించబడినది. "ధమ్మకడ వందనామగోరి" అని బ్రాహ్మీలిపియందు కలదు.

పై శాసనమును పురస్కరించుకొని చిత్రింపబడిన కృష్ణానదీప్రాంతమున 'ధమక' రాజు ఏలుబడిలో నుండెననియు, అతడే బౌద్ధ స్తూపారామములను నిర్మించెననియు శ్రీ శర్మ యూహించెను. ఈయన వ్రాసింది ఇచట ఉదహరించుచున్నాను.

"బౌద్ధస్థానము పేరు ఎట్లువచ్చెను? రాజ ధమక నీ రాజ్యమును పాలించెననుటలో సత్యదూరములేదు. బహుశ ఈ ధమక నామము రాజధానియైనచోటికి సంక్రమించియుండుట మిక్కిలి సమంజసమైన యూహ. అట్లగుచో ధమ్మకడ యను నామము రాజు 'ధమక' లేక 'దామక' నుంచి సంక్రమించియుండనగును. ఈరాజు బహుశ ఇచట గోష్ఠికి అధ్యక్షుడు కాబోలు బౌద్ధమును ఉద్ధరించి పోషించనగును."

శ్రీ శర్మ పైన వ్రాసిన దానినిబట్టి చూసినచో బౌద్ధస్థానమైన అమరావతిలో ఒక గోష్ఠి జరిపినందువలన ఆ ప్రదేశమునకు 'ధమ్మకడ'మని పేరువచ్చినది. మరొక వాక్యములో ఈయన బౌద్ధమునుద్ధరించెనని వ్రాసెను. ఇది దేనిని ఆధారముగా జేసికొని చెప్పెనో తెలియుటలేదు. కాగా, 'ధమకుడు' గోష్ఠి జరిపినది వూరుపేరు మార్చుటకో లేక ధర్మప్రబోధముచేయుటకో తెలియుటలేదు.

ఇక ధమకరాజు బౌద్ధుడు అని నిరూపించుటకు అనేక రకములుగ



'వధవ' అని వున్న శాసనం

ప్రయత్నించెను. ఈ రాజుపేరుతో ముందున్న అక్షరమునకు ధ, దా, ద, దం మొ॥గు రూపాంతరములను ప్రవేశపెట్టెను. ఇది ధమక రాజుకు, ధాన్యకటకమునకు అక్రమసంబంధము కల్పించి ధాన్యకటకము బౌద్ధస్థానము అగుటవలన, రాజుకూడ బౌద్ధుడే అని చెప్పుటకు చేసిన ప్రయత్నమని తెలియుచున్నది. దీనిని చదువరులు గ్రహింతురుగాక.

సారాంశమునందలి 3వ అంశమునందు మరొక శాసనము కలదు. దీనిని శ్రీ శర్మగారు కుడ్య స్తంభ శాసనమని అనుకొనెను. కుడ్యమనిన గోడకదా! కాని ఇది స్తూపమునకు చుట్టూనూ కట్టించిన శిలా ప్రాకారమునకు (రైలింగ్)నకు చెందిన స్తంభము. దీనిలోని శాసనము రెండువరుసలలో యుండెను. కాని శ్రీశర్మ ఒకేవరుసలో వ్రాసెను. అది శాసనములో ఇటులుండెను.'

### 'ఉతరో దసరభో'

మొదటగా నేను ఈ శాసనమును చూసినపుడు క్రిందిభాగమునందున్న నాల్గుఅక్షరములు చక్కగా కన్పించుటవల్ల ఈ భాగమునకు ప్రాధాన్యమిచ్చితిని. 'ద స ర భో' అనగా 'పదవ స్తంభము' అని అర్థమగుచున్నది 'ఉతరో' అను దానికి 'అదనముగా' అని అర్థమును ఊహించుకొని ప్రచురించితిని.

కాని ఈ శాసనమునుగూర్చి తరువాత నా అభిప్రాయం మార్చుకొంటిని. ఏలయన మధురలో ఒక ప్రాచీన జైనశాసనమునందు 'ఉతరదాసుడు' వత్సీ పుత్రుడు అని పేర్కొనబడినది' దీనినిబట్టి ఒక జైనమతాభిగా గ్రహించితిని.

భట్టిప్రోలులోని బౌద్ధ అవశేషముల పేటికా శాసనములో 'ఉతర' అను పేరు ఉదహరించియున్నట్లు శ్రీ శర్మగారు వ్రాశారు ఈ అవశేషముల స్థాపనకు కుబిరకుడు, ఉతరుడు మొ॥గు వారు దోహదమిచ్చిరి. కుబిరకుడు రాజన్య కులాధిపతి స్తూపమును నిర్మించుటలో సహాయపడినంతమాత్రాన కుబిరకుడు బౌద్ధుడు అయిఉండాలని లేదుకదా! ఒకరాజు తనదేశములో మరొక మతము వారికి వసతికల్పించి వారి సంస్థలను ఉద్ఘాటనముచేయుటలో తప్పేమున్నది? ఇక్ష్వాకులు వైదిక ధర్మమునకు చెందినవారై యుండినను బౌద్ధమతసంస్థల అభివృద్ధికి దోహదపడిరా లేదా?[7] కాగా భట్టిప్రోలు శాసనములో కుబిరక, ఉతర మొ॥గు వారికి ముందు 'అర్హాదీనాం' అనే సంబోధన యున్నది. ఇది జైన శాసనములలోనే యుండును కానీ బౌద్ధములోయుండదు.

సారాంశములోని 4వ అంశములో శ్రీ శర్మ వడ్డమాను అవశేషములు బౌద్ధవాస్తువుకు ప్రతీకలు అని వ్రాశారు. కాని దీనిని విపులీకరించలేదు. కాగా ఆయన త్రవ్వకములలో పాల్గొనకుండానే ఈ అభిప్రాయమునకు ఎట్లువచ్చెనో తెలియుటలేదు పైగా జైనమత అవశేషములు క్రీస్తు 7వ శతాబ్దము వరకు ఆంధ్రదేశములో దొరకలేదని వ్రాశారు. ఎప్పుడో దొరకలేదు సరే, ఇప్పటి త్రవ్వకములలో ఎందుకు రాకూడదు?



తకప ...వాన పపతె అని వున్న శాసనం

పైన చెప్పిన విషయములు కొంత వివాదాంశములని అనుకొన్ననూ సూటిగా జైనధర్మమును సూచించు శాసనములు గల కుండపెంకులు ఎన్నో వడ్డమానుయందు లభించినవి. వాటిలో ముఖ్యమైనవి కొన్ని ఉదహరించుచున్నాను.

1. జినాన విహార పరివారామ :- ఇది జినవిహార పరివారము కొరకు అని అర్థమువచ్చును
2. మహా :- ఇది పైన ఉదహరించిన "వధమ" అను శాసనముతోపాటు వచ్చెను. ఇవి రెండును ఒకే కుండకు సంబంధించిన శకలములే, రెంటినీ కలిపినచో "వధమ మహా"(వీర) అని అన్వయించుకొన వచ్చును
3. సిధస :- జైన 'ఆచారాంగ' సూత్రములో మహావీరునకు 'సిద్ధ' అను పేరుకూడ ఉదహరింపబడియున్నది.
4. నేమి :- ఇది నేమినాధుని నిర్దేశించును. ఈతడు శ్రీకృష్ణుని సమ కాలికుడు. 22వ జైనతీర్థంకరుడు.
5. నందిగ హ.. :- నలదిగ్గ, హర్గిగ్గ అను జైనకులములు ఉన్నట్లు కల్ప సూత్రములవలన తెలుసుకోవచ్చును.
6. ఉకస :- 'ఉకస' నాగరగణము, జైనగణములలో నొకటి.
7. గణదత :- 'జైనపట్టావళి'లో 'గణదత్తుడు' ఉదహరించబడియున్నాడు
8. రథంజ :- పట్టావళి యందు ఒక గణధరుడైన భద్రబాహువలె ఈతడు కూడ గణధరుడు ఇతడే జైన 'భిక్షుక' సంఘమును స్థాపించినవాడు.
9. అయిలపొత్య :- కల్పసూత్రములలో ఇది ఒక జైనగణముగ ఉదహ రింపబడినది.[8]

ఇవేకాక శిలాశాసనములుకూడ కలవు.

1. అర :- ఇది 'అరనాధుడు'యైన తీర్థంకరుని సూచించును. ఈతడు 18వ జైనతీర్థంకరుడు.
2. ఆసరిర :- ఈతడొక దిగంబర జైనముని. వీని ప్రస్తావన శాసన రూపములో తమిళదేశమున మధురై ప్రాంతములోని 'కలుగుమలై' కొండలలో కనిపించును [9] లిపికూడ వడ్డమానులోని ఒక శాసనలిపిని పోలియున్నది.
3. గడ్డసరభో :- 'గోదస' శ్రుతకేవలుడైన భద్రబాహుని శిష్యుడు. వీని గౌరవార్థం వేయించిన శాసనము. ఈతడు 'గోదస' గణస్థాపకుడు.

పైనఉదహరించిన శాసనములన్నియు కల్పసూత్రము, పట్టావళి(దిగంబర), ఆచారాంగ సూత్రములు మొదలైన జైనగ్రంథములలో నున్న ఆధారములను పురస్కరించుకొని వడ్డమాను అవశేషములు, స్థూపములు మొదలగునవి ముఖ్యముగా అశోకుని కాలానంతరము జైనమత ప్రాధాన్యతను సూచించుచున్నవి. ఇవి వడ్డమానులోని జైనసంఘమునకు, దేశములో ఇతర జైనసంస్థలకు సంబంధ మున్నట్లు ఆధారములు కలవు.

ఆగ్రాకు చేరువలోనున్న మధురలో "కంకాళతిల" అనుచోట ఒక స్తూపముకలదు. దీనినిగురించి స్మిత్, బుహ్లర్ మొదలగువారు శాసనములను ఆధారముచేసికొని జైనస్తూపమని నిరూపించారు.[10] శ్రీ శర్మ చెప్పినప్రకారము అవి కుషాణుల కాలమునాటివి అనగా క్రీస్తుపుట్టిన మొదటిశతాబ్దమునాటివి అని చెప్పవచ్చు. ఈ కాలమునకుచెందిన శాసనములలో 'ధమతి'యను వానిగూర్చిన ప్రస్తావన యున్నది. వడ్డమానులో దొరికిన శాసనమునందు ఈ 'ధమతి' ప్రస్తావన వున్నది. పటము 4 చూడుడు.

ఈతడే 'వడ్డమాను' నివాసుడని నేను పైన ఉదహరించిన శాసనమునందు కలదు.

ఇవియునుకాక క్రీ.పూ. మధుర ప్రాంతమును "శుంగ" రాజులుకూడ రాజ్యమునేలిరి. ఆ కాలమునాటి ఒక జైన శాసనములోకూడ 'ఉతరదాసు'ని పేరు ఉదహరించబడినట్లు 'ఎపిగ్రాఫియా ఇండికా' రెండవ సంపుటమునందు కలదు [11] వడ్డమానులోని "ఉతరదాసునకు" కంకాళిల శాసనములో వానికీ లిపిలో ఎక్కువ తేడా కనిపించదు. మధురలో అతడు ఒక తోరణమును వేయించెను వడ్డమానులో ఒక శిలాప్రాకార స్తంభమును వేయించెను.

శ్రీ శర్మ ఒరిస్సాలో జైనసంస్కృతికి ఆయువుపట్టు అయిన ఖండగిరి, ఉదయగిరి కొండలలోని గుహల ప్రస్తావనే తీసుకొనిరాలేదు. క్రీస్తుకుపూర్వమే చేధి రాజ్యాధిపతి 'ఖారవేల' ఈ కొండగుహలలోని జైనకళను పోషించెను.[12]

ఈ గుహలలోయున్న కళాసాంప్రదాయమునకు, వడ్డమాను స్థంభశిల్పము పైనున్న కళాసాంప్రదాయమునకును చాలా పోలికలు కనిపించును. చెట్లను చిత్రించుటలో మానవరూపులు, దుస్తులు, శిరస్సున తలపాగా మొదలగునవి ఆభరణములు మొదలగువాటిలో ఎంతో సామ్యము కనిపించును అచట శాసనము లలో కొన్నిటి చివరలో 'స్వస్తిక' గుర్తుకలదు ఇదేగుర్తు వడ్డమానులో కొన్ని కుండపెంకులపైనున్న శాసనములందు కలదు.

ఇక ఖారవేల సంతతికిచెందిన కొందరి రాజుల నాణెములు విరివిగా వడ్డమాను త్రవ్వకములలో దొరికెను. పై ఆధారములనుబట్టి ఖారవేలుని సంతతి వారు కోస్తా ఆంధ్రప్రాంతమును క్రీస్తుకు పూర్వమే ఏలినట్లు ఋజువగుచున్నది. ఈ ఆధారములనుబట్టి వడ్డమానులో జైనధర్మము లేదనుట సత్యదూరము



'వడమాన నివాసకస ధము తిస సమాతుకస ప (పి) తుకస సభాతుకస చులధము తకకు (కూ)"

# చమత్కార కృష్ణాష్టకము

క॥ నీ కజ్ఞాః యము దరుమఁగ
నే కష్టమాయా ముకుంద నే దోసియయో
దాకట యోయెదు వాఁడెవ
డీకూనను దిక్కుఁయీవ యీశుండలుగన్॥ ౧

టీ. అజ్ఞా! చిత్రము. ముకున్ద! మోక్షము నొసఁగువాఁడా. నీకుయమున్-యమునిని, తరుమఁగన్-తరుముటకొరకు, ఏకష్టము-ఏమికష్టము, అయా-అయ్యో! నేన్-నేను, దోసియ-తప్పులుగలదానినే, యగుదున్-అగుదును. అకట-అయ్యో, దిక్కు-దిక్కులైన, ఈశుండు-ఈశ్వరుండవైన, ఈవే-నీవే,అలుగన్-కోపించఁగా ఈ కూనను-ఈ చిన్నవానిని, ఓమెదు-రక్షించువాఁడు ఎవఁడుః

గీ॥ పరమ పూరుష నిన్ను గోపాలుఁ గొలుతు
నీ యురధి మీగడన నవనీత మెంతు
బ్రహ్మణో భవత్తు పరమాన్న పరమ
ఓంచు నేలు తేరమ్మను నెంచుచుంటి॥ ౨

టీ. ఓ పరమ పూరుష - ఉత్తముండగు మొగవాఁడవైనవాఁడా, గోపాలున్-ఆలఁగాంచువాఁడవైన, నిన్నున్ – నిన్ను, కొలుతున్ - కొలిచెదను, ఈయుదధిన్ - ఈసముద్రమునందు, నవనీతము నవ-క్రొత్తగ, నీతన్-పొందఁబడిన, మీగడనన్-మీరు సంపాదించినదియైన ద్వారకను, ఎంతున్ - ఎన్నెదను, పరమాత్-బ్రహ్మణః - పరమాత్మలైన, భవతః - నీకన్నను, ఏలుతరమ్మను-ఏలుతరమ్మను, పరం-శ్రేష్ఠమైనదానినిగ, ఎంచుచుంట-నుతించుచున్నాను.

గీ॥ సుకియలుప్త భవద్భక్తి సుధి చెలంగు
వడలు పో న్నత్రిసములు నిన్ గడునుతింత్రు
పుణ్యపురుషులు వామపుఁబూస నీస
పర్యఁజేతరు, మైసూరుపాకు రిపువు॥ ౩

టీ. సుధి-మంచిబుద్ధికలవాఁడు, అలుప్తభవద్భక్తిన్-అలుప్త-లోపించని, భవత్-నీయందలి భక్తిన్-భక్తిచేత, సుకి - సుఖవంతుఁడై, చెలఁగున్ - ప్రకాశించును, అత్రిసములు-అత్రితో సాటియైనవారు, నడలు-ఎండబెట్ట (భగవంతుఁడు దయామృతముకలవాడు గనుక) నిన్-నిన్ను, కడున్-ఎక్కువగ - నుతింత్రు - స్తుతించెదరు. పుణ్యపురుషులు – పుణ్యాత్ములైన మానవులు, వామపుఁబూసన్-అందమైన బూసతో, నీసపర్యన్-నీయొక్క పూజను, చేతురు-చేసెదరు.

కం॥ మాసామి శుభాకారపుఁ
బూసలను మణుఁగుపూలఁ బూజింపఁగ నీ
మైసూరుపాకు రిపువును
మాసిని నాయత్రి సముని మానకఁ గొలుచున్॥ ౪

గీ॥ శ్రీద్ధ రాస్వప్రియా నీకు చేమొగుడ్పు
అధివారము రాకుండ హాయినిమ్ము
నాఽఘవర సేవ్య కేశవ నాథయాఢ్య
వేంకటేశ్వర నీసేవ వేగ నిమ్ము॥ ౫

టీ. యా-ఏ ఐక్మికలదో, శ్రీద్ధ=శ్రీ-సంపదలచేత, ఇద్ధ-వెలింగినవాఁడా నీకు-నీకు, చేమొగుడ్పు-నమస్కారము. అధివారము = అధి - మనోవ్యధలు - రాకుఁడ- హాయిన్-సుఖమును, ఇమ్ము. ఇవ్వుము. నాఽఘవర సేవ్య=నాఽఘ-పాపములు లేనివారిచేత, నవిద్యంతే అఘాని పాపానిశేషాం (నాఘశబ్దము నైక శబ్దమే మాదిరి-ది-అలుక్సమాసము,) కేశవ-కేశియను రాక్షసుని హరించినవాఁడా నాధీ-నాయకుఁడా, ఆఢ్య-సంపన్నుఁడా, వేంకటేశ్వరా-నీ సేవన్

భూద్ధరా పరధామరా భోఖభాస
మాదవాశన నీకు దండములు దేవ
భక్తధానాశనప్రీత భద్రదాత
వేంకటేశ్వర నీసేవ వేగనిమ్ము॥ ౬

టీ. భూ + ఉద్ధరా-భూ- ప్రళయసాగరమునుండి భూదేవిన్ఉద్ధరించినవాడా వరధామరా=వర-ఉత్తమమైన, ధామ-తేజస్సుయొక్క, రా-ధనముకలవాఁడా, భో-ఓయీ, ఖభాస=ఖ= ఆకాశముయొక్క, భాస-ప్రకాశమువంటి ప్రకాశము కలవాఁడా, మా దవాశన-మా-ప్రకాశవంతమైన, దవ–కాలుచిచ్చును, ఆదన–తినినవాఁడా, దేవ–దేవరా, నీకు–నీకు దండములు. భక్తధానాశనప్రీత=భక్త–భక్తుడైన కుచేలు కొసంగు. ధానా–అటుకులను, అశన – ప్రీతితో తినినవాఁడా, భద్రదాత–=భద్ర–మంగళములను, దాత–ఇచ్చినవాడా, వేంకటేశ్వర,నీసేవన్–నీయొక్క సేవను, వేగన్–త్వరగ, ఇమ్ము, ఇవ్వుము.

గీ॥ తొలఁగఁజేసెదు నీశక్తి యులిపికట్టె
పొంగఁ కిడిని చక్కెరపొంగలి కిడి
మాపు నీనుతి పైఁబడుపులి
యోక నెట్టెడు హరియొర మహిమ నీది॥ ౭

టీ. నీశక్తి–నీయొక్క బలము, ఉలిపికట్టెపొంగ అలికిడి = ఉలిపికట్టె=క్షుద్రునియొక్క, పొంగు=గర్వముచేతనైన, అలికిడిన్ = సందడిని వాఁగుడుచేఁగలుగు, తొలఁగఁజేసెదు=తొలఁగఁజేయును.

కవయిత్రీ తిలక శ్రీ విక్రాల శ్రీదేవమ్మ


## అధోజ్ఞాపికలు

1. ఇండియన్ ఆర్కెయాలజీ- ఎ రివ్యూ 1982-85 పుట. 2
2. టి. వి. జి. శాస్త్రి ఎండ్ అదర్స్ వడ్డమాను ఎక్స్కవేషన్స్ ఎండ్ ఎక్స్ప్లొరేషన్ ఇన్ ది కృష్ణావాలీ. 1988.
3. భారతి, జూన్ 1986, పే. 6-9.
4. భారతి, అక్టోబరు 1985 పే. 48.
5. " " " పే. 51.
6. ఎ. జి. ఘోష్, ఎండ్ హెచ్. సర్కార్, ఏన్షంట్ ఇండియా వాల్ నెం.22, పుట. 44-45.
7. ఇక్ష్వాకులు, అగ్నిహోత్ర, అగ్నిష్టోమ వాజపేయ, అశ్వమేధయాగము మొదలగు వైదిక కర్మలను చేసినట్లు శాసనములు గలవు.
8. ఎపిగ్రాఫియా ఇండికా వాల్. 2, పుట. 108.
9. ఎ. ఘోష్ (సం), జైన ఆర్ట్ ఎండ్ ఆర్కిటెక్చర్ వాల్ 1, పుట. 74.
10. స్మిత్ వి. ది జైనస్తూపా ఎండ్ అదర్ యాంటిక్విటీస్ ఆఫ్ మధుర. పుట, 24.
11. మిత్ర డి (శ్రీమతి), ఖండగిరి ఎండ్ ఉదయగిరి (ఆ.స. 20 ప్రచురణ) పుట, 81.
12. -అర్-పుట, 45.




సీరియల్

# మా రాజశేఖర చరిత్ర

బలివాడ కాంతారావు

(గత సంచిక తరువాయి)

తిరిగి వచ్చిన కన్నబాబు ఒక కొత్త విషయం మోసుక వచ్చాడు. ఆ విషయం వీధంతా వినపడేటట్లు చెప్పాడు. కన్నబాబు వెళ్ళేసరికి జోగయ్య అక్కడేవున్నాడట. ప్రక్కకు పిలిచి

"నాయనా కన్నబాబూ.... స్వలాభంకు పోయాను. దేముడు చిన్నచూపు చూసాడు." అన్నాడట.

"తమరు స్వలాభానికి వెళ్తే.... నా కొడుకు బరువు ఇన్నాళ్లూ మోస్తారా ?" అని కన్నబాబు అంటే

"తెలివైన కుర్రాడు. మంచి సాంప్రదాయం వున్న కుటుంబం నించి వచ్చిన రత్నం. వీడ్నో డాక్టర్నో, ఇంజనీరునో చేసి నా మనుమరాల్ని యిద్దామనుకున్నాను. అది పోవటం మా దురదృష్టం"అని అన్నాడట.

"ఇది మీదికాదు. మా దురదృష్టం" అని కన్నబాబు నొచ్చుకుంటే

"మరి యిక్కడ రాజశేఖరం వుండలేడు. వీళ్ళు వుంచలేరు. జపాన్ వాడు బాంబులు వేస్తాడని హడావుడిగా వుంది. వీళ్ళు తాళాలు వేసి మదనాపురం వచ్చేస్తారేమో ?" అని స్టేషను వరకూ సాగనంపాడట జోగయ్య.

ఈ విషయం వినేక రాజుకు యెంతో విలువైనది పోగొట్టుకున్నట్లనిపించింది. ప్రతిక్షణం ఆ కళ్లు, ఆ మాటలూ, ఆ అనురాగం జ్ఞప్తికి వచ్చేది. రాత్రుళ్ళయితే సరిగా నిద్దర పట్టేది కాదు. అవేవో కలలు. ఒకసారైతే ఒక ఆడది చీరకట్టి యెదరగా నిల్చున్నట్లు కలలో వచ్చింది. సౌదామిని అత్తయ్య వచ్చిందనుకుంటే.... "నేను- నన్ను మరి చావా ? జ్యోతిని" అంటే ఆ నెమ్మదైన నవ్వు-ఇంకోసారి జ్యోతి జ్యోతిలానే కలలో కనపడి "ఆ కథ-మంచి కథ-తప్పక పడుతుంది" అంటే చప్పున తెలివి వచ్చింది. కథ పడలేదు. తిరిగి రాలేదు. ఇంకేం కథలు రాస్తాడు ?

వేసవి యెండలా వుంది జీవితం. పట్నం అలవాటు పడిన వాడికి యీ పల్లె యిప్పుడు నప్పటం లేదు. ఏరు యెండినట్లే మనసు ఆలోచించకుండా యెండిపోయి వుంది. గమ్యంలేని జీవితంలా వుంది. ఏమీ తోచదు. తోచినా అన్నీ సంశయాలే. సంశయాలతో సతమతమౌతున్నాడు. వేడిగాడ్పులు కొట్టున్నాయ్. ఎండమావులు కన్పిస్తున్నాయ్.

ఏ రోజు కోపంపడినా, ఏ రోజు యీసడించినా ఏ రోజు పనిపాట్లతో నలగగొట్టినా, రమాదేవి యింట్లో, వాళ్లు వాళ్ళతో తిన్నదే పెట్టారు. తిండి దగ్గర మాత్రం సరిసమానంగా చూసుకున్నారు. –ఒక ముఖ్య విషయంలో ఆ ఆరేళ్లు వెతుక్కునే అవసరం లేక దర్జాగా పోయింది. ఇప్పుడు యిట్లో తనవెంట యైదుగురు. ఎక్కడి యుద్ధం - ఇక్కడీ మారుమూలలో తెచ్చిన అనర్థాలు యింతా అంతా కాదు. స్వలాభం నగ్నంగా నృత్యం చేస్తోంది. ధరలు పెరగడంతో బ్రతుకు సామాన్యులకు భారమైపోతోంది. వేస్తున్న ముష్టి పరిమాణం తగ్గింది. రావలసిన ధాన్యం రాబెట్టుకోవడం కష్టంగా వుంది. ఇంట్లో ఒకపూట అంబలి వండుతున్నారు. రాత్రిపూట నూకల జావ, ఉదయం చద్ది అన్నం బదులు నాలుగు మెతుకులున్న గంజి కాచుకుంటున్నారు. ఇవి తినే అలవాటు యెప్పుడో తప్పిపోవటం మూలాన రాజుకు కొత్తగా వుంది. బయటకు పొక్కకుండా శాంతమ్మ జరుపుకొస్తోంది.

ఇవన్నీ చూస్తుంటే వేగంగొండించాలన్న వుబలాట. వయసున్నా మిలటరీలో చేరేవాడే. వేసవి వడగాల్పులు తగ్గినా- తాగడానికి కోరుకున్న నిమ్మరసం దొరక లేదు. పద్మనాభ పురంకి యైదుమైళ్ళ దూరంలో చిన్న పట్నంలో హైస్కూలు తెరిచారు. ఈ ఏడాది అక్కడ స్కూలు ఫైనలు పెట్టున్నారు. కన్నబాబు పొరుగూరులో ముప్పయి రూపాయలు పెట్టి ఒక సైకిలు కొన్నాడు. పాత మోడలు పాత రేలీ సైకిలు. ఇరవై అరించీల ఫ్రేము. రాజుకు సరిగ్గా కాళ్ళే అందడం లేదు. సైకిలు తొక్కడం రెండు రోజుల్లో వచ్చేసింది. ఈ సైకిలుండడం కాస్త వుబుసు పోతోంది. కొత్త మోజు కదా కాళ్లు దువ్వుతున్నాయ్. వారం రోజుల్లో ఆ చిన్న పట్నం వెళ్ళాడు. ఆ హైస్కూలూ చూసాడు.

"ఈ సైకిలు కొనటానికి డబ్బు చాటుగా జోగయ్య బాబే ఇచ్చాడు. అతను యీ యేడాదికయ్యేజీతం, పుస్తకాల ఖర్చు, పరీక్ష ఫీజు అంతా అప్పుడే అందించేసాడు." మహానుభావుడు అని కన్నబాబు పొరుగు కరణం కుచేలరావుతో చెప్పగా"బాగాతురేది. ఒక్కడే కొడుకు. వాడివ్వక యింకెవడివ్వగలడని ?" కుచేలరావు తేల్చేసాడు. "నీకు మాత్రం లేదా ? నీ కెంతమంది పోయారని ?" అని కన్నబాబు అనగల పరిస్థితే కానీ నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరిగి ధన్యుడైన వాడుకదా ! నెలవు తప్పి మిత్రులను శత్రువులు చేసుకోడు కదా ? అందుకే యీ శతకాలు తీర్చి దిద్దిన మనిషి వూరుకున్నాడు.

రాజు హైస్కూల్లో చేరాడు. ఈ ఒక్క యేడాదే కదా చదువు. ఉదయమే తల్లి వంట చేసి కేరియరు అందిచ్చేది. మధ్యాన్నం స్కూల్లో తిని మళ్ళీ సాయంత్రానికి వచ్చేవాడు. ఇంటికి వచ్చే సరికి అలసిపోయేవాడు, వేగం నిద్దర వచ్చేసేది. మళ్ళీ ఉదయమే స్కూలుకు ప్రయాణం. మెట్టెక్కడం అంటే సామాన్యమా ? వీడేం పాసవగలడని వీధిలోని వారేకాదు. వూర్లోవాళ్లు

రోడ్డువార రోజూ సైకిలు మీద వెళ్తూ వస్తున్న రాజును చూసే పొరుగూరు వాళ్లూ అనుకునేవారు. ఇలా అనుకుంటున్నారని రాజుకు తెలిసింది. మధ్యాన్నం స్కూల్లో ఒంటరిగా రెండు గంటల సేపు వ్యవధి వుండేది. ఆ విశ్రాంతి సమయంలో హోంవర్కు నించి రాని పాఠాలు చదువుకోవటం జరిగేది.

రేలీ సైకిలే. కానీ దానికెప్పుడూ రిపేర్లే. బొక్కి టైర్లు. ఒకోసారి నడుస్తూనే ఢన్‌మని పేలిపోయేవి. స్కూలు వదిలాక అడితేగానీ కాదన్నారని ఆడుకునే సరికి బాగా సాయంత్రమైందొక సారి. సైకిలెక్కేసరికి అప్పుడే చిరు చీకటి. అలా స్కూలు దాటి చాలాదూరం వస్తే టైరు బరెస్టు అయిపోయింది. నడక ప్రారంభించాడు. చీకటి రాత్రి. నిర్మానుష్యం. నడక సులువై పోడానికి యింకెవర్ని తలుచుకుంటాడు ? జ్యోతినే తలచుకుంటూ నడుస్తున్నాడు. పంచదారకోసం అడా ఇవ్వడం మొదలు యెన్నెన్ని అనురాగపు గడియలు మనసులో మరువరాని ఘట్టాలై రంగుల సినీమా బొమ్మల్లా కనిపిస్తున్నాయ్. పద్మనాభ పురంకీ పొరుగూరుకీ మధ్య రోడ్డుకు ఒక వేపు పెద్ద సరుగుడుతోట, రెండోప్రక్క తాటి పెండం మధ్య మామిడితోట. ఈ మామడితోటలోని భూతాల గురించి తన చిన్ననాటినుంచీ విన్నాడు. ఆ తోట అంత దూరంలో వుందనగా తనలా త్రోవ పోయేవాడెవడైనా కలుస్తాడా అని కొద్దిగా ఆగినా యెవరూ కనపడ లేదు. ఆకాశంలో చుక్కలున్నా అంతరంగంలో వెలుగులేదు. పచ్చని పొలాల మీదనించి వీచే గాలి యేవేవో స్వరాలను మోసుకొస్తోంది. పురుగులు చిందర వందరగా యెగురుతూ కొన్ని శరీరానికీ, ముఖానికి టపా టపా ఢీకొంటున్నాయ్. తనంటే దెయ్యాలకి చిన్నప్పటినించీ మోజే. దెయ్యాల కబుర్లన్నీ యిప్పుడే జ్ఞాపకానికి వస్తున్నాయ్. చివరకు అక్కడ ఎంత సేపు ఆలస్యంచేస్తే అంత అనర్ధం అని అన్పించింది. ఆ తోట దాటేవరకు తను రెండు పనులు చెయ్యగలడు. ఒకటి సైకిలు బెల్లువాయిస్తూ నడవడం. రెండోది చేతిలో పంపు పట్టుకుని దెయ్యం యెదురైతే దానితో కొట్టడం. బెల్ వాయిస్తే నిద్రపోతున్న దెయ్యానికి మెలుకువ రావచ్చు కదా ! చడీ చప్పుడు లేకుండా పంపు పట్టుకుని వెళ్ళిపోతే మంచిదనిపించి మెల్లిగా కదిలాడు. తోట మొదట్లోనే శరీరం ఒక్కసారి గగుర్పాటు జెంది సైకిలాపి పంపు నెత్తాడు. అది సరుగుడు తోటలో గుడ్లగూబ అరుపు. నిజం తెలుసు కున్నాక హమ్మయ్యా అనుకుని ముందుకు వెళ్తుంటే మామిడి తోటలో యేవో కదులుతున్నట్లు చప్పుడు. అయినా ముందుకు పోతున్నాడు. చప్పున అటునించి యెవరో వస్తున్నారు. దెయ్యమైనా అయ్యుండాలి లేక దెయ్యం మనిషి రూపంలోనైనా రావాలని సైకిలు పంపు ఎడమ చేత్తో పట్టుకుని కుడి చేతితో సైకిలు హేండిలు పట్టుకుని నడుపుతున్నాడు... ఇంక పంపు యెత్తుతున్నాడు

"నాయనా రాజూ" అన్న పిలుపు

అది తాతయ్య పిలుపే.

"తాతయ్యా........"

"వచ్చావా నాయనా - సాయంత్రం నించీ వంతెన దగ్గర కాసుక కూర్చున్నాను. సైకిలు యెక్కడో పాడయ్యిందని యెదు రొచ్చాను"

ఈ తాతయ్య కింద తను చెయ్యవలసింది. తాతయ్య తన కింద చేస్తున్నాడు". మా మనుమడికి కేరేజీలోనికి రా" అని చెరుకు తోటలో దూరి గట్టుల్లోవున్న బెండచెట్ల నించి బెండకాయలో గోంగూరో లేక కోమట్ల యిళ్ళకు వెళ్ళి వాళ్ళు సంతలోనించి తెచ్చు కున్న కూరగాయల్నించీ దండుకుని ఇంట్లో వేసేవాడు. తాతయ్య వుంటే తినేవాడే. లేక తిండి పడిపోయింది.

"మీ కష్టాలు మనుమడి చెయ్యి కలిసివచ్చే వరకే..." అని ఒకనాడు భోజనం దగ్గర అంటే.

"మీరు వాడి ఆర్జన అనుభవించరా ?" అని కోడలన్నది. "సుఖపడమని అందరికీ దేముడు రాయడు. కొందరికే రాస్తాడు"

"పోనీ మీ మనుమడి సుఖమైనా చూడరా ?" అంది కోడలు. "సుఖం మరిగిన దానరి, పదం మరచినాడట ! వాడు సుఖం మరిగితే యీ బాధ్యత మరచిపోతాడు. గడించే డబ్బు వాడిది కాదు. గడించిన కీర్తి వాడిది కాదు".

"కిందకొక బొంతలా డబ్బు, మీదికొక బొంతలా కీర్తి వుంటే వాడికి చింతపడే అవసరం యేముంది ?" అంది శాంతమ్మ.

"వాడి తిప్పలు వాడు పడితే యింత బలగంవుంది - వీళ్ల తిప్పలెవరు పడతారు ? యోగ్యుడన్నవాడు యెదుట వాళ్ళకు యెసరు పెట్టడు. తనే అవసరమైతే యెసరులో మునుగుతాడు".

తన యెదరగా తాతయ్య తన జీవితగమ్యం తెలుసుకో-మరి యిన్నిసార్లు చెప్పడానికి సమయం లేదన్నట్లు. అయితే రాజు మిటుకు మిటుకమని చూస్తున్నాడు. చివరకు చేతిలోనున్న ట్రంప్ కార్డు కొట్టినట్లు శాంతమ్మ

"మీ వెంట ఒకరుంటే మీ కష్టాల్లో ఆదుకునేవారా ? లేదా ? కష్టాల్లో ఒకరు కాదు యైదుగురూ ఆదుకుంటారు".

తనకు ప్రియులైన ఇద్దరూ తలోలా చెప్పినా ఒక్క విషయమే చెప్పారని రాజుకు స్ఫురించింది. ఎంత వేగిరం చదువు అయిపోయి గడించి తాతకు సుఖపెట్టామన్న వుబలాటతో చదువు దీక్షతో చదువుతున్నాడు. ఇంకోధ్యాస పెట్టుకోకుండా చదువులోనే నిమగ్నమైపోతున్నాడు. రోజూ రానూపోనూ కష్ట మౌతున్నా యింట్లో కష్టాలు కళ్ళారా చూసి అభిమానం పెంచుకునే అవకాశం యీవూరు రావటంవలన దొరికింది. పట్నంలో వుండగా రానురాను దూరంగా పోతున్న ఆప్యాయత బంధాలు యిప్పుడు మళ్ళీ గట్టి ముడిగా బంధించుక పోయాయి.

ఏప్పుడో గడించేవరకూ చేతులు కట్టుకుని కూర్చునే బదులు తాతయ్యకు యిష్టమైనవేమైనా వున్నాయా అంటే—— తాతయ్యకు చుట్టలు యిష్టం. చుట్టలు వూర్లో కోమటి వాళ్ళో యెవరో ఒకరు యిస్తున్నారు. తాతయ్య కొంత ఆస్తి చేపలకే వెచ్చిచాడంటారు. కంపు లేకపోతే ముద్దదిగేది కాదట. కంపుంటే కుంపడు వెళి

పోతుంది. ఇదివరలా చేపలు పూరకనే యిన్ని యిచ్చేవాళ్ళు లేరు. అన్ని ధరలతోపాటు చేపల ధర పెరిగిపోయింది. ఇది వరకు చేపలు తిననివాళ్ళు యిప్పుడు రుచి మరిగారు. అక్టోబరు నెలలో చివరలో చిన్న చలి వేస్తున్న రోజుల్లో చేపలు బాగా పడు తున్నాయ్. తనతో పల్లెటూరి బడిలో చదువుకున్న సిమ్మడు గెడ్డవల వేస్తున్నాడు. దిగువ గెడ్డలో రాత్రి మీద యీ వల మదుంకి తగిలించి ప్రతి పది నిముషాలకు ఆ వల చివర విప్పితే చేపలు బుట్టలో పడతాయి. రాజుకు యీత వచ్చు. గెడ్డలో దిగినా ఫరవాలేదు. సిమ్మడు వస్తావా అని పిలవగానే తాత జ్ఞాప కానికి వచ్చాడు. రేపు ఆదివారం శలవు. ఈ రాత్రింతా మేల్కొంటే తన కిచ్చిన వాటాతో అదృష్టం పండితే మూడు రోజులు తినొచ్చు. తాతయ్యకు ప్రత్యేకంగా వండిపెట్టవచ్చు. ఇదే నిజానికి తన కష్టంతో తొలి ఆర్జన అవుతుంది. బోజనా



లయ్యాక ఆ రాత్రి సిమ్మడు బృందంతో మైలు దూరంలోనున్న గెడ్డకు వెళ్ళాడు. వల తగిలించారు.

చేపల మీద ఆశతో వెళ్తే, చంద్రవంక నవ్వి కృంగింది. సృష్టి రహస్యాలను తెర విప్పి చూపిస్తున్నట్లు ఆకాశం చుక్కలు నిండిన రమ్యశాలగా వెలిగిపోతోంది. మసుతల వంటి సువాసనలతో నిండి విహరించే గాలి, మనసును పారవశ్యం చేస్తోంది. ఓహోహో అని కూనిరాగం తీస్తే గగన సీమలోని ప్రేయసి అందుకుని చుంబన స్పర్శతో అలసట జెందుతున్నట్లు యేమిటా నిశ్వాసం?

గెడ్డకు రెండు ప్రక్కల మొగిలి తుప్పలు ప్రక్కనించే దారి. మొగలి రేకుల్లో మొగిలి పాములుంటాయంటారు. ఆ పాముల గురించి ఆలోచించేబదులు, ఆ ముల్లు గుచ్చుకుంటాయని దూరంగా వుండే బదులు— ఆ మొగలి పువ్వు వాసనలు ఆశ్వాదిస్తే.... పెంచలయ్య చదువు గురించి చేసిన వాఖ్యానం తరచు రాజుకు గుర్తుకొస్తోంది. ఈ చేపలు పట్టడం—ఒక చదువే!

తొలిసారి గెడ్డలో దిగి బుట్టలో వంచి వల విప్పితే కర్రి పుల్లలూ చెత్తతోపాటు జానెడేసి గాజు రొయ్యలు వచ్చాయి. రక రకాల చేపలు—చిన్నా పెద్దా ఏటి చావల్లో మేటియైన వాలుగు చేపలు, మిట్టలు, జెల్లలు — యెన్నెన్నో రకాల చేపలు పడ్డాయ్. చేపలు పడుతున్నకొద్దీ ఆశ హెచ్చయింది. తెలతెలవారే వరకు వుంటే చివర బుట్టలో పామొకటి కూడా పడగానే బుట్టను గట్టు మీదకు విసిరి పైకి వచ్చారు. పాము పొలంలోనికి బిలబిలా ప్రాకుకొని పోయింది. ఇటూ ఆటూ చెదిరి పడిన చేపలను యేరుకుంటూ యింటికొచ్చారు. ఆ రాత్రి గట్టుమీద కూర్చొని దెయ్యాల కబుర్లు ఆడుకున్నా దెయ్యం యేదీ రాలేదు. ఒక్కడుంటే మనసే దెయ్యమౌతుందేమో? పదుగురితో వుంటే లేనిపోని ఆలోచనలకు తావేదీ?

ఆ రాత్రి తాతయ్య చీకట్లో ఒంటరిగా దెయ్యాలతోట దగ్గరకు వచ్చాడు. ఈ రాత్రి తను దెయ్యాలు తిరిగిన చోట చేపలు పట్టి తనవంతు యింటికి ఉదయమే తీసుక వెళ్ళాడు. తీసుక వెళ్ళిన చేపలనించి రెండు రొయ్యలు దిష్టితీసి దూరంగా పడేసింది.

"ఏంచేతంటే?"

"చేపల వెంట దెయ్యాలు సులువుగా వచ్చేస్తాయి. దిష్టితీసి పారేస్తే అవే పోతాయి."

ఆ గెడ్డ దగ్గరున్న మొగలితుప్ప ప్రక్క చెట్టుపైన దెయ్యం వుందో లేదోగాని పీకంతా మూగిపోయి యెన్ని చేపలో అన్నారు. ఇదో దిష్టి అంది శాంతమ్మ వాళ్ళు వెళ్ళాక. రాత్రంతా కష్టపడి ఆర్జించిన అర్జన. తాతయ్యకోసమే తెచ్చాను అని అన్నా పేరు అతనిదేగానీ యింటంతా తిన్నారు. అయితే తాత కోరినట్లు ఆ వాలుగు చేపలో చింతకాయ పులుసు చిక్కగా పెడితే - మూడు రోజులు మురిపెంగా తాతయ్యే తిన్నాడు. ఎన్నాళ్ళకెన్నాళ్ళ మనసులోనున్న కోరిక యీ మనుమడు తీర్చాడు.

ఆ మూడోరోజు తాతయ్య దగ్గుతున్నాడు. రాత్రి సరికి ఊపిరి సరిగ్గా పీల్చలేక పోతున్నాడు. పిల్లి అరుపులా వూపిరి వస్తోంది. గుండెకు నూనె రాసి కాపినా అర్థరాత్రికి వుబ్బసలా వచ్చేసింది. నాటు వైద్యునికి తెస్తే కాస్త నల్లమందు యిచ్చినట్లుంది. నిద్దర పట్టేసింది. ఉదయం లేచే సరికి ఆలస్యం. తెలివి వచ్చినా లేవలేక పోయాడు. ముఖంలో కాస్త పొంగు కనిపించింది. పాదాల వేపు చూస్తే కాస్త పొంగినట్లున్నాయ్. ఆతృతగా చూస్తున్న మనుమడితో "ఉబ్బస మన యింటావంటా లేదు. ఇది వుబ్బస కాదు" అన్నాడు. మళ్ళీ ఆ రాత్రి వూపిరి సలపక చప్పున నిల్చుండి పోయాడు. పడిపోవలసింది. రాజు అడ్డుకున్నాడు. వీధిల్లో అప్పుడే గుసగుసలు" ఆ చేప యెంత రుచో అంత వాతం. చిక్కటి చింతకాయ పులుసు వూపిరి తిత్తులకు పట్టేసింది. ముసలాడు తెములడం కష్టం"

ఈ గుసగుసలు రాజు చెవిలో పడగానే తనెంత పొరపాటు పని చేసానని నొచ్చుకుంటున్నాడు. స్కూలుకు వెళ్ళినా త్రోవంతా యిదే తలపు. "జ్యోతి నానుంచే పోయిందన్న వాదు చాలదని, తాతయ్య నేను తెచ్చిన చేపలు తినే పీకమీదకి తెచ్చుకున్నాడని యీ అపవాదును మొయ్యాలా?"అని అనుకొని స్కూల్లో యింటర్వల్ లో అలా ఒంటరిగా ఒక మూల కూర్చొని

"చిన్నప్పుడు దెయ్యాలు వాలాయన్నారు. అవి కుంభం పోస్తే పోయాయట. ఇప్పుడు యీ అపవాదులు కుంభం పోసినా పోని దెయ్యాలై పోయాయని" పిచ్చివానిలా తనలో తనే నవ్వుకున్నాడు. తన ఇంగ్లీషు పుస్తకంలో వున్న హేమ్లెట్ నాటక భాగం జ్ఞాపకి వచ్చింది. "టు బి అర్ నాట్ టు బి" దెయ్యవల సిందంతా ముందుకుంది. ఇప్పుడే చేతకాని వాడినైతే యెలా? దెయ్యాల వాదన హేమ్లెట్ వాదననించి యీ తన వాదనలోనికి దిగాడు. ఇదే చదువు అనుకున్నాడు.

వారం రోజుల్లో తాతయ్య జబ్బు మోపు చేసింది. మంచం దిగలేక పోయాడు. అంతా మంచంమీదే అయిపోతుంటే శాంతమ్మ విసుక్కోకండా సేవ చేసింది. శరీరం పొంగుకన్నా పాదాలనించి తొడల వరకు పొంగు అధికంగా వుంది. బాధప్పుడు "రామరామ" అనుకుంటూ వుండేవాడు. దగ్గిరికి వెళ్ళిన మనుమడి ఒళ్ళు ఒకసారి తడిమేవాడు. ఆ ముఖం వేపు చూసేవాడు. ఎన్నెన్ని జ్ఞాపకాలు వచ్చేవోగానీ ఒక్కమాట పెగిలేదికాదు. దైవ ప్రార్థనలు నిత్యం చేసే తాతయ్య యిప్పుడు పదిరోజులై యేమీ చెయ్యటం లేదు గదిలో చుట్టూ గోడలకున్న ఎన్నో దేవుళ్ళ బొమ్మలవేపు ఒకోసారి తేరి చూస్తున్నాడు. శక్తిని వుత్పత్తి చేసే శరీర యంత్రాలన్నీ మరమ్మత్తులో పడ్డాయి. మాట పడిపోకముందే యేదో చెప్పాలన్న ఆతృత. మనుమడు దగ్గరుండగా కోడలితో "ఏదైనా పుణ్యం చేసివుంటే....అదంతా నా మనుమడి పరంగా వదిలివెళ్తున్నాను...."

అదే తాతయ్య ఆఖరి మాటలు. నుదుటి మీద కుదురుగా చెయ్యిపెడితే కళ్ళు మూసుకున్నా తాతయ్య పెదిమల్లో నవ్వు కనిపించింది. ఒకసారి పాదాలూ, కాళ్ళూ చేతులు తాకాడు.

పాదాలు చల్లబడి పోతున్నాయ్‌. కాళ్ళు చేతులు కాస్త వెచ్చగా వున్నాయి. ఆ వెచ్చదనం యెంత సేపో లేదు. అందరూ గది లోపలకు గబగబ వచ్చి తాతయ్యను బయట చాప మీద వేసే వారు, ఏడ్చేవాళ్లు చుట్టూ కూర్చొని యేడుస్తుంటే రాజు తాతయ్య శవం మీద పడేయేడుస్తుంటే వాడిని ప్రక్కకు లాగి శవం మీద గుడ్డ కప్పారు.

## 14

పెద్ద మనుమడు పేలాలు జల్లుతుండగా పెద్ద వీధినించి శవం తూర్పుకు వెళ్ళి ఆ చివర దక్షిణంకు తిరిగింది. వంశధార నది ఒడ్డున వూరు బయట శ్మశానం. శ్మశానంలో మర్రిచెట్టు వుంది. కన్నబాబు తల గొరుగు పెట్టినా రాజు అలా అందరూ వచ్చేవరకు అక్కడే వున్నాడు. వచ్చిన దుఃఖాన్ని తాతయ్యను తలచుకుని ఆపుకుంటున్నాడు. ఇంట్లో వీధిలో యెక్కడికి వెళ్ళినా తాతయ్యే. ఈ కొద్ది నెలలూ మరీ దగ్గరై పోయాడు. ఈ మహావృక్షం క్రింద కూర్చొని అక్షరాభ్యాసం నించి అన్నికథలు విన్నాడు. అప్పుడు దారివేరు. ఇప్పుడిప్పుడే యీ మహావృక్షానికి దగ్గరగా నిల్చొని అర్ధం చేసుకోడానికి ప్రయత్నిస్తుంటే యిది కూలిపోయింది. చెట్టు కూలినా ఆ చేవ చావలేదు.

గదిలో మిద్దెవేపున్న దూలాలకు వ్రేలకట్టి వున్న బాణాలూ, గదలూ, చక్రాలు చూసి తాతయ్య కృష్ణుడుగా వేస్తున్న వేషాలు జ్ఞప్తికి వచ్చినయ్‌. చిన్నప్పుడు చూసినవి సరిగ్గా జ్ఞాపకం లేదు గానీ ఒకసారి శలవుల్లో వేసినవేషం గుర్తుంది .

" ఎక్కడ నుండి రాక యిటకు
ఎల్లరు సుఖులే కదా........?"
"అలుగుటయే యెరుంగని అజాత శత్రుడు...."

ఇలా అక్కడ పదం యిక్కడ పదం జ్ఞాపకం వస్తుంటే పైనున్న చక్రం తిరుగుతున్నట్లే అనిపించింది.

సుందరమ్మ అన్నది.

' అదృష్టవంతుడు '

" కష్టాలు పడ్డాడు" అని కరణం భార్య అంటే

' వాళ్ళ తండ్రిపోతే పేలాలు జల్లడానికి అప్పటికి మనుమడు లేడు. ఇతనుపోతే పేలాలు జల్లించుకున్నాడు"

"గోపాలం తండ్రి అంత గడించాడు కదా-ఇతను యేం మిగల్చలేదు"

' ఎంతవున్నా ఆ ముసలాడు బతకలేక పోయాడు. ఏమీ లేకపోయినా గోపాలం అన్నయ్య బతికేసాడు. ఎవరిది గొప్ప బ్రతుకు? '

ఇలా వూర్లో యిక్కడా అక్కడా తాతయ్య గురించి విన్నదీ తాతయ్య జీవితంగురించి తెలుసుకున్నదీ-అర్ధం చేసుకోడాని యింకా తను సరైన చదువు చదువుకోలేదను కున్నాడు.

చచ్చిన నాటి దుఃఖం మరునాటికి వుండదంటారు. దుఃఖం తగ్గితే గానీ సుఖానికి చోటుండదుకదా? దుఃఖం దుర్గంధం అయితే సుఖం సెంటు వాసన లాంటిది. సుఖ దుఃఖాలు చెప్పుకోడానికి ఫరవాలేదుగానీ భరించవలసి వస్తే సెంటు వాసనుండాలి యెక్కువగా?

అందుకే కామోసు చదువుమీద రానురాను మామ్మూలు శ్రద్ధ వచ్చింది. చదువుకూ సెంటు వాసనకు దగ్గర సంబంధం కదా? అయినా యెప్పుడో ఒకసారి తాత రూపో మాట మంచీ యేదో ఒకటి చటుక్కున మనసులో మెదలి కాస్త కళ్ళల్లో నీరు నిండుకునేవి. తను చదువు పూర్తిచేసి ఆర్జించే వరకైనా వుండలేదు. తొలి జీతం అందుకొని తాత చేతిలో పెట్టాను కున్నాడు.

మెట్రిక్కులేదని అనుకున్న వాళ్ళంతా మెట్రిక్కేసాడంటే నమ్మలేక పోయారు. స్కూలు తెరిచాక మార్కుల పుస్తకం వచ్చింది. మూడు సబ్జక్టుల్లో ఫస్టు వచ్చాడు. ఊరికే కూర్చుంటే తోచడంలేదు. పై చదువులు చదవడానికి శక్తి లేదు. ఊర్లో ప్రవేట్లు చెప్తానని అనుకున్నా డబ్బిచ్చి యింగ్లీషు ముక్కలు చెప్పించుకునే వాళ్ళు కనిపించలేదు. తను చిన్నప్పుడు యాత్రకు యేపూరు వెళ్ళాడో ఆవూరో మొదట యిద్దరూ, తరువాత ముగ్గురూ పిల్లలు ప్రవేట్లుకి కుదిరారు. తొలినెల ఆర్జన యిరవై రూపాయలు. అది తీసుక వెళ్ళి తండ్రిచేత పెట్టాడు. వాకిట చెట్లో మొదట పండిన పండు దేవునికి నైవేద్యం పెట్టినట్లు యీ డబ్బు యింట్లో అవసరంవున్నా ఖర్చు పెట్టకుండా కన్నబాబు మంచి గ్లాస్కో పంచెల చాపు కొన్నాడు. కొడుకును వెంట పెట్టుకుని మదనాపురం తీసుక వెళ్ళాడు.

' నా కొడుక్కి విద్యాదానం చెసి మాయింట్లో దీపం వెలిగించారు. ఇదివాడి తొలి ఆర్జన. వుడతాభక్తి అని స్వీకరించండి, అని రాజు చేతి మీద పంచెల చాపును జోగయ్యగారికి అందించాడు కన్నబాబు. అందుకుంటూ జోగయ్య కళ్ళు నలువుకున్నాడు.

" నాయనా: నేను నిమిత్త మాత్రుడ్ని. మనుషులం యెంతో యేదో చేసేయాలని తాపత్రయ పడ్తాం. మనం అనుకున్న దొకటి జరిగే దొకటి అయితే అది దైవ సంకల్పం. ఈ దైవ సంకల్పం బాధాకరమైనా, నవ్వుతూ స్వీకరించ వలసిందే: '

జోగయ్యఅంటే గౌరవమే. జోగయ్య చెప్పింది చిన్ననాటి శతకం కంఠస్థం చేసినట్లే విన్నాడు. గాలికి వదిలేసినట్లు కర్మకు యేదీ వదల దల్చుకోలేదు. ఉద్యోగం వచ్చేవరకూ ప్రైవేట్లు చెప్పడానికే నిశ్చయించాడు. ఎన్ని ప్రైవేట్లు చెప్పినా యెంతో కొంత కాలం మిగుల్తునే వుంది. బాగా చదువు చెప్తున్నాడని యీ నోటా ఆ నోటా ప్రాకటం వలన ఆడపిల్లలు కూడా ప్రవేట్లు చెప్పమని వస్తున్నారు.. ఆరు నెలల్లో అరవై రూపాయలు సంపాదిస్తున్నాడు. తండ్రికన్నా తన ఆర్జనే హెచ్చు.

ఊర్లో పట్నం వాసన వున్నది సౌదామిని అత్తయ్యే. పిల్లల తల్లయినా యింకా కుర్చీమీదే కూర్చుంటోందన్న వాదు పోలేదు. వయసు పెరిగినా తరిగినట్లు, చక్కగా అలంకరించుకుని మరీకన్పిస్తోంది. ఇప్పటికీ న్యూస్ పేపరు తెప్పిస్తోంది. రాజుకు రోజూ న్యూస్ పేపరు చదవమని యిస్తోంది. న్యూస్ పేపరు చదవడం వలన ప్రపంచం అంతా తనవూర్లోనే వున్నట్లు అనిపిస్తోంది. ఈ తెలుగు పత్రిక చదవటం వలన యింగ్లీషు ప్రభావం వలనరాని తెలుగు మాటలు యిప్పుడు వస్తున్నాయి. కొన్ని తెలుగు పదాలు తెలుగువాడైనా తనకి రాని పరిస్థితి యేర్పడింది యిది వరకు. ఇంగ్లీషులో తలచుకొని తెలుగులో రాయటం అలవాటైంది. రమణయ్య యింట్లో ఇంగ్లీషు పేపరొచ్చేది. స్కూల్లో ఇంగ్లీషుకే ప్రాధాన్యం హెచ్చు వుండేది. ఈ పరిస్థితి మార్పించడానికి సౌదామిని అత్తయ్య తన దగ్గరున్న నవలలు అప్పుడప్పుడు చదవమని




యిస్తుండేది. ఇవి చాలా మంచి నవలలనేది. సౌదామిని అత్తయ్య అంటే అవి మంచి నవలలే అయ్యుండాలి.

ఈ పేపర్లుచూసి అక్కడక్కడా అప్లికేషన్లు ఉద్యోగంకి పెట్టమనేది.

వయసు యీ సివిలు ఉద్యోగానికి చాలదు కానీ మిలటరీ ఉద్యోగమైతే మనుషులు అవసరం. వయసుతో పనిలేదు-ఎప్పుడూ వూరు కదలని వాళ్ళే కొందరు గతిలేక మిలటరీకి వెళ్ళిపోయారు. మిలటరీకి వెళ్ళిపోవడమంటే చచ్చిపోవడానికి వెళ్ళిపోవడమే అన్న నమ్మకం యీ పల్లెటూర్లో అందరికీ వుంది. కొత్తగా పట్నంలో రేషనింగు పెట్టారని దరఖాస్తు పంపితే పిలుపే రాలేదు. స్వంతగా వెళితో, వేసుకుంటారేమోనని కుమారస్వామి అంటే 'అది టెంపరరీ. ఎప్పుడెత్తేస్తారో? వెళ్లినా ఆ జీతంలో నెలకు అరవై రూపాయలు మిగిల్చి యెలా పంపగలను?' అన్నాడు.

' పంపాలనుకుంటే అలాంటి అరవైలెన్నయినా పంపగలవు:

'ఎలాగా? '

',ఆ డిపార్టుమెంటులో బాగా లంచాలు దొరుకుతాయి"

" పుచ్చుకోవాలని వుందా? "

' పుచ్చుకోకపోతే నిన్ను అందులో ఆరురోజులు కాదు కద ఆరు క్షణాలుంచరు '

' అయితే నా కొద్దు "

" అలా మడిగట్టుకుంటే మీ తాతయ్య చివరకు యెంత హీనంగా పోయాడో...."

"మా తాతయ్య అంత హీనంగా పోయాడా ?"

' కాదా? డబ్బేవుంటే పట్నం తీసుకవెళితే.......ఆ జబ్బుకు యింజక్షన్లున్నాయ్. ఈ నాటు వైద్యంలో ఆ జబ్బుకు నల్లమందు నిద్రకు తప్పించి యింకో మందులేదు"

డబ్బు వుండగా జ్యోతిని ఎందుకు బతికించుకోలేక పోయారో గుర్తుకు రాగానే రాజు వాదించకుండా వూరుకున్నాడు. ఈ వాదనలు విన్న సౌదామిని అత్తయ్య చాటుగా.

"రాజూ! నీకున్న విద్య డబ్బురాని విద్యకాదు. నివ్వు గడించిన డబ్బు పాపిష్టి డబ్బని యెవరైనా అంటే ఆ పాపం డబ్బుది కాదు.—'నీది గడించిన డబ్బును ఖర్చుపెట్టని వాళ్ళే హీనంగా చస్తారు. మీ తాతయ్యకేం బాగా ఖర్చు పెట్టేసాడు "

తాతయ్యగురించి యిద్దరు రెండు విధాలుగా చెప్పారు. ఏది సబబో యేది బేసబబో తను నిర్ధారించుకోవాలి.

యీ చదువు తరగని చదువు. జీవితం అంతా నేర్చుకునే వుంటాడేమో మనిషి. పెంచలయ్య అన్న మాటలు యిప్పుడు తల్చుకుంటే వంట పడ్తున్నాయ్.

" బాధించేవాళ్ళకన్నా బాధపడే వాళ్ళు గొప్పవాళ్ళు. వాళ్ళ పక్షం చేరాలి" అనుకున్నాడు. అనుకోవడం సులువే. ఆచరించడం కష్టం. గడించాలనుకోవడం సులువే, గడించడం కష్టం.

స్కూలువదిలినా రాజు చదువు లోకం తీరు చూస్తుంటే సాగి

పోతూనే వుంది, ఇది శరీరంలోని నరాల్లా ఆది అంత్యం తెలుసుకోలేనిది. అందుకే కామోసు యీ విద్యాధనాన్ని యెవరూ దొంగిలించలేరని అన్నారు.

పద్దెనిమిదేళ్ళు నిండాయ్. అప్లికేషన్లు పేపరు చూసి పెట్టూనే వున్నాడు. సౌదామిని అత్తయ్య యిస్తున్న కొవ్వలి, జంపన పుస్తకాలు చదివి "యీ మాత్రం నేను రాయలేనా?" అనిపించి యేదో రాయాలన్న తపన పుట్టింది- యీ తపన పుట్టడానికి కారణం చదవడానికి యింకేం పుస్తకాలు ఆ పల్లెటూర్లో లేవు. వూరకే గోళ్ళు గిల్లుకొని కూర్చోవటం యిష్టం లేదు. ఎవరితో చెప్పకుండా ఒక రోజు రాతకు కూర్చున్నాడు, కథ పాతదే. ఇది వరకు వినోదినికి పంపిన కథే. ఆ రోజులో ఆలోచనకంటే యీరోజు ఆలోచనలు మూడేళ్ళు యెదిగాయి కదా! ఇది వరకు తెలుగుకన్నా యిప్పటి తెలుగులో జిగిబిగి వచ్చింది. కష్టమైన భావాన్ని సులువుగా కొవ్వలి, జంపన చెప్ప గలగటం వలన అవి చదివించ గలుగుతున్నాయని ఆ వరవడిలోనే యిది వరకు రాసిన కథానాయకుడికి మరికొన్ని విశేషణాలు చేర్చాడు. పేదవాడైనా గజ యీతగాడు. పెద్ద యింటి అమ్మాయి గాలికి వచ్చి తన్మయమై నీటిలోనికి వెళితే దొంగ కెరటం లాక్కుపోతే యీ గజయీతగాడు రక్షిస్తాడు. జ్యోతిని ఆ పెద్దయింటి అమ్మాయిని చేసి ఆమె చూపులను శరీర పొందికను వర్ణించి ఒక జగన్మోహినిని చేసేసాడు- అన్యోన్యత యేర్పడగానే అంతస్థులు చూడకుండా వుండటానికి ప్రేమకు గుడ్డిని ఆపాదించాడు. కారు షికార్లు లేకపోతే డ్యూయెట్లుపాడే అవకాశం వుండదుకదా! యీ కారెలా వచ్చిందని యీ పేదవాడి మనసు ఆలోచించడం సహజం కదా! వీడు దోచాడు. బ్రిటిష్ వాడికి అడుగులకు మడుగులొత్తే వాడి కూతురీమె. పొత్తు కుదరదనుకుంటే తనను వదలదే. అల నాడు శ్రీరామచంద్రునితో అడవికి వెళ్లిన సీత మనస్తత్వాన్నే యింగ్లీషు చదువుకున్నా యీ అమ్మాయి చూపిస్తుంది. విద్యయే భాషలో చదువుకన్నా వినయం ప్రసాదిస్తుంది కదా. అందులో ఆడవాళ్ళకు వినయం అత్యవసరం. అది లేక పోతే బతకలేరు. యీ వినయంతో తన వెంట వచ్చి తన యింట్లో గంజి తాగడానికి కూడా వెనుకాడదీ నాయిక. దానితో కోటలోనే పాగా వేసాననుకుంటాడు మన హీరో! కాంగ్రెస్ జెండాతో వూరేగుతూ ప్రజలను తన వెంట తీసుకవచ్చి తన ప్రియురాలి తండ్రినే సవాలు చేస్తాడు. దేశ స్వాతంత్రం గురించి దీర్ఘోపన్యాసం యిస్తాడు. తండ్రిని కాదని నాయక యీ స్వాతంత్ర సమరంలో దూకుతుంది. అప్పుడు చూడండి తమాషా? లేక లేక పుట్టిన ఒకే ఒక కూతుర్ని వదులుకోగలడా? అప్పుడు కూతురుకన్నా ముఖ్యమైన దేశం కళ్ళకు కట్టుంది. ఇన్నాళ్ళూ గుడ్డిగా బ్రిటిక్ అర్జించిన వాడు కళ్ళు తెరుస్తాడు. పేదలపాట్లు కనిపిస్తాయ్, కానీ అంతస్థు దిగి రాలేదు. కుటుంబ గర్వం వదల్లేదు. ఇది రాజకీయం కాదు. ఒక ప్రేమాయణం అని యిట్టే పసి గట్టగానే కూతుర్ని యిల్లు దాటనివ్వడు. ప్రేమికుడ్ని నాయకుడ్నిచేసే ఘనత ప్రేయసి తండ్రికి దక్కింది, పోలీసులు అతన్ని అరెస్టు చేస్తారు. జైలుకు "మహాత్మా గాంధీకి జై"—అని వెళ్ళగానే అతని స్టేటస్సు మారిపోతుంది. ఇతను స్వతంత్ర భారతంలో మంత్రిఅయి తీరుతాడు. అలా అవుతాడు చివర్లో. ఇంకెంత కాలం కూతుర్ని బంధిస్తాడండీ? కోరి కూతుర్ని యిస్తాననకపోతే తనకున్న స్టేటస్సు యేదీ? ఇటు దటు అటు దిటు బళ్ళు ఓడలు, ఓడలు బళ్లు అంటారే అలాగై పోతుంది.

యీ నవల వీధిలో చదివి వినిపించాడు రాజు. "ఇందులో భక్తీముక్తీ లేదని" కరణం భార్య కొట్టిపారేస్తే సౌదామిని అత్తయ్య వెంటనే యేమీ అనక "బాగుంది ఫెయిర్ చెయ్యి" అని తరువాత పిలిచి చెప్పింది. ఫెయిర్ చేశాక చూపించాడు. ఆవిడే అట్టవేసి కుట్టింది- రిప్లయికార్డు తెప్పించి రాజమండ్రి ఒకబుక్‌డిపోకి వుత్తరం రాపించింది. ఆ బుక్‌డిపో వాళ్ళే కొవ్వలి, జంపన నవలలు వేస్తున్నారే యిది చదివితే తప్పక వేస్తారని ఆమె ధీమా. ఆమె చాలా నవలలు చదివింది కదా. ఆమె బాగుంది అంటే వాళ్ళు తప్పక వేసుకుంటారని రోజూ మైలు దూరంలోనున్న పొరుగూరు బ్రాంచి పోస్టు ఆఫీసుకు వెళ్ళేవాడు. పోస్టుమాను వారానికి మూడు సార్లే యీవూరు వస్తాడు. ఒకసారి బద్ధకించి రాకపోవటం కూడా జరుగుతుంటుంది.

ఇలా వుత్తరం చేరగానే వినోదినిలా కాకుండా వెంటనే జవాబిచ్చారు. యీ బుక్ డిపోవాళ్లు.

"ఆర్యా! తమరు నవల రాసినందుకు సంతోషం. కానీ మీలాంటి కొత్త రచయితలకు మార్కెట్టు లేదు. కాదన్నామని అన్యథా భావించకండి."

యీ ఉత్తరం చదివాక రాజులో పెళ్ళుబికిన వుత్సాహం పూర్తిగా చచ్చిపోయింది. ఎవరో అనుమానించినట్లు ముఖం చిన్నది చేసుకుంటే సౌదామిని అత్తయ్య—

'అదేంటి రాజూ అంతలోనే మనసు చిన్నబుచ్చుకుంటున్నావ్? ఎన్ని అవమానాలు తినకండా రచయితవు కాగలవు చెప్పు" అన్నాక తనలో కాస్త వుత్సాహం రప్పించడానికి కామోసు.

'వాడి బొంద. వాడు చదివితే యిందులో పస తెలియడానికి?



# ప్రేమానురాగాల లబ్ధం

వేసవి నిశీధిలో
అరుబయట ఆకాశంలో
తారకలు కురిపిస్తున్న
చల్లని చిరు వెలుతుళ్ళు
మసక చీకటిలో
మూలల్లో మణగిన కీచురాళ్ళు
మంత్రాలు వల్లిస్తున్నట్టు
చేస్తున్న చప్పుళ్ళు

చెట్ల గుబుర్లలోని పక్షులు
నిశ్శబ్ద స్తబ్ధతను
చైతన్యవంతం
చేస్తున్న రెపరెపలు
అపరిచిత పాంథుణ్ని చూచి
ప్రక్కవీధిలో
ప్రకోపించి మొరుగుతున్న
శునకం ఉద్వేగ పరంపరలు

అవి, నిద్రిస్తున్న ప్రకృతి
అలవోకగా
అంతశ్చైతన్యం సంతరించు
కొంటున్న క్షణాలు
నా మనసు
నిద్రపోతున్నా
మస్తిష్కం వింటున్నదా
లయబద్ధమైన శబ్దాలు
ఎవరో దిగివచ్చిన
అనుభూతి:
కంటికగుపించని
నల్లరాతి మెట్లు

చిన్నగా చామరం
వీవగా లేచిన గాలితరగలకు
మెల్లగా ఆకులు
కదుల్చుతున్న చెట్లు

మృత్యు గహ్వరంనుంచి
ఎట్టెట్లో తప్పించుకొన్నట్లు
పక్కింట్లో
మాతృమూర్తి మూల్గు
మనసున ప్రసన్నత
కాలొమ్మపగా
అక్కడ హృదయ సురభిళాలతో
స్నానమాడించిన వెల్గు

ఎక్కడో దూరంగా
ఒక్క వాహనం
దూసుకుపోయిన వైనంతో
వేగవంతమైన శబ్దం
వినూత్న సుకుమార సృష్టి
శిశువురూపాన
సాక్షాత్కరించడం
ప్రేమానురాగాల లబ్ధం.

**శ్రీ తాజుద్దీన్‌బాబా**

ఆ కొవ్వలి ఒకప్పుడు నీలా కొత్తగా రాసిన రచయితేనా? వాడు ఆకాశం నించి వూడి పడ్డాడాయేమిటి? వాడెప్పుడూ ముసలిమొగుడు వయసులోనున్న పెళ్ళాం గురించే రాస్తాడు. నివ్వయితే యిందులో యువతరం ప్రేమ సన్నివేషాలూ, రాజకీయాలూ, దేశభక్తి అన్నీ పెట్టావు. కథానాయకికి యెంతఅద్భుంతగా చూసినట్లు వర్ణించావో? రేపు చిత్రగుప్తకి పంపిద్దాంలే—"

అంటూ నవలని పేక్ చెయ్యటం నించి టు అండ్ ఫ్రమ్ యెడ్రసు వరకూ రాసి తనే రిజిష్టరు పోష్టులో పంపడానికి డబ్బిచ్చి పోష్టాఫీసుకు పంపించింది, తిరిగొస్తుంటే బొక్కరేలీ సైకిలు పంచరై పోయింది.

అత్తయ్యా! తిరిగొస్తుంటే సైకిలు పంచరయిపోయింది. నవల తిరిగి వచ్చేస్తుంది. నివ్వేలాను తిప్పి పంపటానికి స్టాంపులు పెట్టించావుగా "

" చదువుకున్న వాడివేనయ్యా నీవూ ? " అని సూటిగా అడిగితే.

'ఏం అత్తయ్యా అలా అంటునావ్? '

'మరికాకపోతే యీ మూఢనమ్మకాలేమిటయ్యా?"

' ఇంగ్లీషు వాళ్ళకికూడా యివి వున్నాయటగా అత్తయ్యా?"

" వాటిని నమ్ముకుంటే నివ్వేం రాయగలవు? ఆ మూఢ నమ్మకాలనే కొలుస్తావ్. యీ సైకిలుటైర్లు పేలించుకునే దీనిమీద రోజూ వెళ్ళి చదివి ప్యాసయ్యావు కదయ్యా? ఇది మంచి.......

'అది నిజమే! అత్తయ్యా యెవరికీలేని శ్రద్ధ నీకు...."

" నేను రాయలేను. రాసే నీలాంటివాడికైనా కాస్త వుత్సాహం పరచవద్దా?'

"రచయితలంటే నీకు అంత గౌరవమా అత్తయ్యా?" 'నాకే కూతురువుంటే ముందు రచయితవైన నీకే కట్టుకోమని బతిమాలుందును అల్లుడా" అంది.

సౌదామని అత్తయ్య నవ్వకుండా యీ మాటలంది. రచయితలంటే ఆమెకు నిజంగా అంత గౌరవం. తను యెప్పుడో వుద్యోగికన్నా రచయితగానే చెలామణి అయితే యిలాంటి మంచివాళ్ళ అభిమానం చూరగొంటా ననుకున్నాడు.

**(ఇంకా వుంది)**

-డా॥ మైనేని కృష్ణకుమారి

# వలివేరులోని త్రైపురుష దేవాలయము-ఒక పరిశీలన

పంచారామములు, ముఖ్యమైన మరికొన్ని శైవాలయములు తప్ప కోస్తా ఆంధ్ర ప్రాంతములోని తూర్పు చాళుక్యుల, చాళుక్యచోళుల కాలములో నిర్మింపబడిన దేవాలయములను, వానిలోని శిల్పములనన్నింటిని అధ్యయనము చేయుటకు తగినంత ప్రయత్నములు అంతగా జరుగలేదు. ముఖ్యముగా నిందులకు ఆయా గ్రామములలోని దేవాలయములు శిధిలమగుట, లేదా వానిలో కాలాను గుణముగా చేయబడిన వివిధ మార్పులు, పునర్నిర్మాణములు కారణములు కావచ్చును. ఇంతవరకు చరిత్రకారులు కోస్తాంధ్ర తీరప్రాంతములో "త్రికూట" పద్ధతిలో నిర్మింపబడిన దేవాలయములగూర్చి ఎట్టి పరిశీలనలు జరుపలేదు.

హిందూమత సంప్రదాయము ననుసరించి చూచినచో, జగత్తులో 'సృష్టి', 'పరిపాలన', 'సంహారము' అను మూడు ముఖ్యాంశములు బ్రహ్మ, విష్ణువు, శివుల వలన నిర్వర్తించబడినట్లు కన్పడుచున్నది. బహుశ, అట్టి ముఖ్యమైన పనులను నిర్వర్తించు ఈ ముప్వురు దేవుళ్ళ నుంచుటకు కాబోలు, దేవాలయములను నిర్మించుటలో "త్రికూట" పద్ధతి ప్రవేశ పెట్టబడినది. బాగుగా నభివృద్ధిచెందిన 'త్రికూట' నిర్మాణములో— చతురస్రాకారములో నుండు ముఖమండపము, ముందువైపు స్తంభములతోకూడిన ఒక మండపము ముఖమండపమునకు మూడువైపుల మూడు గర్భగృహములు నిర్మించబడును. వీటి ప్రవేశద్వారము లన్నియు ముఖమండపమునుండి మాత్రమే కలవు. బయటప్రక్క ఈ మూడు గదులపైన ఎత్తైన శిఖరములు నిర్మింపబడెడివి. ఈ మూడు శిఖరములుండుటవలన కాబోలు, ఈ పద్ధతిలో కట్టబడిన దేవాలయములకు "త్రికూటాచలము" లని పేరు వచ్చినది. ఈ శైలిలో నిర్మింపబడిన 'త్రికూట' దేవాలయములను, త్రైపురుష - త్రికూట ఆరాధనల గురించి అధ్యయనముచేసిన చరిత్రకారులందరు ముఖ్యముగా వారి పరిశోధనలను ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా జిల్లాలకు, మరియు కర్నాటకలోని బిజాపూరు ప్రాంతములకు పరిమితము చేసినారు.[1] తెనాలి తాలూకాలోని వలివేరు గ్రామమునందలి త్రైపురుషాలయ నిర్మాణశైలిని పరిగణలోనికి తీసికొని, దేవాలయ కుడ్యభాగములలోని గూళ్ళలో నుంచబడిన ప్రతిమల లక్షణముల ఆధారముగా, తూర్పు చాళుక్యుల కాలములో నాటి ప్రజల మతాభిప్రాయములు దేవాలయ నిర్మాణములలో ఎట్లు ప్రతిబింబించినవో అధ్యయనము చేయుట ప్రస్తుతమీ వ్యాసములోని ముఖ్యోద్దేశము.

తెనాలికి సుమారు 6కి.మీ.దూరములో వలివేరను గ్రామమున్నది. అందలి శైవాలయము పునర్నిర్మించబడి, సున్నము వేయబడివున్నను, అచ్చటి స్తంభములపైగల నాలుగు శిలాశాసనముల[2] వలన నీ దేవాలయము పురాతనమైనదిగా తోచుచున్నది. ఆలయ ప్రాంగణములో నుంచబడిన ఈ శిలాశాసనముల వలన వలివేరు గ్రామము పూర్వము వెలనాడు - ఆరువేల విభాగములోని అగ్రహార గ్రామముగాను, అందలి దేవాలయము త్రైపురష దేవాలయము మరియు స్వయం భూదేవాలయముగాను ప్రస్తావించబడినది.

తూర్పునకు అభిముఖముగాను, చతురస్రాకారములోనున్న మూడు గర్భగృహములతో నీ దేవాలయము ఉపపీఠము లేకుండ నిర్మింపబడినది. అధిష్టానముపైనున్న దేవాలయ కుడ్య భాగములలో మూడు కోష్టములున్నవి. ఈ దేవకోష్టములు తూర్పు చాళుక్యుల కాలమునాటి దేవాలయముల వలె హంస తోరణము లేక మకరతోరణముతో గాని అలంకరించ బడలేదు. పై భాగమున ఎటువంటి అలంకరణలు లేకుండగనే ఈ దేవకోష్టములు మహిషాసురమర్దని, వీరభద్రుడు, హరిహర పితామహుని ప్రతిమలతో నున్నవి. ఈ దేవాలయములోని మూడు గర్భగృహములపైనున్న శిఖరములు పునర్నిర్మించబడుట వలన, దాని ఆధారముగా ఎటువంటి నిర్ణయములు చేయుటకు వీలుగాకున్నది. మధ్యనున్న గర్భగృహము చతురస్రాకారములో నుండి మధ్యన శివలింగముతో నున్నది. దానికి ముందుగానున్న అంతరాళము గర్భగృహమును స్తంభములతోనున్న ముఖమండపముతో కలుపుచున్నది. దీనికి ఎడమవైపు దక్షిణాభిముఖముగా చతురస్రాకారమున వున్న మరియొక గర్భగృహమున్నది. అందు, ప్రస్తుతము పార్వతీదేవి విగ్రహమున్నది. దీనిని ముఖమండపముతో కలుపుచు నొక అంతరాళమున్నది. అంతరాళములో నిలుచున్న వరాహి ప్రతిమ, లలితాంబ విగ్రహములు కలవు. అంతరాళము లేకుండ తూర్పు వైపునకు అభిముఖముగా చతురస్రాకారమున వున్న గర్భగృహములో పది చేతులున్న వీరభద్రుని విగ్రహము కలదు. సమభంగములో నిలుచుండిన వీరభద్రుని కుడచేతులలో పరశు, బాణము, సర్పము పాశములున్నవి. ఎడమ వైపు చేతులలో త్రిశూలము, చామరము, కత్తి, ధనుస్సు వుండి క్రిందివైపు చేయి పొడవైన కత్తిపై మోపబడినది. ఉదరబంధము, పొడవైన యజ్ఞోపవీతము, ముండమాలలతో నలంకరించబడినది. అతడు ధరించిన వృత్త కుండలములు భుజములను తాకుచున్నవి. జటామకుటము చుట్టును అగ్నిజ్వాలలు చెక్కబడినవి. కుడిప్రక్క క్రింది భాగమున మేకతలతో, రెండు చేతులు జోడించి, అంజలీముద్రలోనున్న, నిల్చున్న దక్షుని విగ్రహమున్నది. తక్కిన రెండు గర్భగృహములవలె కాకుండ, నిది ముఖమండపముతో కలుపబడలేదు.

రూపమండనములో దత్తాత్రేయుని వర్ణించునపుడు, హిందూమతములో ముఖ్యులైన ముగ్గురి దేవుళ్ళ అవతారముగా "హరిహర పితామహ" అను పేరుతో వర్ణించబడినది.[3] క్రీ.శ. 7వ శతాబ్ది నుండి దక్షిణ భారతదేశములో బ్రహ్మ, విష్ణు, శివుని కలయికతో నుద్భవించిన హరిహర పితామహుని అర్చించుట కలదు. ఈ ముప్వురి అంశలతో నొప్పు ఈ మూర్తి ప్రతిమలు బాదామి, అజ్మీర్‌లోని రాజపుటానా మ్యూజియంలోను, హళెబీడు దేవాలయములోను వున్నట్లుగా టి.ఎ. గోపినాథరావుగారు వర్ణించిరి.[4] మధ్యాంధ్ర దేశములోని శాసనములను[5] పరిశీలించినచో, కొన్ని శైవాలయములలోని లింగములు, శైవ ప్రతిమలు త్రికోటీశ్వరదేవర అను పేరుతో ప్రతిష్టించబడినట్లు కలదు. "త్రికోటీశ్వర" అనునది, బహుశ, "త్రికూటేశ్వర" ("త్రికూటము" నకు అధిపతి) అను పదమునకు మారుగా వ్యవహారములోనికి వచ్చిన పదమై యుండవచ్చును.

దేవాలయమునకు పడమరవైపున్న దేవకోష్టములోని హరిహర పితామహుని విగ్రహము ఎంతో ఆసక్తికరమైనది. [చిత్రము : 1]. ఆరు చేతులతో, కూర్చుండినట్లున్న ఈ ప్రతిమ యవ్వనములోనున్న ఒక యోగిని తలపించుచున్నది. ఎడమకాలు సుడవబడి, ఎత్తివున్న కుడి మోకాలు ఒక యోగపట్టముతో నడుమునకు బిగింపబడి సోపాశ్రయమను ఒక యోగాసనమును పోలివున్నది.[6] అతని కుడి చేతులలో పొడవైన దండముగల ఒక త్రిశూలము, చక్రము, క్రిందిచేతిలో నొక అక్షమాలవున్నవి. అక్షమాలను బొటనవ్రేలు, చూపుడు వ్రేలితో పట్టుకొని, తక్కిన వ్రేళ్ళు నిటారుగా ఎదుటివైపునకు తెరవబడివుండి చిన్ముద్రలో నున్నట్లుగా నున్నది. ఎడమ చేతులలో శంఖము ఢమరువుండి క్రిందిచేయి తొడపైనున్న నీటిపాత్రను పట్టుకొనినట్లుగా కలదు. పొడవైన యజ్ఞోపవీతము, ఉదరబంధము లున్నవి. తలవెంట్రుకలు పైకి లేచినట్లుగా జటాభార పద్ధతిలో మలచబడినవి. చెవులకు కుండలములు, చేతులకు గ్రైవేయకములు, సర్పముల కేయూరములు అలంకరించబడినవి.



హరిహరపితామహుడు, వలివేరు.

అతని విశాలమైన ఫాలభాగము, తీర్చిదిద్దినట్లున్న కనుబొమ్మలు, వెడల్పైన బుగ్గలు ధ్యానముద్రలోనున్న యోగిని గుర్తుకు తెచ్చుచున్నది. ఆతనికి క్రింది భాగమున నవ్వు మొహములతో నున్న ఇద్దరు స్త్రీ మూర్తులు చెక్కబడినారు. బహుశ, వీరు శివుని, విష్ణుమూర్తుల భార్యలు కాబోలు. ఈ విగ్రహముయొక్క ప్రతిమా లక్షణములన్నియు రూపమండనములో వర్ణించబడిన హరిహర పితామహుని వర్ణనలకు చక్కగా సరిపోవుచున్నవి.

"ఏకపీఠ సమారూఢ మేక దేహ నివాసినమ్।
షట్భుజం చ చతుర్వక్త్రం సర్వలక్షణ సంయుతమ్॥
అక్షమాలాం త్రిశూలంచ గదాం కుర్యాశ్చ దక్షిణె।
కమణ్డలుం చ ఖడ్గంచ చక్రం వామభుజె తథా॥"

ఆజ్మీర్, హళెబీడులలోని హరిహరపితామహుని విగ్రహములు ఒకే ప్రతిమలోకాక, బ్రహ్మ, విష్ణు, శివులు వేర్వేరు ప్రతిమలుగా ప్రక్కప్రక్కన కూర్చుండినట్లు గాని, లేక నిల్చుండినట్లుగా గాని చెక్కబడినవి.7 కాని, బాదామి, ఆజ్మీర్‌లలో లభ్యమైన ప్రతిమలు అట్లుగాక, ఒకే విగ్రహముగా పద్మాసనములో కూర్చుండిన యోగివలెగాని, లేక నిల్చుండినట్లు గాని నాలుగు చేతులలో పట్టుకొనివున్న శైవ, వైష్ణవ గుర్తులవలన త్రిమూర్తుల అంశాలతో నున్న ఒకే దేవునిగా గుర్తించబడినవి.8 వీనిలో బాదామి నందలి హరిహర పితామహుని విగ్రహము తరువాతి చాళుక్యుల కాలము నాటిది. ఒకే విగ్రహములో, త్రిమూర్తుల అంశలు ప్రతిబింబించునట్లుగా చెక్కబడిన వలివేరులోని హరిహర పితామహుని విగ్రహము తూర్పు చాళుక్యుల కాలము నాటిది.

తూర్పువైపు దేవకోష్ఠములోనున్న మహిషాసురమర్దని విగ్రహము, సాధారణముగా చాళుక్యుల కాలములో చెక్కబడిన తక్కిన ఈ మూర్తి విగ్రహములవలె ఎనిమిది చేతులతో, కుడికాలు కొద్దిగా వంచి ఒక సింహము పైనను, ఎడమకాలు మహిషుడిపైనను ఉంచబడినది. ఖడ్గము, శంఖము, చక్రము, బాణము, అంకుశము, ధనస్సు మున్నగునవి చేతులలో కలవు. ముందు వైపున్న రెండు చేతులతో త్రిశూలమునుపట్టి రాక్షసుని వధించునట్లుగా కలదు. చెవులకు కుండలములు, స్తనములపై కుచబంధము, తక్కిన ఇతర ఆభరణములతో నీ మూర్తి ప్రతిమ అలంకరించబడినది. నాల్గుచేతులతో బాణము, ధనుస్సు, కత్తి మున్నగునవి పట్టుకొని, నిల్చుండినట్లున్న వీరభద్రుని విగ్రహము దేవాలయము ఉత్తరమువైపున దేవకోష్ఠములో నున్నది. దీనికి కుడివైపు క్రింది భాగమున దక్షుని విగ్రహము చెక్కబడియున్నది.

ఈ దేవాలయములోని దానశాసనములు పరిశీలించినచో ఇందలి బ్రహ్మదేవునికి, శివునికి, విష్ణుమూర్తికి వేర్వేరుగా దీపదానములు చేసినట్లు కలదు. దీనివలన ఆ కాలములో మూడు గర్భగృహములందు బ్రహ్మ, విష్ణు, శివుల ప్రతిమలుండినట్లుగా వూహించుటకు వీలుకలుగుచున్నది. వానిలో నొక శాసనమందు సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుయొక్క 41వ విజయరాజ్య సంవత్సరమును శకసంవత్సరము 983 (క్రీ.శ. 1043)ను చెప్పబడినది.9 శాసనములోని ఈ విష్ణువర్ధనుని క్రీ.శ. 1019-1020న రాజ్యమునకు వచ్చిన తూర్పు చాళుక్యరాజైన రాజరాజ నరేంద్రునిగా గుర్తించుటకు వీలగుచున్నది. వలివేరులోని చిట్టచివరి శాసనము శకసంవత్సరము 1026 (క్రీ.శ. 1104)లో వేయబడినది.10 దీనిలో ఈ దేవాలయము తక్కిన అచ్చటి శాసనములవలె కాక స్వయం భూదేవాలయముగా చెప్పబడినది. దీనినిబట్టి, క్రీ.శ. 11వ శతాబ్దిలో నీ దేవాలయము త్రైపురుష దేవాలయముగా వ్యవహరించబడి, ముగ్గురు దేవతామూర్తులకు సమాన ప్రాముఖ్యము నిచ్చినట్లుగాను, క్రీ.శ. 12వ శతాబ్ది తొలిభాగమున అట్టి ఆదరణ కొరవడి, శివుని పేరుపై స్వయం భూదేవాలయముగా ప్రాచుర్యము పొందినట్లుగాను తెలియుచున్నది. అంతేగాక, బహుశ, బ్రహ్మ, విష్ణుమూర్తుల స్థానములలో వీరభద్రుడు, పార్వతిదేవిల విగ్రహములు ఆలయమునందుంచబడి శైవారాధనకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చినట్లుగా కన్పడుచున్నది.

తెలంగాణములోని త్రికూటాలయములను పరికించినచో రెండు విభిన్న రీతులు మనకు గోచరించును. అవి 1) శివ, విష్ణువు, సూర్యుని విగ్రహములుంచబడి దక్షిణాభి ముఖముగ, వున్నతమైన ఉపపీఠముపై నిర్మింపబడిన మూడు గర్భగృహములు గల దేవాలయముల సముదాయము; మరియు 2) మూడు గర్భగృహములలో మూడు శివలింగములుండునట్లు, ఉపపీఠము లేకుండ తూర్పువైపు ఆలయద్వార ముండునట్లుగా నిర్మించబడిన దేవాలయ సముదాయము. కర్నాటక ప్రాంతములో సుమారు క్రీ.శ. 7వ శతాబ్దినుండి త్రికూట పద్ధతిన దేవాలయములు నిర్మింపబడి, కాలానుగతముగ తరువాతి శతాబ్దములలోనివి దక్కను ప్రాంతములలో విస్తరించినట్లు కన్పడుచున్నది. క్రీ.శ. 12 మరియు 13వ శతాబ్దులలో తెలంగాణా ప్రాంతములో నిర్మించబడిన త్రికూటాలయములు కొన్నింటిని చనిపోయిన/జీవించిన కుటుంబసభ్యుల జ్ఞాపకార్థము నిర్మించబడిన దేవాలయములుగా గుర్తించిరి. ఉదాహరణకు కాకతీయుల కాలములో, పిల్లలమర్రిలోని త్రికూటాలయమందలి మూడు శివలింగములకు, ఆ దేవాలయ నిర్మాతయైన రేచర్ల రెడ్డి వంశమునకు చెందిన నామిరెడ్డి తనపేరు, మరియు తన తల్లిదండ్రుల పేర్లమీదుగా శివలింగములకు నామేశ్వర, కామేశ్వర, కాచేశ్వర అను పేర్లుపెట్టెను. అదేవిధముగా, కర్ణాటకలో కూడ మరణించిన రాజులజ్ఞాపకార్థం నిర్మించబడిన తొలిదేవాలయమును ఇటీవల పురాతత్వశాస్త్రవేత్తలు పట్టడకల్ సమీపములోని, భద్రనాయకన జలిహాల్‌లో గుర్తించిరి. అచ్చటి దేవాలయ శాసనమాధారముగా శ్రీ కె.వి. రమేష్ మరియు శ్రీ ఎమ్.ఎస్. నాగరాజారావుగార్లు దానిని రెండు చాళుక్య విక్రమాదిత్యుని (క్రీ.శ. 733-744) జ్ఞాపకార్థము నిర్మింపబడిన దేవాలయముగా భావించిరి.11

వలివేరులోని త్రైపురుషాలయమందెచ్చటను సూర్య ప్రతిమ వున్నట్లు గాని, నాటి ప్రజలు సూర్యునికి ఈ దేవాలయములో దానము లిచ్చినట్లుగాని

## గ్రామం

కనిపిస్తున్నాయి మూరికిపీదులు
దువ్వినా అణగని జుట్టులా.
తలపిస్తున్నాయి మురుగుకాలవలు
వ్రణం నుంచి కారే చీములా.
తిరుగుతున్నాయి ఆవులూ గేదెలూ
తెగిన గాలిపటాలులా
రాకపోకలు సాగిస్తున్నారు మనుషులు
మధ్య మధ్య మజిలీలు చేస్తూ.
మర్రిచెట్టు కింద గుర్రి పెడుతున్నా
కండలు తిరిగిన తరుణ వయస్కుడు
లెక్కలు చెయ్యవలసిన చేతులు
మట్టిలో గోలీలు ఆడుతున్నాయి.
ఎన్నడు చక్కబడుతుందో
నా దేశానికి గుండెలాంటి గ్రామం!



## సామాన్యుడు

విద్యార్థికుని హృత్సీమలో
వటవృక్షంలా పెరిగి
విదేశ వ్యామోహం నెలకొనగా,
తీరికగా కీర్తిసౌధంలో కూర్చుని
జరిగిన గౌరవాలు నెమరు వేసుకుంటూ
తన లోకంలో రచయిత మునిగిపోగా,
అకౌంటులో అందాలు దిద్దుకున్న సిరిని,
అక్కున చేర్చుకున్న వర్తకుడొకడు
ధనదాహంతో చిందులు వేయగా,
అనుభవించిన పదవులు చాలక
మధుర స్వప్నాలు కొత్తవి కంటూ
రాజకీయ నాయకుడు మురిసిపోగా
తలచుకుంటున్నాడు సామాన్యుడు
తన మాతృదేశాన్ని
తన దేశంలో తాను పడుతున్న బాధల్ని.

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

చెప్పుటకు ఆధారములులేవు. త్రికూట పద్ధతిన దేవాలయములు నిర్మించు సంప్రదాయము ఎక్కువగా కర్ణాటకరోను, తెలంగాణా జిల్లాలలోను కన్పించుచున్నది. దీనివలన తీరాంధ్రప్రాంతములలో దేవాలయనిర్మాణములు ఈ శైలిలో నెందులకు ఎక్కువగా జరుగలేదన్న ప్రశ్న వుద్భవించుచున్నది. ఈ ప్రాంతములో, ముఖ్యముగా కోట రాజుల శాసనములలో శివలింగములకు దానకర్త పేరు, అతని తండ్రి, తాత లేదా, తల్లి లేక అన్నదమ్ముల పేర్లు కలియునట్లుగా పేర్లుపెట్టిన సంప్రదాయము కన్పించుచున్నది. అయినను, ఈ విషయముపై ఇంకను కొంత పరిశోధన జరుగవలసి యున్నందున, ప్రస్తుతమునకు ఆంధ్రప్రాంతములోని త్రికూటాలయములకు, జ్ఞాపక చిహ్నములుగా నిర్మించబడిన దేవాలయములకు గల సంబంధమును నిర్దిష్టముగా చెప్పుటకు వీలుగాకున్నది.

హరిహర పితామహుని ప్రతిమ మనకు పలివేరులోని త్రైపురుష దేవాలయమునందు లభ్యమగుటచే క్రీ.శ. 11వ శతాబ్ది కాలమున ఆంధ్రదేశములో శైవ, వైష్ణవ మతములను ప్రజలు సమానముగా ఎట్టి భేదభావములు లేక ఆదరించిరని స్పష్టమగుచున్నది. అంతేగాక, ఒకే గర్భగృహముగల దేవాలయములు తీర్చలేని కొన్ని మతపరమైన, భావపరమైన పనులను నిర్వర్తించుటకు త్రికూటపద్ధతిని, దేవాలయములు నిర్మించి అందు త్రిమూర్తుల అంశలన్నియు ప్రతిబింబించు విగ్రహములను ప్రతిష్ఠించిరనికూడ తెలియుచున్నది.

## అధోజ్ఞాపికలు


1. ఫిలిప్ బి. వాగ్నర్— "ది ప్రాబ్లెమ్ ఆఫ్ ది త్రికూట ఇన్ ది ఆర్కిటెక్చర్ ఆఫ్ ఎర్లీ మిడీవల్ తెలంగాణా క్రీ.శ. 11-13 వ శతాబ్దులు", పేపర్ ప్రజంటెడ్ టు ది సొసైటి ఫర్ సౌత్ ఇండియన్ స్టడీస్, టోక్యో, (1984); కె.జి. కృష్ణన్ - "త్రైపురుష-త్రికూట కల్ట్స్ ఇన్ కర్నాటక", క్వార్టర్లి జర్నల్ ఆఫ్ ది మిథిక్ సొసైటి, బెంగుళూరు ఎల్ 5 నం: 2 జులై, 1964; సుందర, ఎ.— "త్రైపురుష దేవాలయాస్ ఇన్ ఇన్స్క్రిప్షన్స్ అండ్ దిరిలేటెడ్ టెంపుల్స్ ఇన్ ధార్వాడ్-బిజాపూర్ రీజియన్ దైర్ ఇంప్లికేషన్స్," ఎపిగ్రఫి అండ్ ఆర్టుహిస్టరి, (ఎడిటెడ్ బై ఎ ఆషర్), న్యూఢిల్లి, (1984).
2. సౌ.ఇం.ఇ. వాల్యూం: 10; నం: 6, 8, 9, 61.
3. టి.ఎ. గోపినాథరావు., ఎలిమెంట్సు ఆఫ్ హిందు ఐకనోగ్రఫి, వాల్యూం పార్టు 1, పే. 255; పార్టు 2, పే. 53-54.
4. పైది, పే. 252-255; ప్లేట్లు: ఎల్ 22, ఫిగర్సు 1, 2; ఎల్ 2 ఎల్ 24.
5. సౌ.ఇం.ఇ. వాల్యూం 10: నం: 94, 104, 127.
6. జె. బెనర్జియం, డెవలప్‌మెంట్ ఆఫ్ హిందు ఐకనోగ్రఫి., పే. 270-7
7. పైది., ప్లేటు ఎల్ 24, ఎల్ 22, ఫిగరు: 1.
8. పైది., ప్లేటు ఎల్ 23, ఎల్ 22, ఫిగరు: 2.
9. సౌ.ఇం.ఇ. వాల్యూం: 10; నం: 8.
10. పైది, నం: 61.
11. ఎమ్. ఎస్. నాగరాజరావు మరియు కె.వి. రమేష్— "ఎ రాయ మెమోరియల్ టు చాళుక్య విక్రమాదిత్య 2" — మదు రీసెం రీసర్చెస్ ఇన్ ఇండియన్ హిస్టరి, (ఎడిటెడ్ బై) ఎమ్.ఎస్ నాగరా రావు, శ్రీ ఎమ్.ఎన్. దేశ్‌పాండె ఫెస్ట్‌స్క్రిఫ్ట్, న్యూఢిల్లి (198 పే. 175-177.




# నిరీక్షణ

ఎ.వి.వి.యస్.యస్.ప్రసాద్

యంత్రంలా సాగిపోతున్న జీవన సరళిలో అతనిరాక ఒకగొప్ప అనుభూతి—

జీవితంలో ఎదురైన చేదు అనుభవం అతని జీవితాన్నే మార్చేసింది.

అనుభూతినే ఊపిరిగా పిలుస్తూ దూరమై పోయిన 'ఆనందాన్ని' ఆస్వాదించడానికి, అందుకోడానికి ప్రయత్నిస్తున్నాడతను....

నిరీక్షణలో మాధుర్యాన్ని అనుభవిస్తున్నాడా? !

అదో విచిత్రమైన స్థితి—అతనిది!

ఆనందం లాంటి విచారం !

విచారం లాంటి ఆనందం !



అదో చిన్న రైల్వే స్టేషన్.




నేనక్కడ అసిస్టెంట్ స్టేషన్ మేష్టార్ని.

ఈ ప్రాంతానికి బదిలీ అయి దాదాపు రెండేళ్ళు అయ్యింది. ఇక్కడ కొచ్చిన కొత్తలో ఇక్కడి వాతావరణం అలవాటు అవ్వడం కాస్త కష్టమే అయ్యింది.

పట్నంలో పుట్టి పెరగడంవల్ల పల్లెటూరి వాతావరణం కొత్తగా, కొంచెం ఇబ్బందిగా వుంది. ..వచ్చిన రెండో రోజునే, జలుబు....జ్వరం....

వైద్య సహకారాలు పెద్దగాలేవు. ఏదో అదృష్టం బాగుండి ఓ వారం తరువాత కోలుకున్నాను! తరువాత క్రమేణా వాతావరణానికి అలవాటు పడ్డాను.

వాతావరణంతో 'అవగాహన' ఏర్పడ్డాకా, అక్కడి జనం, వాళ్ళ వేష భాషలు కూడా అర్థమయ్యాయి. అంతా అర్థమయ్యాకా, అంతా ఆనందమే!

అక్కడి వాళ్ళతో నేను కలిశాను. నాతోవాళ్ళు కలిశారు. స్టేషన్లో పెద్దగా పనులు వుండవు. ఎక్స్‌ప్రెస్ బళ్ళు వచ్చినప్పుడు సిగ్నల్స్ చూపెట్టడం....రెండే రెండు 'ఎక్స్‌ప్రెస్సులు' వస్తాయి రోజుకి......—అవి వుదయం వేళలలో రావడంతో. ..దాదాపు మధ్యాహ్నమంతా ఖాళీయే!

మళ్ళీ సాయంత్రం ఆరింటికి ఓ ప్యాసింజర్ వస్తుంది. దాంట్లోంచి ఒకరిద్దరు కన్నా దిగరు. వెళ్ళేవాళ్ళు ఒక్కోసారి అసలు వుండరు. అడపా దడపా నాలు గైదు గూడ్స్ బళ్ళు వస్తుంటాయి. అందుకే పెద్దగా పన్లు వుండవు. వున్నా వున్నట్టు అన్పించదు.

ఏడాది కొకసారి ఈ ప్రాంతంలో తిరునాళ్ళ లాంటిది జరుగుతూ వుంటుంది. అప్పుడే కాస్త రద్దీగా వుంటుంది. అందుకే....

పొద్దున్నుండి సాయంత్రం వరకు గడవడం సుద్దబోరు. కానీ వుద్యోగ ధర్మం తప్పదు.

రోజంతా భరించలేని వేడిమిని భరించడంవల్ల సాయంత్రం కోసం, సాయంత్రం వీచే చల్లని పిల్లగాలులకోసం ఎదురు చూడడం నా జీవితంలో నిత్యకృత్యమయి పోయింది.

ఇక్కడి సాయంత్రం నిజంగా చాలా అందంగా వుంటుంది.

ఆ అందానికి వన్నెతెస్తూ-

ప్రకృతి సంధ్యారాగ సంకీర్తన

దూరంగా గూళ్ళవైపు సాగిపోతున్న పక్షుల గుంపులు. ఏవో సందేశాలు హడావిడిగా మోసుకుపోతూ నీలిమేఘాలు.

పిల్లగాలి కెరటాల సప్తస్వరాలు.

నిశ్శబ్ద సౌందర్యం-!

అలాంటి సమయంలో

'అతను' వస్తున్నాడు.

అతనిపేరు తెలీదు.

దాదాపు ఏడాదినుండి వస్తున్నాడు.

మా యిద్దరి మధ్య మాటల్లేవు.

చూపులతోనే పలకరింత.

అందమైన నిశ్శబ్దం ఇద్దరిమధ్య.

ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టు ప్యాసింజర్ వచ్చే వరకు చూస్తాడు. వచ్చేకా, అది వెళ్ళే వరకు అన్ని బోగీల్లోకిచూస్తూ, అటునుండి ఇటూ, ఇటు నుండి అటూ తిరుగుతాడు.

రైలు కదిలేవరకు అక్కడె వుండి, కదిలాకా, భారంగా ఓ నిట్టూర్పు విడిచి, మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళిపోతాడు..

ఇక్కడికి దగ్గర్లోవున్న పల్లె, దాదాపు మూడుమైళ్ళ దూరం-

రోజూ అంత దూరంనుండి ఎందుకు వస్తున్నట్లు?

పోనీ అతని కోసం ఎవరైనా వస్తారా?

వ్చ్........ఎవరూ రారు.

ఒకసారి పోర్టర్ వెంకటయ్య మాటల్లో తెలిసిందేమిటంటే-అతను దగ్గర్లో వున్న పల్లెటూరిలోని పాఠశాల మేష్టారు. దాదాపు ఏడాది అయ్యిందిట ఆవూరు వచ్చి. మనిషి బక్కపలచగా వుంటాడు, పెద్ద ఎత్తుగా వుండడు, వదులైన పాంట్, లూజ్‌షర్టు వేసుకుంటాడు.

నిర్మలంగా వుండే మొహంలో కొద్దిగా జాలి, ఎక్కువగా కరుణ కన్పిస్తాయి.....కళ్ళలో మాత్రం ఏదో లోతు........చూపులు ఏదో పోగొట్టుకున్న "దాన్ని" వెతుకుతున్నట్టు వుంటాయి,

" అమాయకుడిలా వుంటాడు" అని అంటాడు వెంకటయ్య.

ఎండైనా -

వానైనా -

చలైనా -

వచ్చేవాడు. వస్తున్నాడు.

ఇంత శ్రమపడి రావడ మెందుకు?

ప్రశ్నకి ఎంత ఆలోచించినా జవాబు దొరకడం లేదు.

ఇవాళ -

మధ్యాహ్నంనుండి వాతావరణం అదో మాదిరిగావుంది....మేఘాలు కమ్ముకున్నాయి....రివ్వున ఈదురు గాలులు వీస్తున్నాయి.... చినుకు ఏ క్షణాన్నైనా రావొచ్చు- చలికి భరించలేక స్వెట్టర్ వేసుకున్నాను. యింకా అరగంట వేచి వుండాలి ...ప్యాసింజర్‌కోసం....; గాలి విపరీతంగా వీస్తోంది .....దగ్గర్లోవున్న చెట్లు "లయ"గా తలలు వూపుతున్నాయి....గాలి గంభీరంగా అరుస్తోంది.... క్షణంలో....

చూస్తుండగానే....

గాలి కెరటాల పురవడిలోంచి చినుకులు పడడం ప్రారంభించాయి.... బంగారు తీగెలా మెరిసే మెరుపు....ఆకాశాన్ని చీలుస్తూ కుండపోతగా.... ... ధారలు ధారలుగా వర్షం....

"ధన్...." దూరంగా ఎక్కడో పిడుగు పడింది....

ప్రకృతి భీభత్సంగా తయారయ్యింది....

హోరు మనిగాలి....అంతంత చినుకులు... పిడుగు శబ్దం....చినుకులు తాండవం చేస్తున్నాయి....

గాలీ-వానపోటీ పడ్తున్నాయి....

స్టేషన్లో కరెంటు పోయింది. ... లాంతరు వెతికి, దీపం వెలిగించడం గగన మయ్యింది....పోర్టర్ కూడలేడు....వూళ్ళో ఎవరో బంధువులు వచ్చేరని, చూడడానికి మధ్యాహ్నమే వెళ్ళాడు -

చీకటి తెరలు అలుము కుంటున్నాయి,

భయ కంపితుడ్ని చేస్తోంది ప్రకృతి!

అరగంట గడిచింది తెలికుండానే....ఫోన్ మ్రోగింది. ప్యాసింజర్ గంట లేటుట....పక్క స్టేషన్నుండి వర్తమానం వచ్చింది.

మరో పావుగంట తరువాత....

చినుకులవేగం తగ్గింది. లాంతరు వెలుతురులో దూరంనుండి ఎవరో వస్తూ కన్పించారు.. . వెంకటయ్య అనుకున్నాను .... కానీ .... వస్తున్నది "అతను !"

హడావిడిగా వస్తున్నాడు........తలమీదో గుడ్డ కప్పుకున్నాడు. మనిషి దాదాపు తడిసిపోయాడు.

"మేష్టారు ...ట్రైన్ వచ్చిందా?" ఆత్రంగా అడిగాడు, మెల్లగా వణుకుతున్నాడు.

"లేదండి....గంటలేటు...."అన్నాను.

"....ఇలా బయటకి అడుగు వేశానో లేదో ...అలా వాన వర్షం ప్రారంభమయ్యింది....చిన్న వానే అనుకున్నా, బాగా తడిపేసింది...." అన్నాడు దూరంగా చూస్తూ. అదృష్టం బాగుంది కరెంటు వచ్చింది. తువ్వాలు వెతికి యిచ్చాను. కృతజ్ఞతగా కళ్ళల్లోకి చూశాడు.

" ట్రైన్ వచ్చేవరకు....ఇక్కడే వుండండి....బాగా కురుస్తోందివాన...." అన్నాను. అక్కడే వున్న కుర్చీ అతనివైపు జరుపుతూ, దానిమీద కూర్చొని వాన లోకి చూస్తున్నాడు.

" ఏవండీ!....రోజూ వస్తున్నారు....ఎవరేనా బంధువులు వస్తారా ?.... వస్తున్నారా? ప్రశ్న ఎలావేయాలో తెలీలేదు. ఎందుకు వస్తున్నాడో తెలుసుకోవాలనే కుతూహలం ఆ ప్రశ్న వేసింది,

అతను జవాబు చెప్పలేదు.

"........ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి....దాదాపు మిమల్ని ఏడాది నుండి గమనిస్తున్నాను....వస్తున్నారు....వెళుతున్నారు...."అన్నాను.

క్షణం తరువాత.

"ఎవరూ రారండి....వస్తారేమోనని ఆశ... " అని క్షణం ఆగి.

" నిరీక్షణలో బాధకన్నా ఆనందమే ఎక్కువగా వుంది...."అన్నాడు.

అర్థం కానట్టు చూశాను. అతను చెప్పడం కొనసాగించాడు.

"....ఇన్నాళ్ళు మీరు నన్నడగలేదు....కానీ....మీకో విషయం తెలుసా?"

ఏమిటన్నట్టు చూశాను.

" ...ఎప్పుడూ మీతో చెబ్దామనే ప్రయత్నించాను .... కానీ.... అవకాశం రాలేదు." నేను ఆశ్చర్య పోయాను.

" కష్టాన్నైనా, సుఖాన్నైనా మరొకరితో చెప్పుకుంటే, కాస్త ఓదార్పు కల్గుతుందంటారు."అని వానలోకి క్షణంచూసి.

" ఒక్కో మనిషి జీవితం ఒక్కోరకం....విధాతసృష్టి విచిత్రం .. మనిషికి మమతానురాగాల మధురిమని అందిస్తాడు ...రుచినంపూర్ణంగా ఆస్వాదించకుండానే దూరం చేస్తాడు....క్షణం వసంతం....క్షణం శిశిరం!...జీవితం సుఖదుఃఖాల సమ్మేళనం...."అని ఆగి.

" మీకు విసుగ్గావుందా?" అని తెచ్చిపెట్టుకున్ననవ్వు నవ్వాడు. కాగితం పూవులా వుందా నవ్వు.

"లేదు....లేదు....ఇదో విచిత్రమైన అనుభవం....చెప్పండి...." అన్నాను ఆసక్తిగా ముందుకు వంగుతూ....

నా ఆసక్తినిచూసి, మెల్లగా నిట్టూర్పువిడిచి కొనసాగించాడు-

చినుకుల శబ్దం...."అపరిచిత" వ్యక్తి మాటలు ....విచిత్రానుభూతి.... చిత్రమైన కుతూహలం....

" నా జీవితం మొదటినుండి ఒక రకమైన ఆప్యాయతలకి అనురాగాలకి

చేరువుగా వుంది....మా తాతయ్య వాళ్లది ఉమ్మడి కుటుంబం... తాతయ్యకి యిద్దరు కొడుకులు ...ఒకరు వ్యవసాయము... మరొకరు వుద్యోగం....నాన్న గార్కి వుద్యోగం ...వుద్యోగరీత్యా అయిన వాళ్ళందర్కి దూరంగా వుండ వలసి వచ్చింది....తాతయ్య చాలాసార్లు నాన్నతో అన్నాడు. " ఎందుకురా నీకా వుద్యోగం....హాయిగా యిక్కడే వుండకా?"అని నాన్నగారికి వ్యవసాయ మంటే యిష్టంలేదు. ఎట్టి పరిస్థితిల్లోను కనీసం ఏడాదికోసారైనా, తాతయ్య గారింట్లోగడపాలనే షరతుమీద తాతయ్య నాన్నగారు వుద్యోగం చేయడాన్కి వప్పుకున్నాడు-" అని ఆగి రెండు క్షణాలు దూరంగా చూస్తుండిపోయాడు.... గాలి హోరు తగ్గుతోంది క్రమేణా ...చినుకులు మెల్లగా చిందులు చేస్తున్నాయి-

' ఆ ఏడాది స్కూలుకి వేసవి సెలవులు యిచ్చారు. బాబయ్య ఏదో పనిమీద మా వూరువస్తే, నాన్నగారు వాళ్ళు బాబయ్యతో తాతయ్య గారింటికి పంపారు నన్ను—"లీవ్ శాంక్షన్" అయ్యాక, అమ్మా, నాన్న, చెల్లివస్తామని చెప్పి...."

మెరుపు మెరిసింది... ఒకసారి కాంతి వెల్లువ....మళ్ళీ మామూలే. సిగ్నల్ లైట్ డిమ్‌గా వెలుగుతోంది ...

"నాన్నగారు వాళ్ళు వస్తామన్న రోజు....నేనూ బాబయ్య స్టేషన్లో ఎదురు చూస్తున్నాము ...అప్పటికి అమ్మా వాళ్ళని "వదిలి" వారం రోజులయ్యింది.... నాకు బెంగగావుంది.....అమ్మవస్తే ఆమె ఒడిలో ఒదిగి పోవాలనికోరిక....అదే మొదటిసారి వాళ్ళని విడిచి వుండటం....ఎదురు చూస్తున్నాము. ఎంత సేప టికి ట్రైన్ రాలేదు. కొంతసేపటికి తెలిసింది అమ్మావాళ్ళు ఇంకరారని... వేగంగా వస్తున్న రైలు పట్టాలు తప్పి ..." స్పష్టంగా కన్పిస్తున్నాయి కను కొలుకుల్లో కన్నీళ్లు.

గొంతులో స్పష్టంగా జీర.

"....ఆరోజు నుండి అదో అలవాటుగా మారిపోయింది. వస్తున్న ఏ రైలుని చూసినా నా వాళ్లు వస్తున్నారని... 'నా బంగారు కొండ' అనే అమ్మ, "వెధవా! ఏం చేస్తున్నావ్?" అనే నాన్న ' అన్నయ్య .... నన్ను భయపెడ్తే అమ్మతో చెప్పి కొట్టించి....బూచాడికి యిప్పించేస్తా అనే చెల్లి వస్తారని ఏదో ఆశ ...ఆనందంలాంటి విచారం ఎదురుచూపు ...

దూరంగా రైలు వస్తున్న కూత విన్పించింది. అతను మెల్లగాలేచాడు.
స్టేషన్‌లోకి వస్తున్న రైలుకేసి అడుగులు వేస్తున్నాడు.
చిన్న చిన్న చినుకులు పడ్తున్నాయి.....
చినుకుల మాటున : మసక వెలుతురు చాటున
మెల్లగా "వెతుక్కుంటూ" సాగి పోతున్నాడతను ....
రైలుని చూసిన అతని మొహంలో స్పష్టమైన మార్పు ఆనందమా? విచా, రమా?

మరో పది నిముషాల తరువాత.
రైలు కదుల్తోంది....
అతను మెల్లగా సాగుతున్న రైలుతోపాటే నడుస్తున్నాడు ..
బోగీలో ఎవరితోనో మాట్లాడుతున్నాడు....
మాటల్లో నవ్వుతున్నాడు...

నవ్వుతున్నా-
కనుకొలకుల్లో ఆ కన్నీళ్ళెందుకు?



సీరియల్

# తిక్కన సోమయాజి

కే.శే. కొల్లూరు నారాయణరావు



(గత సంచిక తరువాయి)

## 14. పదభ్రష్టత

వార్షికోత్సవములు జయప్రదముగఁగొన సాగినవి. ఆనాఁటి వఱకు నెల్లరు మహానంద పరవశులయి కాలమునుబుచ్చిరి. ప్రతి సంవత్సరము కన్న నా సంవత్సర మాయుత్సవములు హెచ్చు వైభవముతో జరిగినవి.

కాని యానాఁడే లకో మఠము చిన్నపోయినది. విధిలేక చేయుచున్న వేదాధ్యయనము శ్రవణానందకరముగ లేదు ఎప్పుడు గలకలలాడు రుద్రాంబ మోమునందు మందహాసరేఖకు మారుగ దీర్ఘాలోచనా నిమగ్నత గోచరించు చున్నది, వీరభద్రుని యుత్సాహ మడుగంటినది. వారెల్లరును దిక్కనార్య విశ్వేశ్వరులున్న స్థలమునకు వచ్చుచుండిరి. ఆ భారత వ్యాఖ్యాత తన దేశమునకు మరలి పోవుచున్నాఁడను విచారమా! కాదు అట్టి సంయోగ వియోగములా పాఠశాలకుఁ బ్రతి సంవత్సరము నున్నవేగదా! మఱి దానికి హేతువేమి? అక్కన బయ్యనల కుటత్రి తప్ప వేఱుగాదు. ఆనాఁడే తిక్కనార్యుఁడు పదభ్రష్టుడైనట్లు రాజశాసన మయినది.

ఆ పత్రమును తిప్పి యా మంత్రి పుంగవుఁడొక్కసారి చదువుకొని వార్తావహుని దెసదేఱి పాఱఁజూచి విడిచి పుచ్చెను.

ఆ గంభీరమూర్తి మోమున నొకించుకైనను దైన్యరేఖ యంకురింపలేదు. నయనేందీవరములనుండి యొక్క యశ్రుకణమైనను స్రవింపలేదు. నిండు హృదయమొకించుకైనను దడబడలేదు. ఆ శాసనమును జిరునవ్వుతో విశ్వేశ్వరునకాతఁడందించెను. దేశికులు దానిని జదివిరి.

"ఈ తిక్కనార్యుని చర్యలపై వారి కనుమానము దోఁచినట్లును, దత్కారణమున నీతనిఁబదచ్యుతునిఁజేసినట్లును తిరిగి మనవి చేసికొనుటకైనను రా నవకాశము లేనట్లును నందు వ్రాయఁబడి రాజముద్రతో నున్నది. ఇదే యందలి వారి విచారమునకు ముఖ్య కారణము. 'మిత్రమా! నీకేమియు లోపము లేదు. నా మఠముననే యుండుము. మా విద్యార్థులనుద్ధరింపఁ జేయుము. పాఠశాల నభివృద్ధి పఱచుట యందు భారమును వహింపుము. ఇచట దైవసన్నిధిని భారతాంధ్రీకరణమును గొనసాగింపుము అని విశ్వేశ్వర దేశికులు కోరిరి.

" కవిపుంగవా! మా యోరుగంటికి విచ్చేయుఁడు. మాకు శివదేవయ్య ప్రగ్గడ యొక్కటియు మీరొకటియును గారు. మాచే ధర్మప్రదముగఁబరిపాలనము జరిపింపుడు మీకే లోటును రానీయమ ' ని రుద్రాంబ నమస్కరించినది." మా గురు పుంగవులు మానిరవద్య పురమునకు వచ్చెదర సురేంద్రుని సురగురునట్లు నాచే వీరు చాళుక్య సామ్రాజ్యమును వైభవాన్వితముగ నేలించెదరు. వైదిక మతమును బునరుద్ధరింపఁజేసెదరు." అని వీరభద్రుడు పలికి క్షణమూరకుండి" లేదా! మీ యాజ్ఞయైనచో క్షణ మాత్రములో నా మనుమసిద్ధి రాజును గొనివచ్చి మీ పాదముల మ్రోలనునిచి ద్రోణు యెదుట ద్రుపదునునిచిన యర్జునునివలెఁగీర్తిని బడసెదనని పల్కెను.

ఆ వీరకుమారుని వీరగీతికలకు రుద్రమహృదయగిరి గహ్వరములో ప్రతిధ్వనులు మ్రోగెను. వారిరువురు నట్టి శక్తి సంపన్నులని తిక్కనార్యు డెఱుంగును! తనపై వారికిఁగల గౌరవముగూడ నెఱుఁగును. అయిన నాతఁడందులకియ్య కొనలేదు.

ఉద్యోగభంగమైనంత మాత్రము నఁ దిరుగుఁబాటు చేయవలసిన ప్రతి ద్రోహికాఁడాఁతడు. అందును దదాజ్ఞా పత్రము తన యేలికయంపెనో కాక మఱియే మోసగానిచేతనయినను సృష్టింపఁబడి వచ్చినదో! అంద రచన తీరునకు దానింతకు ముందు చూచిన రాజశాసనముల రచన తీరునకు భేదమున్నది. అది తెచ్చిన వాఁడించుక తల్లడపాటు తోడనే తన చేత పత్రముఁబెట్టెట. ఇవన్నియు నాలోచింపగా నిది రాజు కడనుండి వచ్చి శాసనము కాదని యనుమానింపఁదగినట్లున్నది. మఱి రాజముద్ర యెట్లు వచ్చినది? ముద్రలంత యజాగ్రత్తగా నితరులకు జిక్కునే! ఏమైన గంభీర మూర్తి యించుకయునుఁజలింపలేదు.

రుద్రాంబికయును వీరభద్రుఁడును నాతని దమతమ యా స్థానములకు రమ్మని పట్టుఁబట్టిరి. ఆ మఠముననే యుండుమని దేశికుఁడు కోరెనుగదా కాని యా కవి పుంగవునకెచ్చట నుండుటకును నిష్టములేదు. ఒకని నాశ్రయింపకున్నఁబొట్టకూటికి భంగమువచ్చునని విచారింప వలసిన వాఁడుకాఁడు శ్రీమంతుడు. భగవంతుఁడిచ్చిన భాగ్యభోగములకుఁగొదవ లేదు. తన క్రిందనే యెంద తెందరో జీవించుచున్నారు. పిమ్మట తిక్కనార్య వీరభద్రులు మఠమునుండి నెల్లూరుపురమునకు వచ్చిరి. ఇప్పుడు తిక్కనార్యుఁడు రాజాస్థానము వంకఁజూడనైనను లేదు. రాజకీయ వ్యవహారములనాతఁడు పూర్తిగా విడిచిపెట్టెను. అతనిని లౌకిక దృష్టియాధ్యాత్మికముగ మారినది. రాజకీయ కార్యములకు వినియోగింప వలసిన కాల మాతఁడు భార పరనమునకు వినియోగించు చుండెను.

నానాఁటికిని రగుల్కొనుచున్న శైవవైష్ణవ మత కలహములు దేశమున నశాంతిని బెంచుచుండెను. ఈ మత వైషమ్యము వైదికమత వ్యాప్తికిఁజీడపురుగుగ నుండెను. అందుచే నీ రెంటికిని సఖ్యము చేకూర్చవలెనని యాతఁడు తలపోసెను. హరిహరులొక్కఁడేగా ని భిన్నమూర్తులు గారని యుపదేశింపఁదొడఁగెను. తన మతమునకను గుణముగ నెల్లూరు పట్టణమునఁబెన్నానదీ తీరమునఁ హరిహర నాథస్వామికొక యాలయమునుగూడ నాతఁడు కట్టించుచుండెను.

## 15. దుర్బోధ

తిక్కనార్యుఁడు విశ్వేశ్వర దేశికుని మఠమునకు వెళ్ళిననాఁటి నుండియు నక్కన బయ్యనలు మనుమసిద్ధికి దుర్బోధనలు మొదలుపెట్టుచుండిరి. భారతము దనకుఁగృతినీయనిచోఁదల గొరిగించి మద్య మాంసములను దినిపించి యూరేగించెదనని మనుమసిద్ధి భూపతి పల్కిన పల్కులు తిక్కనాద్యునకు రోషముఁగలిగించెనని యానాఁటినుండి నెల్లూరు రాజ్యము పతనము చేయుటకు వెలనాటి చోళునితో నతఁడు రహస్యాలోచనముఁజేయుచున్నాఁడనియును విశ్వేశ్వర దేశికుని మఠమున కను మిషతో నమరావతికే వెళ్ళి యుండుననియు వారా రాజ పుంగవునితోఁగొండెములు చెప్ప మొదలిడిరి.

వారికొండెములు మొదట నారాజు విశ్వసించలేదు కాని తిక్కనార్యుఁడు గ్రామాంతరమునుండి వచ్చిన పిమ్మటఁగూడఁదన దర్శనమునకు రాకుండుట యాతని కొకించుక యనుమానముఁగల్గించెను. ఆతడు వచ్చి యప్పుడే రెండు మూఁడు నెలలైనది. ఒకనాఁడు రాజే స్వయముగ మంత్రిని రమ్మని వర్తమానమంపెను. ఆ వార్తావహునిఁదిక్కన మంత్రి కడకు వెళ్ళనీయకుండ దారిలోనే యడ్డి బయ్యన వాని చెవిలోనే యేమియో చెప్పెను. అంత నాతఁడు తిరిగి వచ్చి 'ప్రభూ! మంత్రిగారిని బిలుచుటకు నేను వెళ్ళఁగా వారు మిమ్మును, నన్నును నెన్నియోదుర్భాష లాడిరి. ఆనాఁడు సభలో భారత కృతిని యాచించుచునన్నిదురాలాపము లాడిన రాజు ముఖము చూడవలసిన యవసరము లేదని "కసరి పంపిరి" అని విన్నవించెను. ఈ పల్కులు మనుమసిద్ధి భూపాలున కక్కన బయ్యనలమాటపై మఱింత విశ్వాసముఁ జేకూర్చినవి.

ఒకనాఁడు మనుమసిద్ధిరాజు కొల్వుతీర్చి యుండఁగఁ గొందఱు చారులొకనిని బట్టితెచ్చి "రాజేంద్రా! వీఁడు వెలనాఁటి చోళుని రాజధానియగు ధనదపురమునుండి వచ్చెనఁట. తిక్కన మంత్రీంద్రుని కడకు వెళ్ళునఁట వీని బెదురుచూపుల వలస వీనిపై మాకనుమానము కల్గి యేలిన వారికడకుఁ గొని వచ్చినాము. తరువాత తమ చిత్త"మని పలికిరి. వానికడనొక మందసమున్నది. రాజు దానిని తెరిపించి చూచిన నందమూల్యమగు రత్నములున్నవి. ఆ దూతను శోధింప వలెనని యాతఁడు భటుల నాజ్ఞాపింపఁగా వారాతని యంగీనుండి యొక జాబునుఁదీసి రాజునకిచ్చిరి. అది విప్పి చూడ నందిట్లున్నది.

శ్రీ నెల్లూరు పుర వరాస్థానామాత్యాగ్రేసరులును, నుభయకవి మిత్రులును, గవిబ్రహ్మలును, నగు తిక్కనార్యులకు. ధాన్య కటకాధీశ్వరుఁడు కులోత్తుంగ రాజేంద్రుఁడు వ్రాయు విషయములు

మంత్రి పుంగవా!

మీరు కోరినట్లు నే నీకాన్కల నంపుచున్నాను. మీరు మీ వాగ్దానమును నిలఁబెట్టు కొందురుగాక! తగిన సూచనల తోడను, గాల నిర్ణయము తోడ మీరు జాబు వ్రాయుదురుగాక.

ఇట్లు,
రాజేంద్రుఁడు.

ఆ దూతను రాజ పురుషులు చెఱసాలలో బంధించిరి. "నమ్మిన వానికి గొంతుక కోఁతయా! యని రాజొక్కమారు నిట్టూర్పుపుచ్చెను." నేను చెప్ప లేదా! రాజేంద్రా! వృద్ధ రాజున్నంత కాలమతఁడు విశ్వాస పాత్రుడే. అది ప్రభు భక్తి యనుటకు వీలులేదు. భయము వలన పుట్టిన కపట వినయమన వలయును. తండ్రిగారు గతించి మూఁడేఁడులైనను నిండినవో లేదో! అప్పుడే యిన్ని తంత్రములు ఇన్ని మాయలును పన్నుచున్నాఁడు' తాతల నాఁటి నుండియు వచ్చుచున్న మంత్రి పదవి వారిది. ఆతనికిఁదెలిసిన దుర్గపుర రహస్యములు మీకే తెలియవని చెప్పవచ్చును. పై పెచ్చు దండనాథుఁడైన ఖడ్గ తిక్కన వాని పెద తండ్రి కుమారుడే గదా, సామంతులు, ఉన్నతోద్యోగులు, దూతలు వారు వీరు అననేల? మీ సొత్తును దినుచున్న యెల్లరును వాని యాజ్ఞకు లోనుగావలసినదేగదా! మీ యన్నము దినుచున్న యొక యుద్యోగి కింత గౌరవమా? వాని కందలములు, గొడుగులు మొదలగు రాజ చిహ్నములును గూడ నిచ్చితిరే! "మామా! యని పిలుచుచు బందుగులుకన్న హెచ్చుగా గౌరవించితిరే! అల్లునకధిక సత్కారము చేసిననే మగును.' అని అక్కన బయ్యనలు విషప్రయోగ మొనరింప మొదలిడిరి. అంత నా భూకాంతుఁడు "ఇప్పుడు కర్తవ్యమేమ"ని ప్రశ్నించెను. వారినట్లు ప్రశ్నించు పద్ధతి యింతకుఁబూర్వమెప్పుడును లేదు. ఇపుడుగూడ యాలోచనా పూర్వకముగా నా ప్రశ్న యాతని నోట ర లేదు. వెంటనేవారు "రాజేంద్రా! యీ సందర్భములో ముఖ్యముగఁజేయ వలసిన పనులు రెండు. మంత్రి తనంతట తానే కొలువునకు వచ్చుట మానుకొనెను. ఐన ఖడ్గ తిక్కన వలన నాతనికేనాఁటి విషయము లానాఁడే తెలియు చుండును. ఆ స్థానము నందలి వార్తలు వెల్లడి కాకుండఁచేయవలెనన్న మనము ముందు ఖడ్గతిక్కననుగోట లోనికి రానీయకుండఁజేయవలయును. అది మొదటి కర్తవ్యమ'నిరి. పిమ్మట వారికిట్లు సంభాషణ జరిగెను.

మనుమ :- ఖడ్గ తిక్కన లేనిదే సైనికులను సమర్థవంతముగ నడపఁగల దండ నాథుఁడెవఁడు?

అక్కన :- పందలు గలరు. ఖడ్గతిక్కన యొక్కఁడే దండనాథ పదవి కర్హుడును గవి తిక్కన యొక్కఁడే మంత్రి పదవి కర్హుఁడును గారు. వీరిరువురును తదితరుల సామర్థ్యమును మీరు గుర్తింపకుండఁగప్పి పుచ్చుచున్నారు. మీరు గుర్తించినచోఁదమ పదవులకు ముప్పు వచ్చునేమో యను భయమున వీరు వారినెన్నఁడును దమ దర్శనమునకైనను రానీయలేదు.

మనుమ :- వారిని మించిన శక్తిపరులుగూడ నున్నారా?

అక్కన :- ప్రభూ! మీకేటికా యనుమానము? వాగి ముందర నీ తిక్కయ్య లేపాటి? యుద్ధములందు సైనికుల నడుపుటకు బ్రాహ్మణులకు ధైర్యముండదు. పై పెచ్చు కనికరము హెచ్చుగ నుండును. ఇట్టి వారిని నమ్మి యుద్ధము జేసినచో విజయము దుర్లభము తిక్క భూపాలుని కాలమున విజయము చేకూరుట వీరి సామర్థ్యముచేతనని నేను నమ్మను. ఆ భూకాంతుని భుజబల పరాక్రమముల చేతననినేయై యుండును-

మనుమ :- సరే రెండవ కర్తవ్యము-?

అక్కన :- అది చాలా ముఖ్యమైనది. వెలనాఁటి చోడునకు దుర్గపుర రహస్యములను మీమంత్రి యందింపక పూర్వమే వారికన్న ముందుగ మనమే సంసిద్ధులమయి వారి నెదిరింప వలయును.

మనుమ :- అది మనకు సులభ సాధ్యమా? వారికున్న చతురంగ బలమెంతొ మనకుఁ దెలియదే!

బయ్యన :- రాజపుంగవా! నేనొక్క విషయము చెప్పెదను. అన్యథా భావింపక యాకర్ణింపుడు. మీరు చెప్పినట్లు వారి బలమెంతో యెఱుఁగ కుండ యుద్ధమునకు దిగుట మంచిదికాదు. కాని యక్కన చెప్పినట్లు కాలాతీతము నొనరించి శత్రువులను

మంత్రి మూలమున దుర్గపు రహస్యముల నెఱిఁగి మనపైఁబడు వరకు నూఱకుండుట శ్రేయోదాయకము గాదు. వారి కెంత బలమున్ననేమి? అదమరచినప్పుడు పైఁబడిన వారేమి చేయఁగలరు?

మకుమ - సమర్థులగు గూఢచారులను బంపి కొంత వఱకును మనము వారి గుట్టును భేదింపలేమా?

అయ్యన :- ఆ యుద్దేశమే తమకున్ననాడు మనమే గూఢ వేషములతో నచటి కేఁగుట మంచిది. ఈ స్థితిలో నితరులను నమ్మవలసిన పని



లేదు. ఏ బారులైనను దిక్కన మంత్రికి దాసులే గదా! రాజేంద్రా యీ రహస్యములు మన మువ్వురకు దప్ప నన్యులకుఁదెలియరాదు. పెదవి దాటిన పృధ్వీ దాటునుగదా! మనలో నొకరిచట నుండి నరియగు దండ నాయకాదుల నియోగించుచు యుద్ధ వ్రయత్నములో నుండవలెను. తక్కిన యిరువురును గూఢవేషములతో నమరావతికిఁబోయి రహస్య భేదనమునకుఁ బ్రియత్నించవ వలెను. సమయముఁగని పెట్టి యిచ్చటకు వార్త నంపు నరికి సైనికులు వచ్చుటకు సిద్ధముగ నుండవలెను. అది ప్రమాదములేని పని.

ఈ యాలోచనము మనుమ సిద్ధి హృదయమునకు బాగుగ హత్తినది. అక్కన బయ్యనలీవిధముగ నతని యాదరమును నంపాదించుకొనిరి. ఔరా! కొండెములకును, ఇచ్చకములకును బ్రిపంచమున నెంతస్థానము గలదో! మిత్రులైన తిక్కనలపై యాతని యాదర మడుగంటినది. అక్కన బయ్యనులపై నిపుడు గౌరవము మెండుకొనినది. ఆపదలు రానున్నప్పు డెంత వారికైనను బుద్ధులు వక్రించును గదా!

మఱుక్షణముననే ఖడ్గ తిక్కన వద భ్రష్టుఁడైనట్లాజ్ఞా వత్రము వంవబడినది. బయ్యన యుద్ధ సన్నాహ మొనరించుటకుద్యుక్తుఁడై నాఁడు అక్కనయు మనుమ సిద్ధి భూపాలుఁడును రహస్యముగ ధాన్య కటకమునకు వెళ్ళుటకు సిద్ధమయిరి. ఈ రహస్య మెవ్వరికిని దెలియదు. అంతఃపురములో మాత్రమ మరావతీ క్షేత్రమునకు యాత్రార్థమువెళ్ళు చున్నట్లాతఁడు చెప్పెను. తానెక్కడికి వెళ్లు చున్నదియు నెందులకు వెళ్ళుచున్నదియుఁజెప్పలేదు. కాని తాను తిరిగి వచ్చు వఱకును బయ్యన యాజ్ఞను దన యాజ్ఞగాఁ బాటింప వలెనని యుద్యోగుల కెల్లరకును నాజ్ఞాపించెను. మఱునాఁటి వేకువనే ప్రయాణము.

## 16. ఫలితము

నాఁడు శివరాత్రి. ఆ దినమున నమరావతీ క్షేత్రమును జూచుటకు వేయి కన్నులన్నను జాలవు. ఆనాఁడు దేశదేశములనుండి తండోపతండముగ యాత్రికులు వచ్చి యమరేశ్వరుని దర్శించుచుండిరి. గర్భాలయము జనసంకీర్ణమయి దైవ దర్శన మగుటయే దుర్లభముగ నున్నది. వైదికుల మంత్రధ్యానములు. జంగముల శంఖారావములు, భక్తజనుల జయ జయ నినాదములు యాత్రికుల స్తోత్ర గానములు గర్భాలయమందలి ఘంటికానిశ్వనములు నాట్యకత్తెల నూపుర క్రేంకారములు మిశితములై యొక మహాధ్వని మిన్ను ముట్టు చుండెను. ఆలయపు సింహద్వారము యాతా యాత జన ప్రాత ఘర్షణముననడుగు పెట్టుటకు సాధ్యము కాకున్నది. ఆ సింహద్వారము కడను, గృష్ణయొడ్డునను రాజ పురుషులు నిలుచుండి జనులయొత్తిడిని దగ్గించుట కెంతయో శ్రమ పడుచుండిరి. గృష్ణలోఁగ్రుంకు లిడెడు వారి తలలే తప్ప నీరు కంటికిఁగానరాలేదు.

తత్పురాధీశ్వరుఁడైన కులోత్తుంగ రాజేంద్ర చోడుఁడు యాత్రికుల సౌకర్యార్థమెన్నియో ధర్మ కార్యము లొనర్చెను. అతఁడు భక్తజనుల సౌకర్యమునకుఁబందిళ్ళను వేయించెను. అందుకొన్ని కేవలము నీడ నిచ్చునవి. కొన్ని స్త్రీలకు మరుఁగుగ నేర్పడినవి. కొన్ని పందిళ్ళలో మంచినీళ్ళు మజ్జిగ యూరవేసిన యుసిరిక కాయలు చంటిపిల్లలకుఁబాలు మొదలగునవి యిచ్చుటకు రాజు ప్రత్యేక జనమును నియోగించెను. మఱికొన్ని పందిళ్ళలో భోజనములనుగూడఁబెట్టించుచుండెను.

ఆ క్షేత్రమునకు గూడెములనుండి ధర్మాత్ములగు చెంచులెందఱో వచ్చిరి. వారు గొడుగుల కుంచెలు చెప్పులు యోగ దండములు గంధపుఁజెక్కలు. మొదలగు వివిధ వస్తువులను జంగముల కొసఁగుచు సాష్టాంగ నమస్కారములు చేయుచుండిరి.

యాత్రార్థులై యరుదెంచు నా జంగములు శంకర స్వరూపులే. కాలి కుప్పసములను దాల్చికావి దుప్పటిని గప్పికొని కంఠమునకును, దండలకును, మణి బంధములకును. జడలకును, రుద్రాక్షమాలికలనుగూర్చి, భస్మాను లిప్తమయి సర్వాంగ మొప్పార, శిరమునఁద్రామమకుటము చెన్నార, రుద్రాక్ష కుండలములనుదాల్చి, కంఠమునఁబ్రాణ లింగమును వహించి, భక్తులను దరింపఁజేయుటకు శివుఁడే వివిధ మూర్తులతో వచ్చెనోయనునట్లు వివిధ దేశాగతులగు జంగములు వెలయుచుండిరి.

ఆలయ ప్రాంతమున నొక సత్రమున నిరువురు జంగములు విడిసి రి. వారు కంచు జోళ్ళను నవరత్న మయ మయన నందీశ్వర విగ్రహము చివర గల కిరీటములను నాగాకృతిలోనున్న కాంచన కుండలములను ధరించిరి. కాలివలువలం గట్టిరి. చేతులకు రుద్రాక్ష మాలికలు గలవు. కంఠములందలి రుద్రాక్ష పేరుల నడుమ బంగరు లింగకాయలా సన్నని కాలియంగీల నుండి తొంగిచూచుచున్నవి. ఆ భుజంగములకు భక్త తండములు సాష్టాంగ దండ ప్రమాణము లొనర్చు చుండిరి. వారా భక్త జనుల మస్తకములఁ గేలంగిలించి "శివప్రసాద సిద్ధిరస్తు" ని యాశీర్వదించి నొసట భసిత తిలకములుంచి వంపు చుండిరి. అట్లు వచ్చుచుఁబోవు చున్న భక్తుల సంఖ్య లెక్కకు మిక్కుటము.

తత్పురాధీశుని దండ నాయకుఁడు గూడ వారి దర్శనమునకు వచ్చెను, అతఁడు సాగిలి మ్రొక్కఁగా వారు లేవనెత్తి దీవించి మోమునఁబూది బొట్టు బెట్టిరి. పిదప నాతఁడు "మహాత్ములారా! మీరు కైలాసాధి నాధుని మూర్తులే గాని తదన్యులుగారు. మీరు ఆగతా నాగతములను మీ దివ్యదృష్టి ప్రభావముచేఁజెప్పగలరు. నా భవిష్యత్తును గూర్చి యించుక చెప్పెదరా? అని వినయ పూర్వకముగవేడు కొనెను. ఆ జంగము లొకరి నొకరు కను సన్న లొనర్చుకొని పిదప "ఓయీ! నేటి సంధ్యా సమయమునఁబురము వెలుపల నున్న తోటలోనికి వచ్చి మమ్ము రహస్యముగఁగలిసి కొమ్ము" అని యానతిచ్చి పంపిరి.

వివిధ దేశాగతులైన తాపసులను శైవసన్యాసులను యోగులను జంగములను రాజపుంగవుఁడాదరించి తన యింటికి నాఁటి భిక్షకు రాఁబ్రార్థించెను. వారిలోఁ బెక్కంద్రుపవాసదీక్షలోనుండిరి. వచ్చిన భిక్షువులకు రాజేంద్రుఁడు పాదములుగడిగి యొత్తి వివిధ భక్ష్య భోజ్యములతోఁబరి తృప్తిగ భోజనమిడి, దండకమండల కాషాయాంబరాది దానములొసఁగి సత్కరించెను. మన జంగమద్వయముగూడనటకు వచ్చెను. వారిలో నొకరి ముఖము మందహాస పూరితమయి యుండెను. అతఁడును రాజేంద్రుడును గనుసన్నలతో నేమియో సంభాషించుకొనిరి. రెండవ జంగము దానిని గుర్తింపలేదు. పిమ్మట వారెల్లరు భూమిశ్వరునాశీర్వదించి యెవరి దారిని వారుపోయిరి.

సాయంకాలమైనది. సూర్యుఁడుత్సవాలోకనకుతూహలుడై (కాబోలు చరమాద్రి నధిరోహించియుండెను. ఆ సంజకెంజాయలనడుమ నామార్తాండుఁడు కాషాయాంబరాలంకృతుఁడగు సన్యాసివలె ప్రసన్నతేజోమయుడై యుండెను. మన జంగమలిర్వురును బురబాహ్యోద్యానమునకుఁజేరుకొనిరి. సంధ్యాసమయమై నంతనే దండనాధుఁడు వచ్చి వారి పాదములపై వ్రాలియుండెను. వారు వానిని లేవఁదీసి "ఓయీ! నీతడడుగు ప్రశ్నయేమి? ద్వాదశ భావములందును దేనిని గూర్చి నీవు చెప్పమందువు? అని వారడుగఁగా నాతఁడు" మహాత్ములారా! మీరు దైవతుల్యులు కనుక నడగుచుంటిని. నా హృదయముననొక యసామాన్యమగు కోరికగలదు. అది ఫలించునో ఫలించదో సెలవీయ వేడెదను." "అని పలుక వారు" "ఓయీ! ఆ కోరికయేదియో చెప్పుమ"నిరి. అతఁడు తన యభిమతమునుఁజెప్పుటకొకించుక సంశయించెను. అది చూచి వారిలో నొక జంగము'' నాయనా సంకోచింపఁబనిలేదు చెప్పుమని "పలుకనాతఁడు'' స్వామీ! అది దారుణమైన వాంఛ! మాయేలికకుఁ దెలిసినఁ బ్రాణాపాయము వచ్చునని

జంకుచున్నాన"ని బదులు చెప్పి తుదకా జంగముల నిర్బంధనమువలన వాఁడిట్లు చెప్పదొడంగెను." అయ్యలారా ! నేనుత్తమ క్షత్రియ సంజాతుఁడను. మేము తరతరముల నుండి యీ రాజ్యమునకు దండనాయకత్వమును వహించుచున్నాము. వారు మాకెన్నియో వసదనములను బిరుదములను నొసఁగి గౌరవించుచుండిరి. మేము వారియందు ప్రభు విశ్వాసమును నెఱపుచుండెడివారము. నేటి వరకునట్లే గడచినది. ఇప్పుడీ రాజున కత్యాశదినది ప్రవర్త మానమగుచున్నది. నెల్లూరు సామ్రాజ్యమునుగూడ గబళింపవలెనని యాతఁడాశించుచున్నాడు. ఈ మధ్య నెల్లూరు మంత్రితో కొన్ని సంప్రదింపులు జరిగినవి. ఆ మంత్రి కోట రహస్యములను జెప్పుచు యుద్ధములో సిద్ధి రాజునుబట్టి యిచ్చుటకును వానికిఁ దత్పదవియట్లుంచుచునైదులక్షల నిష్కములను వంద యగ్రహారములును వెలనాఁటి చోడరాజిచ్చుటకును అతని కుమారుడైన కొమ్మనాఖ్యుని వెలనాఁటికి దండనాయకునిగ నొనర్చుటకును నిర్ణయించుకొనిరి. మా రాజేంద్రుడీనాఁడా తిక్కన సహాయమపేక్షించి నన్ను దండనాయక పదవినుండి భ్రష్టునిజేసి తత్పదవిని వాని కుమారునకిచ్చుచున్నప్పుడు నేను మాత్రము ప్రభువిశ్వాసముఁ జూపవలయునా ?

మొదటి జంగము :- తిక్కనకును సిద్ధి రాజునకు బూర్వమువైరమున్నదా ?

దండ :- లేదఁట. ఈ మధ్యనే స్పర్ధలేర్పడిననట. భారతమును దనకుఁ గృతి నీయనిచో మాంసము దినిపించి, కల్లును ద్రావించి తలగొరిగించి యూరేగింతునని సిద్ధిరాజు మంత్రినొకనాఁటి నిండు సభలో నవమానించెనఁట ! అది సాకుగాఁబెట్టుకొని యామంత్రి యీవిధముగ స్వామిద్రోహ మొనరించుటకుద్యమించుచున్నాడు. అయ్యలారా ! కాలమహిమయిట్లున్నది. ఆ మనుమసిద్ధి రాజేంద్రుఁడా మంత్రి కొసంగిన గౌరవమే రాజపుంగవుఁడే మంత్రికొసంగెను. ఎన్నెన్నో యగ్రహారములను రాజ లాంచనములను నిచ్చి సత్కరించెనే ? వారు తాతలనాటి నుండియూ నా ప్రభువులయన్నమే తినుచు వారిబట్టయే గట్టుచు నేఁడిట్లు స్వామిద్రోహ మొనర్చుటయేమి మర్యాద ? అట్టి ద్రోహులకే యీనాఁడు గౌరవమును ఉన్నత పదవులును మా వంటి ప్రభుభక్తి పరాయణులకేమియును లేదుగదా ! ఉన్న పదవులే యూడిపోవుచున్నవి. స్వాములారా ! నేనొక చిన్న విషయమును మనవి చేసికొందును మీకుఁగోపము రాదుగదా !

మొదటి జంగము :- భయము లేదు చెప్పుము.

దండ :- ఇట్టి సందర్భములో నాకుఁగూడనొక దుర్బుద్ధికలుగుచున్నది. నా పదవికి వీరు భంగము కలుగఁజేయుచున్నప్పుడీ ప్రభువుపైన నేను మాత్రమేల విశ్వాసముఁజూపవలయును అని యాలోచించుచున్నాను. మీరు త్రికాలవేదులు కనుక నీరాజుపై నేను బగసాధించుకొనఁగలనో లేనో సెలవీయవలయును.

రెండవ జంగము :- నిన్ను పదవి నుండి తొలగించెదమని మీరాజు నీతోఁ జెప్పెనా ?

దండ :- లేదు అట్లుచెప్పినచో నెల్లూరు యుద్ధమునందు నేను తోడ్పడనని వారి దురభిప్రాయము వారట్లాలోచించిన రహస్యము నేనెట్లో భేదింపఁ జాలితిని

మొదటి జంగము :- నీకు ముఖ్యముగ నీరాజేంద్రుననఁగఁద్రొక్కవలెనని యున్నదా !

దండ :- చిత్తము ప్రభూ నాముఖ్యమగు కోర్కెయేయది ?

మొదటి జంగము :- నీవెట్లు పగసాధింపగలవు. కోట రహస్యములు నీకేమైనను తెలియునా ?

దండ :- కోటకు రహస్య మార్గములెక్కడెక్కడ నున్నవో నాకుఁబూర్తిగఁ




దెలియును. చతురంగబలముల పరిమాణమును దండనాయకుడనగుటచేత నాకుఁదెలిసినట్లెవరికిని దెలియదు. కోశాధికారి నాప్రియ మిత్రుఁడగుటచేతనెంత యార్థిక సంపదయున్నదో చెప్పగలను.

మొదటి జంగము :- నీపట్టుదల నిల్కడయైనదని మాకు నమ్మకము కల్గినచో నీ కోర్కెను సఫలముఁజేయఁగలము.

దండ :- గురు పూజ్యులారా ! ఇంతకన్న నున్నదా ! మీ పాదములతోడు. నన్ను మీరు నమ్ముఁడుఁ అని (వారిపాదములపై వ్రాలెను).

తరువాత నాదండ నాయకుని దూరముగ నునిచి యాజంగమ లిరువురును గొంత తడవురహస్యాలోచనల నొనరించుకొనిరి. పిమ్మట మొదటిజంగము దండనాయకునిఁ దమకడకుఁబిలిచి "ఓయీ ! నీవు మా దగ్గరనేవియు దాచకుము. మేముకూడ నీకడనట్లే యుందుము.

ఈతఁడు మా రాజేంద్రుడగు మనుమసిద్ధి నేనతని ప్రియమిత్రుఁడగు నక్కనను. నీయదృష్టము బాగుండుటచేతనే నీకష్ట సుఖములు మాకడనే చెప్పికొనునవకాశమా యమరేశ్వరుఁడు చేకూర్చినాఁడు. నీవు కోట రహస్యములన్నియు శంకింపక మాకుఁ జెప్పుము. అట్లు చేసినచోఁ దిక్కనకుఁ దెలియకుండఁగనే వెంటనే సైనికులదెప్పించి దండయాత్ర సాగించెదము. నీకు నీ పదవి యుంచుటయేగాక కోరిన బహుమానములను గూడనిచ్చెదనని పలుకనాతఁడు" అట్లయిన నారొట్టి విరిగి నేతిలో పడినదన్నమాట రాజపుంగవా ! నన్ను రక్షించు భారము మీఁది నేను తమ దర్శనమునకు వచ్చి నాకష్ట సుఖములను నాశక్తి సామర్థ్యములను దమకు మనవిచేసికొన్నచో ఫలించునని మొదటినేయనుకొంటిని. తమ సింహపురమునకు వచ్చుటకొకమారు ప్రయాణముకూడ నైతినికాని రెండు కారణముల వలన రాలేదు. మొదటి కారణము నా మాటలు ప్రభువులు విశ్వసింతురో విశ్వసింపరోయను భయము. చండశాసనుఁడగు మీ మంత్రి నా రాకనుగ్రహించి యెక్కడ ముప్పు వాటించునో యను భయము రెండవది. నేఁడు నాయదృష్టవశమున నాఁడబోయిన తీర్థమెదురైనట్లు మీరే స్వయముగ దర్శనమిచ్చిరి. ఇఁక మీరు నన్నుఁ బాలముంచెదరో నీట ముంచెదరోఁ మీరేమియు వ్యవధి యీయకుండ సైన్యమును గొనివచ్చినచో విజయము సిద్ధము దుర్గపు మర్మములన్నియు నిప్పుడే నివేదించెదను. మీ సైన్యమును దెప్పింపుడు. యుద్ధ సమయములో నేనవలీలగ రాజునుబట్టి యీయఁగల"నని పలికెను. అంతనా భూపాలుఁడు "ఓయీ ! నిన్ను పదవి నుండి తొలగింపఁజూచుచున్న రాజునకు నీపై నమ్మకము గలుగునా ?"అని యడుగఁగా నాతఁడు "దేవా ! అతఁడట్లు తిక్కనయొద్దకు రహస్యముగ నిచ్చిన వాగ్దానము నాకుఁదెలియదనియే యాతని యూహ అందుచేత నిప్పటికాతనికి నాపై ననుమానమే లేదు. ఇఁకముందెట్లుండునో ?"యని

ప్రత్యుత్తరమిచ్చెను.

పిమ్మట నక్కన "రాజపుంగవా! మనము జాగొనర్పరాదు. ఆలస్య మొనరించిన నమృతముగూడ విషమగును గదా! వెంటనే యీతనికడ మనము రహస్యములను గ్రహించి సైన్యమును గొనివచ్చుట మంచిది" అని పలికి దండనాయకునిఁజూచి "ఓయీ! మాకు రహస్యములనెప్పుడు చెప్పెద వని యడుగ నాతఁడు" ఆర్యా! వివరణలెల్లఁ గోటలోనున్నవి. రహస్య మార్గములు గుర్తించుచు వ్రాసిన దుర్గపు పటముగూడ నచటనే యున్నది. మీరు దయచేసినచో వానినెల్లఁజూపఁగలను. నేఁడు శివరాత్రియగుటచే నాటకములు, భజనలు, పురాణములు మొదలగు సత్కథా కాలక్షేపములతోఁబౌరు లందఱు జాగరము చేయుదురు. పురమున సందుల గొందులందు సయితము సందడిగనే యుండును. రేపు రాత్రితొలిజాము గడచిన పిమ్మట వీరెల్లరును గాఢ నిద్రలోనుండక తప్పదు. ద్వార పాలురుగూడ మైకములోనేయుందురు. కనుక మనమప్పుడు యథేచ్ఛగ దుర్గములోనికిఁబోయి యా విశేషములన్నియు నరయవచ్చును"అని పలికి వారికడ సెలవు పుచ్చుకొని తన యింటికరిగెను. సులభముగఁ దన ప్రయత్నము కొనసాగుచున్నందులకారాజు మిక్కిలి సంతోషించెను. పిమ్మట నా యిరువురును దేవాలయము దెసకేఁగిరి.

ఆనాఁటి రాత్రి చెంచులు తారకాసురవధ, గంగావతరణము, హాలాహల భక్షణము, దక్షక్రతుధ్వంసము, మొదలగు శివలీలా ఘట్టములను మనోరంజకముగ నాట్యమొనరింప మొదలిడిరి. శివయోగులు కొందఱు శివపురాణము, పండితారాధ్య చరిత్రము, బసవపురాణము మొదలగు గ్రంథములను జెప్పుచుండిరి. భక్తులు మధురముగ గానమొనరించుచుఁబురహరుని గీర్తించుచుండిరి. జనులు తండోపతండములుగ వచ్చి వీనినెల్ల దర్శించుచుండిరి. మరునాఁడు గూడ పగలెల్ల నాయుత్సవములట్లే జరిగినవి.

సాయంకాలమైనది. సూర్యుఁడు చరమాద్రి మాటునకేఁగెను. తారలొక్కొక్కటే తలలెత్తుచుండెను. క్రమక్రమముగఁ దొలిజాముగూడ గడచినది. అంధకారము నలుదెసలనలముకొన్నది. ఇప్పుడు జనసంచారము సన్నగిల్లినది. జాగరణముతో బడలిన జనులెల్ల గాఢసుషుప్తిలో మునిఁగి యుండిరి.

రాజ మార్గము నుండి యా గాఢాంధ కారములో ముగ్గురు వ్యక్తులు కోటలోనికిఁబోవుచుండిరి. దుర్గ ద్వారముకడనున్న దీపికలలో మెఱయుచున్న తన్మకుటాగ్ర రత్నపుఁగాంతులతో నిరువురి వదనములు స్పష్టముగగోచరించుచున్నవి. వారిరువురును జంగము వేషములోనున్న మనుమసిద్ధియు, నక్కనయు, మఱిమూఁడవవాఁడు మొగము ముసుగుఁలోఁగప్పివుచ్చెను. అతడు వెలనాటి సీమదండ నాయకుఁడు జంగములు కోటలోనికి వచ్చుచున్నచో వారినడ్డగింప




రాదనియు, సాష్టాంగ నమస్కారమొనరించి విడిచిపెట్టవలయునని యుద్వార రక్షకులను రాజు తత్పూర్వమేశాసించియుండెను. ఇప్పుడే ద్వారా పాలకులు వీరురాక పూర్వము నుండియు సాష్టాంగ మొనరించుచు దారి విడిచి యుండిరి. రాజ శాసనమువలన వారట్లు చేయుచుండలేదు. నిద్రాదేవియాజ్ఞ చొప్పుననా విశ్వాసముఁజూపుచుండిరి.

వారు ముప్పురును గోటలోనికిఁబ్రవేశించి యొకగది దగ్గరకు వచ్చిరి. పిమ్మట నా దండ నాయకుఁడు తనకడనున్న తాళముతో నాగది తలుపు తీసి వారినట ప్రవేశము పెట్టెను. తదనంతరమున నా దండనాయకుఁడు దీపము వెలిగించి యక్కననుజూచి "అయ్యా! మన జాగ్రత్త మనకుండవలయును. మీరు బయట చీఁకటిలో నిల్చుండుఁడు. ఏ మాత్రమైనను మనుష్యుల జాడ దోఁచినచో దెలియఁజేయుఁడ"ని యాతనిఁబయటికంపెను. అచటనొక మందస మున్నది. అతఁడు "రాజేంద్రా! మనకుఁగావలసిన వివరణలీ మందసమున నున్నవి. వానిని దీసి మనమిప్పుడు నిరభ్యంతరముగఁ జూడఁవచ్చును". అని తన మొలను దడుముకొని" అయ్యా! తాళములను మఱచితిని క్షణ ముండుఁడు. ఇప్పుడే తెచ్చెదనని చెప్పి యీవలకు వచ్చి కవాటము బంధించి పైన బీగము నొక్కి" వెట్టి రాజా! కులోత్తుంగ రాజేంద్రునికడ నీ యాటలు సాగునా"యని కేరింతలు కొట్టుచు అక్కనయు దాను నాయంధకారములో లీనమైరి.

## 17. విన్నపము

"మహాకవీంద్రా! వందనములు. మనుమసిద్ధి మండలాధీశ్వరులును, మీరును బాల్యస్నేహితులు. మీ యిరువురనెత్తుకొని యాడించిన దాదియొక్కతెయే. చిన్నతనమున మీ యిరువురాడినను, బాడినను, విహరించినను, నొక్కస్థలముననే! మీ యిరువురకు నస్త్ర విద్యాగురువు లొక్కరే! మీ యుభయులకు నెప్పుడును భిన్నాభిప్రాయములు లేవు. ఒకటే హృదయము. రెండు శరీరములలో నునిచి వాత తన నిర్మాణ చాతుర్యమును జూపుచుండెనాయనిఁ మిమ్ము జూచినప్పుడెల్ల నాశ్చర్యమందు దానను! మీయందు వారు చూపు నాదరము వారియందు మీ చూపు గౌరమును నీనాఁడు మీరు తెచ్చిపెట్టుకొన్నవి కావు. ఎన్ని తరములనుండి వచ్చుచున్నవో! మంత్రులై, దండనాయకులై, మిత్రులై మీ పూర్వులీరాజవంశమును రక్షించుచుండిరి. ఆ నియమమును మీరుగూడ నేఁటివఱకుఁ బాటించిరి.

నేఁడు మీ యేలిక, మీ స్నేహితుడు, మీ సహాధ్యాయుడు! మీ కావ్యభర్త పరరాజుల చేతఁజిక్కి పడరానిపాట్లు పడుచున్నారు. మంత్రిపుంగవా! మా రాజుగారిని మాకు దయచేయరా! "అనునొక దీనకాంత సన్నని కంఠము తిక్కన మంత్రీంద్రుని చెవినిబడెను. అతఁడా చంకకు మోముద్రిప్పి చూడఁగా స్త్రీమూర్తి ధరించిన యొక దైన్యరేఖ యాతని కట్టెదుటఁ గన్నుల నీరు గ్రక్కుకొనుచు నిలుచుండెను. అపరమిత శోకతప్తయై కందినయాలేఁబ్రాయపుమేనును జూచునరికామంత్రీంద్రుని కన్నులు చెమ్మగిల్లినవి "శారదా!" యని యతఁడొక్కసారి పిలిచెను. పిలిచినంతనే యామె హృదయమునందలి దుఃఖము పెల్లుబికియెక్కు పెట్టిన బావురమని యేడ్చెను. ఒరులు పరామర్శించినప్పుడు దుఃఖ మినుమడించి బహిర్గతమగుట సహజము గదా!

"కాంతా! విలపించకు! ఎట్టివారికిని విధివిలాసమును దాట వాటముగాదు గదా! ఉద్యోగభ్రష్టుడైన నేనేమిచేయఁగలను" అని కవీంద్రుఁడు పలుక నా విలాసిని రుద్ధ కంఠమును సవరించుకొనుచు "ఆర్యా! ఆపత్కాలమున మీరు మీ పదవిని విడిచిపెట్టి మహారాజుగారు శత్రువులచేఁ జిక్కియుండఁగా నుపేక్షించి మా యదృష్టమున కంతరాయముఁ గల్గించుట న్యాయమా! మీ దగ్గఱ నున్న చనువును బురస్కరించుకొని భారతమును గృతియీయనిచో నట్లుచేయనని యేదో యన్నంత మాత్రమున దానికింతగా మీరు పట్టుదలవహించి వారి దర్శనము మానితిరే? రమ్మని దూత నంపినను వచ్చుట మానితిరే! తుదకుఁ

గుల్తోత్తుంగ రాజేంద్రచోడునితో రహస్యాలోచన మొనరించి మనుమసిద్ధి రాజేంద్రుని చెరపాలొనరించితిరే! కవిపుంగవా! వెన్నవంటి హృదయము కాఠిన్యము వహించుట మా దురదృష్టమే గదా!" అని వెక్కివెక్కి యేడ్వఁ దొడఁగినది.

తానొక ప్రభుద్రోహియని యామె యూహించినట్లు గోచరించినది. ఆ మాటలతనికేమియు వింతను గలిగింపలేదు. తన్నుగూర్చి యితరులిట్లు నిందించుచుఁ జెప్పుకొనుట రెండు మూఁడు మాఱులాతని చెవులఁబడెను. నాఁటికి రెండు దినముల ముందట నొకనాఁడు రాజమాతయే యా మంత్రి పుంగవునకు రహస్యముగ వర్తమానమంపి రప్పించి "తమ్ముఁడా! యల్లునిపై నింత కోపము తగునా! చిరంజీవి యవివేకమున నన్ను మాటలను పట్టించుకొని యుపేక్ష చేసెదవేల? వాఁడు పరరాజు చేతులలోఁ జిక్కిన నీవు చిక్కినట్లుకదా!" అని మందలించినది. తెలిమబ్బు మాటుననున్న చంద్రరేఖవలె నొక తలిపంపు తెఱమఱుఁగుననున్న కృశాంగి యొకతె "బాబయ్యగారు! నా పసుపు కుంకుమలను నిలఁబెట్టరా?" యని మందస్వరమున విలపించినది. మని యామె కోరుటయు "నచిర కాలములోనే మీ వంశాంకురమును మీయొడిలోఁబెట్టెదన" ని యాతడు వాగ్దానమిచ్చుటయును జరిగినది. ఇప్పుడు శారద గూడ నట్లే యనుమానించినది. ఎవతో తెఱమఱుఁగున నుండి యీ నాటక మాడించుచున్నారని యాతండు గ్రహించెను. మనుమసిద్ధి రాజుతో ధనదపుర మక్కనగూడ వెళ్ళినట్లును రాజు బంధింపబడినట్లును గూఢచారుల మూలమునఁ దానంతకుఁ బూర్వమే వినియుండెను. రాజకీయ వ్యవహారము లక్కనబయ్యనలే చూచుకొనుచుండిరి. ఇదంతయూఁబట్టి చూడఁగా రాజు పట్టువడుటకును దనకీ నింద వచ్చుటకును వీరలే కారణమైనట్లు స్పష్టమైనది.

"శారదా! నీవు పొరబడుచున్నావు రాజు చనువుచేనన్న యీ మాటలు నేను పట్టించుకొనలేదు. వెలనాటిరాజునకును నాకును నెట్టి సంబంధమునులేదు. అతఁడుద్యోగమునుండి తప్పించినంత మాత్రమునఁ బరరాజు నాశ్రయించు నంతటి ప్రభుద్రోహులుగారీ కొట్టరువుమారు" అని పలికెను. అంతనామె "ఆర్యా! అట్లు సెలవిచ్చెదరేల? మీరే పదవిని త్యజించినట్లును. వారి దర్శనమునకు వచ్చుట మానుకొన్నట్లును దుదకు వర్తమాన మంపినను నిరసనచూపినట్లును రాజుగారు సెలవిచ్చినారు. మిమ్ముఁబదవినుండి తొలఁగించలేదట" అనుచుండ నంతలో రోషారుణిత లోచనుండగుచు ఖడ్గతిక్కన యచటకువచ్చి "తొలగించిరో లేదో నీకేమి తెలియును? వారి ముద్రతోనున్న పత్రము మా కడకు వచ్చినది. దానియందు మమ్ము బదవినుండి తొలగించినట్లు స్పష్టముగనున్నది. తరతరములనుండియు నా ప్రభువులమీఁద మాకున్న విశ్వాసమును వారు విశ్వసింపలేకపోయిరి. అక్కన బయ్యనలవంచనాత్మకములైన పల్కులు తీపియేసవి. తుదకు తత్ఫలితముగ శత్రువులచేజిక్కిరి. ఇప్పుడక్కన బయ్యనలే మహారాజులు. ఊరు పేరును లేని యీ గోచిపాత రాయుల యాజ్ఞకు దిరుగులేదు. సోదరా! చూచితివా! వారి దుండగము శత్రువులచే చిక్కిన మహారాజును విడిపింపవలయును కావున యుద్ధమునకు సైన్యము నాయుత్తము చేసెద" నని నేననఁగా "ఓయీ! పదవిని గోల్పోయిన నీకిశ్రమయేల? కర్తవ్యము మాకుఁదెలియనులే? నీకుఁబ్రభువిశ్వాసమున్నచో నాతఁడున్న చెఱసాల కడకుఁబోయి పెద్దపెట్టున నేడువు" మని పలికిరి వారల గర్వమడఁగింపక మనముపేక్షచేయరాదు. ప్రభువులు మనలను విడిచి పెట్టినను ఆ పన్నులయి యిట్టి సమయమున మనము వారి నాదుకొనుట మన విద్యుక్త ధర్మము" అని గంభీరముగాఁ బలికెను.

అంతలో నచటికొక చార్వాకుఁడేఁగుదెంచి మంత్రి పుంగవునకుఁ బ్రణమిల్లినలుఁగడలు పరికించిచూచెను. తిక్కనార్యుఁడు "నాయనా! మారన్నా! వీరిలో గ్రొత్తవారెవరును లేరు. నిర్భయముగఁ జెప్పుము" అని పలికెను. అంత నాబాలుఁడు "గురువుగారూ! మీ యాజ్ఞ ప్రకారమీ చార్వాక వేషమున నా యాశ్రమములో నుండఁగా వాఁడొక ప్రకారమునేఁడు నక్కన యచటకు వచ్చెను. పిమ్మట చార్వాక గురుఁడును అతఁడును ద్రాక్షాసవము సేవించి కొంతతడవు ముచ్చటించుకొనిరి. ఆ సందర్భములో నక్కన "గురూ! చూచితివా! నా ప్రభావము! మంత్రిని, దండనాయకునకును నుద్యోగములూడఁ బెఱికించి రాజును చెఱఁబెట్టించినాను" అని పలుకఁగా చార్వాకుఁడు అన్నట్టు మఱచితిని ఖడ్గతిక్కనకు ముద్రలను రాజే పంపెనా? లేక మంత్రికి పంపినట్లే రాజముద్రను వేసి నీవే పంపితివా?" యని యడిగెను అందులకాతఁడు లేదు లేదు రాజే పంపెను. మంత్రి తిక్కనపై నాతని కనుమానము చెంచి యాతని బందువైన ఖడ్గతిక్కన దండనాయక పదవినుండుట శ్రేయస్కరము కాదనినేనంటిని. దాని కతఁడంగీకరించి తానేస్వయముగ నాజ్ఞాపత్రముపంపెను. మిత్రమా! చూచితివా! యీ యుంగర ప్రభావము యనిపలుకగా నాచార్వాకుడు నీకా యుంగర మెప్పుడెక్కడ దొరికినదని యడిగెను. అంత నక్కన విజయదశమినాఁగు నీ యాశ్రమ ప్రాంతమున దొరికినద" ని చెప్పెను. "గురు పుంగవా! వీరి సంభాషణనుబట్టి చూడ రాజముద్రగల యుంగర మాతనిచేఁ జిక్కినట్లు స్పష్టమగుచున్నది" అని వచించెను.

ఆ మాటలు వినుచున్న శారదకుఁదన గత వృత్తాంతమంతయు స్మృతికి వచ్చెను. మహారాజా నాఁటిరేయి బహూకరించిన నిజ నామాంకిత మగు సంగుళీయక మయ్యదియే కానోపునని యెంచెను. విజయదశమి నాఁటి సాయంకాలము చార్వాకాశ్రమ ప్రాంతమున జరిగిన సంఘటన జ్ఞప్తికి వచ్చినది. ఆ చార్వాకునితోఁ బెనగులాటలోనది తదాశ్రమ ప్రాంతమునఁబడి పోయి యుండుననియు నామె యూహించి యా విషయము మంత్రి దండనాయకులకు విన్నవించెను.

అటుపిమ్మట మారన యామెతో "శారదా! అందునీ ప్రసంగముగూడ వచ్చినది. విజయదశమినాఁడు నీవా చార్వాకునిచేఁజిక్కి తప్పించుకొన్నది మొదలు నీపై నాతనికి వలపుమెండు కొనినదఁట వాఁడక్కనతో "మిత్రమా! నాకిచ్చిన వాగ్దానము మాత్రము మఱువకుమా!" అనఁగా నీకుఁ గావలసినది శారదయేగదటోయి! మూడు ఘడియలలో మన యాశ్రయము ముందిటికి వచ్చునట్లు చేయుదును. రేపు రాత్రికది నీప్రక్క నుండనిచో నన్ను "అక్కనా' అని పిలువకుము. అని ప్రతిన బూనెను అందుచే నీ జాగ్రత్తలో నీవుండుట మంచిది" అని వచించెను.

ఆ పలుకులామె కోమల హృదయము ఝంఝూమారుతమునకు నూఁగెడు గులాబీ పూలగత్తి వలెఁజలించినది. ఆ కన్నులనుండి మంచు బిందువులవలె రెండశ్రు కణములు నేలరాలినవి. "ఆర్యా! మీరుతప్ప నాకు వేరు దిక్కులేదు నా మానప్రాణములను నిలబెట్టరా! ఆతని చేతిలోఁబడకుఁడ జేయరా! అయ్యో కాలమెంతలో నెంతగా మాఱినది" అని విలపించెను.

అంతఁదిక్కనామాత్యుఁడు "కాంతా! దుఃఖించిన బ్రయోజనమేమి? ధైర్యమూని యుండుము. అంతకును జగద్రక్షకుఁడైన హరిహరనాథుఁడే యున్నాఁడు. కౌరవసభలో నాకృష్ణుఁడు ద్రౌపది మానమును గాపాడలేదా మానవమాత్రునిఁ బ్రార్థించినేమి ప్రయోజనము ఆ జగద్రక్షకుని స్తుతింపుము.

మ॥ అరయన్ శంతనుపుత్రుపైన, విదురుపై, నక్రూరుపైఁ, గుబ్జపై,
నరుపై, ద్రౌపదిపైఁ, గుచేలుపయి, న్నందవ్రజ శ్రేణిపై,
బరఁగన్‌గల్గు భవత్కృపారసము నాపైఁ గొంతరానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ జగదీశా! కృష్ణ భక్తప్రియా!

అని కన్నులు మూసికొని భక్తి తత్పరుఁడై ప్రార్థించెను. ఆ భక్తిభావమున లీనమై యచటి వారెల్లరును నొకసారి కరములు యోడ్చి, కన్నులు మూసికొని ధ్యాననిమగ్నులై యుండిరి.

**(ఇంకా ఉంది)**

# డాక్టర్ పేర్వారం జగన్నాథం

# ఆరె పాటలు - సాంస్కృతిక విశేషాలు

ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని శతాబ్దాలనుండి ఆరెవాళ్ళు అనబడే ఒకరకం జాతి జనులు నివసిస్తున్నారు వీళ్ళను ''ఆరెకాపులు'', ''ఆరె మరాఠీలు'' అని కూడ కొన్ని ప్రాంతాల్లో పిలుస్తుంటారు ఈ 'ఆరె' అన్న పదం 'ఆర్య' శబ్ద భవమని పండితు లభిప్రాయ పడుతున్నారు వీళ్ళు మహారాష్ట్రకు చెందిన క్షత్రియ వంశజులు కావడం మూలాన 'ఆర్యక్షత్రియులు'గానూ పరిగణింపబడు తున్నారు వీళ్ళ మాతృభాష ఆరె బాస, అంటే మరాఠీ తెలుగసీమలో వెలసిన మాండలిక మన్నమాట శతాబ్దాల క్రితం మహారాష్ట్రనుండి అనేక కారణాల వల్ల వీళ్ళు తెలుగు దేశానికి వలస వచ్చి ఇక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొని తెలుగు ప్రజల్లో లీనమై పోయినారు వీళ్లు తమవెంట తెచ్చుకున్న భాషా సంస్కృ తులు తెలుగుదేశపు భాషా సంస్కృతుల్లో భాగమై పోయినాయి నేటికీ వీళ్ళు తమ ఇండ్లలో ఆరె భాష మాట్లాడినా గడప దాటితే మాత్రం అచ్చమైన తెలుగులో వ్యవహారం నడుపుతుంటారు వీళ్ళలో ఆంధ్ర మహారాష్ట్ర సంస్కృ తుల మేలు కలయిక కనిపిస్తుంటుంది భారతదేశంలోని ఈ ఉన్నతాదర్శమే జాతిలో సమైక్యతా భావాన్ని ప్రచలితం చేస్తున్నది

ఆంధ్రప్రదేశ్‌లోని ఆరెవాళ్ళు వ్యవసాయాన్నే ముఖ్యవృత్తిగా స్వీకరించి నారు. యుద్ధ సమయాల్లో వీర సైనికులుగానూ, శాంతికాలంలో నేలను దున్ని పంటలు పండించే కాపులుగానూ ఉండడం వీళ్ళకు వారసత్వంగా వస్తున్న కులా చారం. అందుకే వీళ్ళ ఇండ్లలో క్షత్రియోచితమైన ఆయుధాలుండడం పరిపాటిగా వస్తున్నది. వివాహాల్లో అటు క్షాత్రధర్మాన్నీ, ఇటు కాపువృత్తినీ ప్రదర్శించే కార్యక్రమాలు ఆచరింపబడుతుంటాయి భవానీమాత వీరి కులదైవం సాధారణంగా వీళ్ళంతా శైవులు. తెలంగాణాలో చాలామంది లింగధారులు కూడ వున్నారు సరి హద్దు జిల్లాలైన ఆదిలాబాదు, నిజామాబాదు ప్రాంతాల్లో కొందరు చక్రధరస్వామి మార్గానికి చెందిన కృష్ణభక్తులూ కనిపిస్తారు. వరంగల్లు కరీంనగర్ ప్రాంతాల్లో అక్కడక్కడా వైష్ణవం కూడ చోటు చేసుకున్నది తెలంగాణంలోని ఆరెవాళ్లు శాకాహారులు కావడం గమనించదగిన అంశం ఐనా వీళ్ళకు యజ్ఞోపవీతం లేదు. ఆరెవాళ్ళు అధిక సంఖ్యలో నివసించే గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో వున్నాయి. వాటిని తెలంగాణాలోనైతే ''ఆరెపల్లెలు'' ఆంధ్ర ప్రాంతంలోనైతే ''మరాఠీపాలెం'' లేక ''మరాఠీ పల్లెలు'' అనీ పిలుస్తున్నారు.

ఆరె పదాన్ని మొట్టమొదట కావ్యస్థం చేసిన తెలుగు కవి పాల్కురికి సోమనాథుడు. వృషాధిపశతకంలో ఆరెబాసలో ఒక పద్యమే రచించినాడు పండితారాధ్యచరిత్రంలోనూ ఆరెబాసలో కొన్ని ద్విపదలు రచించినాడు ఆరె పదాన్ని భాషాపరంగానూ, దేశపరంగానూ జాతిపరంగాను వాడిన మొదటికవి సోమనాథుడే. ఈతడు పన్నెండవ శతాబ్దం వాడుగా చెప్పబడుతున్నాడు. అందు వల్ల మహారాష్ట్రం నుండి తెలుగుదేశానికి వలస రావడం సోమనాథునికన్న ముందు నుంచే ప్రారంభమైందని ఊహింపవచ్చు. కాకతీయుల కాలంనుంచే మహారాష్ట్రం నుంచి ప్రజలు తెలుగుదేశానికి వలస వచ్చి ఇక్కడే స్థిరనివాస మేర్పరచుకొని తెలుగు ప్రజల్లో లీనమైపోయినట్లు చరిత్రకారులు కూడ వ్రాస్తున్నారు. అందుకే ఆధునిక మరాఠీ భాషలో లేని ప్రాచీన భాషా విశేషాలు, పదబంధాలు నేటికీ ఆరె భాషలో కనిపిస్తున్నాయి. సోమనాథుని తరువాత 15వ శతాబ్దం వాడైన కొఱవి గోపరాజూ, 16వ శతాబ్దంవాడైన పొన్నికంటి తెలగనార్యుడూ తమ తమ కావ్యాల్లో ఆరె పదాన్ని జాతివాచకంగానూ, భాషా వాచకంగానూ ప్రయోగించి నారు. 18వ శతాబ్దం వాడైన నుదురుపాటి వెంకనార్యుడు తన ''ఆంధ్ర భాషార్ణవము''లో 'ఆరె' పదానికి మహారాష్ట్రదని అర్థం చెప్పినాడు. ఆ తరువాత అకారాదిగా వెలసిన అన్ని నిఘంటువుల్లోకి కూడ ఈ పదం ప్రాకింది నైఘంటిక లందరూ ఈ 'ఆరె' పదానికి మరాఠీవాడనే అర్థం ఇస్తున్నారు.

ఆరె భాషకు లిపి లేకపోయినప్పటికినీ వాళ్ళ ఇండ్లలో ఏదైనా శుభకార్యం జరిగితే ఇప్పటికీ తప్పకుండా ఆరె జానపదగేయాల్ని గానం చేస్తుంటారు. పెండ్లి జరిగినా. పేరు పెట్టినా, పుట్టింటికి చెల్లెల్ని తీసుకపోవడానికి అన్నగారు వచ్చినా ఆరెవాళ్ళ ఇంటి ఆడపడుచులు కమ్మని కంఠంతో పాటలు పాడి బంధువుల్ని అలరిస్తుంటారు. వీళ్ళను ఆశ్రయించి జీవించే ''గొంధలీలు'' అనబడే మరొక తెగకు చెందినవారు కూడ వున్నారు. ఆరెవాళ్ళ ఇండ్లలో శుభకార్యాలు జరిగి నప్పుడు వీళ్ళు వారి భాషలోనే వీర, కరుణ రసాత్మకాలైన కథలు చెప్పుతూ జానపద ప్రదర్శనలిస్తూ ఊరూరా తిరుగుతుంటారు ఇట్లా ఆరె భాషకు సంబంధించిన జానపద గేయాలూ, ఆరెవాళ్ళకు సంబంధించిన గాథలూ నేటికీ వాళ్ళ నాలుకలపై ప్రాణం నిలబెట్టుకుంటున్నాయి. వాళ్ళ సాంస్కృతిక సాంఘిక జీవితానికి అవి 'నిలువుటద్దం'లా భాసిస్తున్నాయి.

ఇక ప్రచారంలో వున్న కొన్ని ఆరె జానపద గేయాల్లో వ్యక్తమయ్యే సాంస్కృతిక విశేషాల్ని వివరిస్తాను. ఆరెవాళ్ళ వివాహాల్లో 'దేవక్' కట్టే ఆచారం ఒకటున్నది. వధూవరుల ఇండ్లలో ఎవరికి వారు దీన్ని వేరువేరుగా నిర్వహిస్తారు. వివాహానికి ఒకరోజు ముందు ఇంటి ఆడబిడ్డ తన భర్తతో కలిసి కొంగుకు బ్రహ్మ ముడి వేసుకొని పచ్చని పెండ్లి పందిరికి 'దేవక్' కడుతుంది. ఒక రోకలినీ, గొడ్డలినీ, పెరుగుతో కలిపిన చద్ది అన్నం మూటనూ, జమ్మి కొమ్మనూ మంగళ వాయిద్యాలు మ్రోగుతుండగా పెండ్లి పందిరికి కట్టే తంతునే 'దేవక్' అంటారు. దీన్ని వధువు ఇంటిలోనూ, వరుని ఇంటిలోనూ విడివిడిగా జరిపిస్తారు. వివాహా నంతరం పదహారో పండుగ జరిగేలోగా మంచిరోజు చూసుకొని కట్టినవాళ్ళే మళ్ళీ దీన్ని విప్పడం ఆచారం. దీన్ని కట్టే సందర్భంలో ముత్తైదువలు ఈ క్రింది విధంగా పాడుతారు

సోనాచ కురాడే_రుపియాచ దండా
ధయీ భతాచ సిదోరీ
దేవుక దాదాచ వదరీ
సోనియాచ గడ
రుపియాచ నాడా
ధాలే పౌలే బయీాల
బయిల నహ్వా బాస్వదేవ
చేతురు చాలాలే డొంగరా
త్యామీ తోడీలే మొగరా
అస్తోరీ పురుస
బర్మ ఘూంటూ ఘాయీాను
ఫేతో నాకీచ హేనావ్హా
సందడి గావోజి ఘాతీలా
సందడీచ వంట
సోనాచ ధాలాతూ
వాజాతూ గాజాతూ
బజార మిర్వతూ

చౌ బజార మిర్వతూ
ఆలే మండవాచ దారీ
ఆగాసీ మండవ
ధర్తరీ బవుల
సందడీచ వంట
రే సమాచ దోరీ
బయిస బయిసకు దేవకు
బయిసకు దేవకు
జయ జయ ఖంబాల
ఫిర్తీ మీచ రాజే
దేవాల ఆలే
రామసీతాచ వరాడు
సీతారామాచ వరాడు'

అంటే—

వెండితో చేసిన కామకు
బంగారు గొడ్డలిని ధరించి
దేవక్ కట్టే అన్నగారు
పెరుగన్నపు చద్దిని తన కొంగుకు కట్టుకొని
వృషభరాజు వంటి మేలుజాతి ఎడ్లూ
వెండి కమ్మల చక్రాలూ కలిగిన
బంగారు బండిపై కూర్చుండి
అడవికి వెళ్ళి చెట్లను నరికి
ఆలుమగలిద్దరూ బ్రహ్మముడి వేసుకొని
బంగారు పళ్ళెంలో జమ్మికొమ్మ పెట్టుకొని
ఆడుతూ పాడుతూ ఉల్లాసంగా
విలాసంతో బజార్లల్లో విహరించుకుంటూ
ఆనందంతో పెండ్లి పందిరి కిందికి వచ్చి
పట్టువారంలో స్తంభానికి దేవక్ కట్టడానికి
పృథివిని పాలించే రాజులా
సీతారాముల వివాహానికి వేంచేసినాడు '

ఇక్కడ గొడ్డలి పట్టుకొని అడవికి వెళ్ళి చెట్లు నరుకడం వంటి వ్యావసాయిక లక్షణాలూ, జమ్మిని పూజించడం వంటి క్షత్రియ ధర్మాలూ అభివర్ణింపబడినాయి. వీళ్ళు తెలుగుదేశానికి వచ్చిన అతి ప్రాచీన కాలంలోనే అడవులు నరికి, వ్యావసాయిక క్షేత్రాలుగా మార్చి, గ్రామాలు నిర్మించి గ్రామాధికారులుగా మారినట్లు సాంప్రదాయికమైన కథనం కూడ వ్యాప్తిలో ఉన్నది యుద్ధకారణంగానో లేక మహారాష్ట్ర దేశంలో కరువు కాటకాలు వచ్చినందుకో తండోపతండాలుగా మరాఠీ దండులు తెలుగుదేశానికి వలస వచ్చినట్లు చరిత్ర చెబుతున్నది.

వివాహాల్లో 'గొంద్లాయి' తీయడమనే ఆచారం మరొకటున్నది. దీన్నికూడ వివాహానికి ముందే వధూవరుల ఇండ్లలో వేరు వేరుగా ఎవరికివారు నిర్వహిస్తారు. వధూవరులకు కట్టించే నూతన వస్త్రాల్ని ఆంజనేయస్వామివారి ఆలయానికి తీసుకవెళ్ళి ధూపదీపారాధనలతో చూపించకరావడం దీని ప్రధానాశయం పెండ్లివారి బంధువర్గం వధూవరుల నూతన వస్త్రాల్ని వెంటతీసుకొని సాయంత్రం బాజా భజంత్రీలతో ఆంజనేయులవారి గుడికి ఊరేగింపుగా వెళతారు. ఇది చూడ ముచ్చటగా ఉంటుంది. వత్తులతో దివిటీలు ముట్టించి, అందరూ తలకొక దివిటీ చేతపట్టుకొని ఆట పాటలతో గంతులు వేసుకుంటూ ఆంజనేయుల వారిని మాటిమాటికి ఆపిస్తూ ఆరె భాషలో ఈ విధంగా పాట పాడుతూ వెళతారు—

"లగాడిలో తుజ గొందాడిలో
అచాడిలో తుజ పిచాడిలో
వీర హమమంతాచ హే గొందళే
నవ్వ నర్సింగాస హే గొందళే
గావ జేటియాస హే గొందళే
దయిత వీరాచ హే గొందళే
లగాడిలో తుజ గొందాడిలో
అయ్ భవానీ అయి గొంద్లాయావో
తుల్జపూరి తుకోబాయి గొంద్లాయావో
సాతియాసరా గొంద్లాయావో
లగాడిలో తుజ గొందాడిలో
అయి గావుదేవీ గొంద్లాయావో
అయి పోచాయీ గొంద్లాయావో
లగాడిలో తుజ గొందాడిలో
అచాడిలో తుజ పిచాడిలో"

అయా పేర్లతో వేరు వేరు దేవుళ్ళను కొలుస్తూ 'గొంద్లాయి'ని స్వీకరించవలసిందిగా ప్రార్థించడం దీనిలోని భావార్థం చివరికి గ్రామదేవత అయిన పోచమ్మను కూడ కొలుస్తారు. ఇందులో వేరు వేరు దేవతలను స్మరించినా ముఖ్యంగా ఆంజనేయులవారినీ, తుల్జాపురీ తుకోబాయినీ కొలువడమే దీని ముఖ్యోద్దేశం. 'గొంద్లాయి' అంటే దేవతలకు జరిపించే 'కొలువు' అనే అర్థంలో ఇక్కడ వాడబడుతున్నది 'గొంద్లాయ్' అంటే మహారాష్ట్రంలో ఒకానొక భజన విశేషంగా అర్థం చెప్పబడుతున్నది. 'గొందిలి' అంటే ఒకానొక కుండలాకార నృత్యవిశేషంగా తెలుగు నిఘంటువులు అర్థం చెబుతున్నాయి, ఆరెవాళ్ళను ఆశ్రయించి కథలు చెప్పి బతికేవాళ్ళను 'గొంద్లీలు' అంటారు. వీళ్ళు ఆటపాటలలో భజనలు చేస్తూ భవానీమాతను ఆరాధించడానికే నియమింపబడినట్లు ఒక కథ ప్రచారంలో ఉన్నది అందుకే వీళ్ళను 'గొంద్లీలు' లేక 'గొంధళీలు' అని పిలవడం జరుగుతున్నదట. అంతేకాక ఈ పదాలన్నీ ఒకే కుదురులోంచి పుట్టినట్లు కూడ మనం గమనించవచ్చు. మహారాష్ట్రంలో మొదటినుంచీ భక్తి మార్గానికే ఎక్కువ ప్రాముఖ్యం ఉన్నందున భజన రూపంలో ఉన్న ఈ గొంద్లాయికి ఎక్కువ ప్రాశస్త్యం వచ్చి ఉండవచ్చు.

వివాహాల్లో లగ్నం జరిగిన పిదప నాకబలిని కేవలం స్త్రీలే పాటలు పాడుతూ జరిపిస్తారు. పురోహితులు మంత్రోక్తంగా నాకబలిని నిర్వహించే ఆచారం లేదు స్త్రీలే కొన్ని గంటల తరబడి ఆరె భాషలో పాటలు పాడుతూ ఈ నాకబలి తంతును నిర్వహిస్తారు. ఇది ముగిసిన వెంటనే వరుడు ఎడ్ల మెడకు కట్టే బేరెడు జోళ్ళు పగ్గాలూ భుజంపై వేసుకొని వధువును వెంటనిడుకొని జొన్న విత్తనాలు చల్లుకుంటూ భవానీమాతను ప్రతిష్ఠించిన చోటుకు వెళ్ళి అమ్మవారికి నమస్కరిస్తాడు. ఆరెభాషలో నాకబలి పాటను 'సడాచగీతు' అంటారు. ఈ సందర్భంగా స్త్రీలు పాడే పాట ఈ విధంగా ఉంటుంది.

"అచ్చా దివను సోనాచ బాయీ సోనాచ
పావూసు పడతే మోతాచ
గుజుగుజు పంకారే
మావేరీచ వాటా
అంబియాచ బానూ
సావులీల బసాత
మాయల సంగీత
అచ్చా దివసు సోనాచ బాయ సోనాచ
మరశాంతు జల్మాన
పుడే శంబరు బియాల
కాలే రేగడీచ వాటూ
కారూను జోడూ సప్తాచ కాంప్రస
ధావోరే దోన్ దానే
బీకాస్తు కరూను

మోడాల లవుతవు డోలాల జోజూ
పీకాల అమ్రావటీ హజ్జారూ ఖండాచ
అచ్చా దివసు సోనాచ బాయీ సోచాచ''

అంటే—

నేటి దినం చక్కని బంగారు రోజు
ముత్యాలవర్షం కురుస్తుండగా
తల్లిగారి ఊరి మార్గంలో
పక్షుల కిలకిలారావాలతో నిండిన
మామిడితోటలో అక్కడక్కడా కూర్చుంటూ
ఈ చక్కని బంగారు రోజు
తల్లిగారితో చెప్పి బయలుదేరాలి
మరాఠీ వంశంలో జన్మించినందులకు
నూరు ఎడ్లను ముందు వరుసలో నడుపుకుంటూ
అందమైన బేరెడుజోళ్ళు ధరించి
నల్లని రేగడి భూమి గుండా దారి నడుస్తూ
పన్నెండు విత్తనపు గింజలు చల్లి
వేయి పుట్ల ధాన్యం పండించాలి.''

ఇక్కడ ఆరెవాళ్ళకు ముఖ్యమైన వ్యవసాయిక వృత్తి లక్షణం వర్ణింపబడింది. మహారాష్ట్ర ప్రాంతంలో ఎక్కువ భాగం నల్ల రేగడి ఉండడం గమనార్హం.

పిల్లల్ని తొట్టెలో వేసి నిద్రబుచ్చుతూ పాడే పాటలు కూడ కొన్ని వ్యాప్తిలో ఉన్నాయి. వీటిని నామకరణ మహోత్సవ సందర్భంలోనూ పాడడం ఆచారంగా ఉన్నది. వీటిని ఆరె బాసలో 'జోగాలా సగీతు' అంటారు. అందులో ఒక పాట ఈ విధంగా వుంటుంది

''జోజో జోజో జో బాలా
జో చిమ్మ కృష్ణా
వాసుదేవాచ పుత్రా
ఝోంపి జవావో జోజో
జోజో మనూసూ
హలవితే యశోద
బాలారె గోవిందా
దీష్టు ఝూలయా తులా — జోజో॥
అంగీ టోపీ తులాచు బాలా
టోపీల పింపలు పానయా బాలా — జోజో॥
దండచ దండ బాపటి బాలా
హాతాల ఏల లావూను తూల — జోజో॥
మాజాల గోపీ కర్దోల బాల
పాయాలా పాయంజన తూల — జోజో॥
చాందా సూర్యాచకళ సీరాల బాల
హతాతు సుదాము చక్కర్ తుల — జోజో॥
బొంబీల బారా హీరాయ బాల
పాటిమాగే పాంచు బాణ తూల — జోజో॥
జోజో బాలా జో చిమ్మి కృష్ణా
వాసుదేవచ పుత్ర ఝోంపి జవావ్ — జోజో॥
జోజో మానూసు హలవితే యశోద
బాలారే గోవింద
దీష్టు ఝూలయ తూల — జోజో॥
కారె కారే బాల ఝోంపి నాహీ తూల
కవులాస సావులీ పద్దయా తూల — జోజో॥

అంటే—

''జో జో జో ఓ బాల కృష్ణుడా!
ఓ చిన్ని కృష్ణుడా
వసుదేవుని పుత్రుడా నిదురించవయ్యా
జోజో అంటూ నిన్ను తొట్టెలో వేసి
యశోద ఊపుతున్నది
ఓ బాలుడవైన గోవిందుడా!
నీకు దృష్టి తగిలిందేమో!
నిదురించడం లేదు
నీకు చొక్కా కుల్లా తొడిగించినారు
టోపీపై నెమలి పింఛం వలె
అందంగా రావియాకు చెక్కినారు
చేతికి కడియాలు తొడిగి
నడుముకు మొల్నత్రాడు కట్టినారు
కాళ్ళకు ఘల్లు ఘల్లుమని మ్రోగే
మంజీరాలు కట్టినారు
సూర్యచంద్రులను మించిన కళతో
నీవు విరాజిల్లుతున్నావు
చేతితో చక్రం ధరించి
వెనుక వీపుపై పంచాయుధములు ధరించి
వసుదేవుని పుత్రుడవైన ఓ బాలకృష్ణుడా!
ఓ చిన్ని బాలుడా! నీవు నిదురపో
యశోదాదేవి నీకు ఊయల ఊపుతున్నది
ఐనా నీవు నిదురించడం లేదు
ఓ బాలకృష్ణుడా! నీకు దృష్టి తగిలిందేమో!
ఎందుకు కృష్ణా! నీవు నిదురించడంలేదు
నీ మీద కాకినీడ పడిందా ఏమి?
అట్లా ఏడుస్తున్నావు ఎందుకు కృష్ణా?
ఏడుపు మాని నిదురపో కృష్ణా.''

ఇట్లా తమ కన్నపిల్లల్ని సర్వాలంకార శోభితుడైన కృష్ణునితో పోలుస్తూ ఊయలలో వేసి జోలపాట పాడుతుంటారు ఆరె మాతృమూర్తులు.

వివాహాది శుభకార్యాల్లో ఇంటి ఆడబిడ్డలు ఉత్సవానంతరం మంగళహారతి పట్టి పాటలు పాడడం ఆచారంగా వస్తున్నది. ప్రార్థనాపూర్వకంగా భవానీమాతను స్తుతించడం ఈ పాటల్లో ఉండే ప్రత్యేకత సందర్భాన్ని బట్టి పాడడానికి అనువుగా ఈ పాటలు కూడ అనేకంగా ఉన్నాయి. ఆరె భాషలో దీన్ని 'భవానీచ ఆరతి' అంటారు. ఒకపాట ఈ విధంగా ఉంటుంది.

''ఆరతి మాయీ అంబా భవానీ పావనీ
భరూల ఆరతి నివాళి తులాచు
అనసుటు పుల తుల పూజాలా — ఆర॥
ఆరతి ఘేవావో తూజా
అమాల దయా వవావో
ధరణీ మాలాచ రాణీ అంబా భవానీ — ఆర॥
హలది కుంకూతు అవతారు ఉచులూను
పరళు రామాల కడాల ఘేవూను — ఆర॥
జలజలాటు జలకూన రహిలీసు
మరాఠీవంశు ఉతుపత్తి కరాయీచి — ఆర॥
ఉక్షలవనీ అంబా భవానీ
తుల్జాపురాతు అవుతారు ఉచులూను
ధరణీ ఉపేందర్‌ల పావంత ఝూలీసు — ఆర॥

అంటే—

"ఓ భవానీదేవి
నీకు నిండు మంగళహారతి
నివాళిగా సమర్పిస్తున్నాము
పూజకై ఇతరులు ముట్టని పూలు
నీకు సమర్పిస్తున్నాము
మా హారతిని స్వీకరించి
మమ్ము దయతో కాపాడుమమ్మా భవానీ!
ఓ అంబా భవానీ!
నీవు భూమాతకు ముద్దుబిడ్డవు
పసుపు కుంకుమల్లో నీవు అవతారం ఎత్తినావు
పరశురామున్ని చంకలో కెత్తుకున్నా
మరాఠీ వంశం దినదినాభివృద్ధిగా
వర్ధిల్లునట్లు దీవించి రక్షించాలి
తుల్జాపురంలో వేంచేసి వున్న
ఓ భవానీ దేవీ!
నీకు భక్తుడైన ఉపేందర్‌ను
నీవు సదా రక్షించాలి."

ఇట్లా ఏ శుభకార్యమైనా మంగళహారతితో ముగుస్తుంది. వీటిలో భవానీమాతను స్తుతిస్తూ ఆమె అనుగ్రహాన్ని కోరడం తప్పకుండా ఉంటుంది. తుల్జాపూర్‌లో వేంచేసి వున్న అమ్మవారిని కొలువడం ఆరెవాళ్ళలో కనిపించే ప్రత్యేకత.

ఆరెవాళ్ళ సాంఘిక జీవితాన్ని ప్రదర్శించే జానపదగీతాలు ఇంకా ఎన్నో వ్యాప్తిలో వున్నాయి. ఐతే పెండ్లి పాటలూ, కౌటుంబిక గీతాలూ, బాంధవ్య గీతాలూ వంటివి మాత్రమే ఎక్కువ ప్రచలితంగా ఉన్నాయి. వీళ్ళకు వ్యవసాయం ముఖ్యవృత్తి అయినప్పటికీ వ్యావసాయిక, శ్రామికగీతాలు వ్యాప్తిలో లేక పోవడం గమనించదగిన అంశం. ఇంటి వ్యవహారాలకే పరిమితమైన స్త్రీల దంపుడు పాటలు, విసుర్రాయి పాటలు మాత్రమే కొన్ని లభిస్తున్నాయి. ఇల్లు దాటితే తెలుగులోనే వ్యవహారం చేయవలసి రావడంవల్ల వ్యావసాయిక గీతాలు కానీ, శ్రామిక గీతాలు కానీ పుట్టి ఉండలేదని ఊహించవచ్చు.

ఈ విధంగా ఆరె భాషలోని జానపదగీతాలు ఆంధ్ర మహారాష్ట్ర సంస్కృతుల మేలి కలయికనూ తద్వారా సాంస్కృతిక సమైక్యతనూ ప్రదర్శిస్తున్నాయి. బహువర్ణ సముచ్చయంగా భాసించే హరివిల్లువోలె భిన్నత్వంలోని ఏకాత్మతను చాటుతూ భారతీయతను ప్రదీప్తం చేస్తున్నాయి. జాతీయ జీవన స్రవంతిలో పరుగులెత్తే తరంగ మాలికల్లా ఇవి దేశానికి శోభను చేకూరుస్తున్నాయి.



# కలికలికి

మ॥ ఒకపర్యాయము పాలమూరుకు వివాహోత్సాహినై యేగి; కౌ
తుక మొప్పారెడు హంసయానమున చేతోమోదమున్ గూర్చుచున్
ఒకవంకన్ మధురాస్పదంబులగు హాస్యోక్తుల్ హృదిన్ జల్లు బా
లికలన్ సుందర మందహాసయుతులన్ బ్రేమారగాన్ గాంచితిన్.

చ॥ పయనము చేసినందులకొ పాపము దేహము ధూళి ధూసర
మ్మయి యటఁ జూచు వారికి బ్రియంబిడదయ్యెను, కన్నుదోయి కెం
పయి దనరారె కుంకుమ క్రమత్వము దప్పెనికేమి జెప్పుదున్
భయమొనరింపఁజేసె గొనివచ్చిన బస్సు మహత్వ మెంచగన్.

కం॥ స్వేదాంబువులను దేహము
చీదర యనిపింప వేగ శృంగారము గా
నా దొరసానులు కదలిరి
సాదరముగ జలకమాడ స్నానపు గదికిన్.

ఉ॥ బంగరు మేని చాయఁగల భామలు చక్కని బాతురూములో
బెంగున హారముల్ దిగిచి చీరలు తల్పులపైని వైచియున్
రింగున స్నానమాడి పలురీతుల మోముల సోనలుఁబూసి; సొ
రంగ విలోచనల్ చనిరి లాస్య విలాసము లొల్కుచుండగన్.

గీ॥ ఇంతలో నేను పనిమీద నెటకొ వెడలి
వచ్చి గంటిని బాత్రూమ్‌న వస్త్రమొకటి
కొంగువలె రమ్యమైనట్టి రంగుగలిగి
తల్పు పైనుండి వ్రేలాడె తళుక్కుమనుచు.

చ॥ ఎవతియొగాని మా యువతి ఈశ్వరనేత్రమహోగ్ర వహ్నిలో
హవనము సేయగా బడిన యా మకరధ్వజు పుష్పబాణమున్
హవమొనరింప జాల ప్రియురాలు ఇలే జవరాలుగావలెన్
కువకువలాడె నామనము కోమలిఁజూడగ నప్పుడచ్చటన్.

గీ॥ తలుపు సందున నుండి యా కలికిఁజూడ
నందమగు కొప్పు మిగుల పసందుగాను
బరగ కనుపట్టె గుండె కవాతుఁజేయ
పొంచియుంటిని బయటనే పొలతిఁజూడ.

గీ॥ తలుపు చప్పుడువిని మది తరుణిఁగూర్చి
పరితపించెను చిత్తమపారముగను
అందమో చందమోగాని యచట నిల్వ
భయమునందుచు దేహమ్ము వడకసాగె.

గీ॥ చేష్టలే దక్కె నాశ్రమ వేష్టుగాగ
యువతిగాకుండ కన్పడె యువకుడొకడు
కొప్పువలెదోచినది గొప్ప హిప్పిగాగ
కొంగుకాకుండ రంగుల లుంగియయ్యె

గీ॥ ఔర! కలికాల మహిమ నేమనగవచ్చు
ప్రకృతి పురుషులరూపమ్ము భిన్నమయ్యె
మాన మవమానమంద యా స్థానమందు
నిలువ నిచ్చను గోల్పోవ తొలగిపోతి

శ్రీ మద్దూరి రామమూర్తి

చిన్న నవలల పోటీలో రెండవ బహుమతి రు. 2,000/-లు పొందిన నవల

# యాత్ర

బులుసు వేంకటేశ్వర్లు

**వర్షం వస్తే ఆ గుడిసెల చుట్టూ నీరు!! కొన్నిచోట్ల మోకాళ్ళదాకా- మరికొన్నిచోట్ల తొడల దాకా! లోతు అయిన పల్లపుచోట్లో-నీళ్ళల్లో నిలబడి తపస్సు చేస్తున్న ఋషుల్లా ఉంటాయ్ ఆ గుడిసెలు!!**

రయ్యని వీచిన గాలికి దీపం ఆరి పోయింది॥ గాయత్రి గుడ్డి దీపం వెలిగించ డానికి లేచింది॥ అగ్గిపెట్లో వున్న నాలుగు పుల్లల్లోనూ రెండుపుల్లలు అస్సలు వెలగలేదు॥ మరో పుల్లకి మందు లేదు॥



తడకని తోసుకుని లోపలి కొస్తున్న ఈదురు గాలికి - చేతులడ్డం పెట్టి ఎలాగో దీపం వెలిగించింది గాయత్రి!! ఈ కుతంత్రాల....కుత్సితాల....కుహనా నాగరికతల....కుళ్ళు మానవ మృగాల మధ్యకి అవతరించిన పసివాడు - పుట్టి నెల్లోజులు కూడా కాని వాడు - చాపలో చలికి ముడుచుకు పడుకున్నాడు!!

ఏ పురానుభవిత మధు స్వప్న శకలాల స్మృతులకో - వాడిలో వాడు కొంచెం నవ్వుకొంటున్నాడు - నిద్రలోనే!!

గాయత్రి దీపం బుడ్డిని ఆ పసివాడి మొహం దగ్గఱగా పెట్టి వాణ్ని తదేకంగా చూసింది!!

తన రక్తంలో రక్తం - మనస్సులో మనస్సు - జన్మలో జన్మని— కళ్ళతో ఆస్వాదించింది గాయత్రి!

మాతృత్వ మాధుర్యం హఠాదుజ్జృంభితమై గాయత్రిని ఊపేసింది - బైట వర్షంలాగే!

పసివాణ్ణి ఒళ్ళోకి తీసుకుని ముద్దుల్తో ముంచెత్తేసింది!

ఒకటి...,రెండు... పది...పదకొండు.......

వాడులిక్కిపడి కెవ్వుమన్నాడు!

జ్ఞానహీనులవల్ల తన మహా సమాధికి భంగం కలిగిన యోగి - తనదైన దివ్య జగత్తునుండి జర్రున జారి ధూర్త మానవలోకంలో పడ్డట్టు - వ్రాడు పూర్తిగా తెలివిలోకి వచ్చేసి, ఏడుపందుకున్నాడు!

గుడిశ చూరుకింద గోనిసంచీ కప్పుకుని పడుకున్న ముసిల్ది - సత్తెమ్మ - తనలో తాను గొణుక్కుంటూంది "—ఈ పిల్లకి ఇదేం పాడుబుద్ధో. హాయిగా నిద్దరోతున్నోణ్ని నేపేత్తాది! నిద్దర్లో ముద్దులాడకూడదే - పిల్లదానా!" అని ఎన్ని సార్లు సెప్పినా యినదు కదా!"



ఏడుస్తున్న చంటాణ్ని నెమ్మదిగా చిమ్పకొడుతోంది గాయత్రి. నిద్దర్లో... ముద్దులు!

ఈ రెండు మాటలూ గాయత్రి పదే పదే అనుకొంది!

నిద్రపోతున్న చంటాడు ముద్దు పెడితే ఏడుస్తాడు!

నిద్రపోతున్న కన్నెమనసుని ముద్దుపెట్టి మేల్కొల్పితే ఏడుస్తుందా??

సరిగ్గా ఏడాది క్రితం ...

తన బ్రతుకునే మహా వేగంగా మలుపు తిప్పేసిన ధర్మరాజు జ్ఞాపకం వచ్చాడు గాయత్రికి!

తన వూరూ... ఇల్లూ...అమ్మా నాన్నా... కాలవ....శివాలయం.... .... అన్నీ ఆమె తలపుల్లో గిర్రున తిరగసాగాయ్!

అన్నిటికీ మించి .. ఆ రోజు...రాత్రి!

తాను నిద్రపోతున్నప్పుడు జరిగిన సంఘటన ఎన్నటికీ మరిచిపోలేదు!

తన జీవితంలో అంత బలమైన ముద్ర వేసింది ఆ సంఘటన!

"....ఊళ్ళో బాలాత్రిపురసుందరీ కళ్యాణ మహోత్సవాలు జరుగుతున్నాయ్!

ఆ ఉత్సవాలు జరిగే అయిదు రోజులూ... రాత్రిళ్ళు ఏవో ప్రోగ్రాములు జరుగుతూనే ఉంటాయ్!

అమ్మవారి కళ్యాణం మాత్రం నరసింహ శైనులు ఆధ్వర్యంలోనే జరుగుతుంది!

నరసింహచయనులు వేదం ఎనభై పన్నాలూ చదువుకొన్న ఘనాపాఠీ!

కానీ, మహా ముక్కోపి!

తన పిల్లలకి మహాభక్తిగా...గాయత్రి, అపర్ణ, విష్ణు, అంటూ పవిత్రమైన పేర్లు పెట్టినా. నరసింహ శైనులూ ఏనాడూ పిల్లల్ని నోరారా పేరెట్టి పిలవడు!

పెద్ద వెధవ - చిన్న వెధవ - బుల్లి వెధవ...అంటూ పిలుస్తాడు!

గాయత్రికి తండ్రి మాటలు విన్నప్పుడల్లా "ఈయనసలు వేదపండితుడేనా?" అని అనుమానం వస్తుంది!

ఊళ్లో ఆవేళ వీధి సిన్మా వేస్తున్నారు!

గాయత్రి చిన్నప్పుడైతే ఎక్కువగా హరికథలు ఉండేవి! రాను రాను ఈ వీధి సిన్మాలు వచ్చి . గ్రామంలో అంతకుముందు ప్రదర్శింపబడే అన్ని ఉదాత్త కళారూపాల్ని వెనక్కి నెట్టేసాయ్!

చయనులు అన్నపూర్ణమ్మా సిన్మా చూడ్డానికి వెళ్ళారు! అపర్ణ దొడ్లో నిద్రపోతోంది!

ఇంక చయనులు ఏకైక మగ సంతానం విష్ణు! ఊళ్ళో ఏం హడావిడి వచ్చినా ఇంటికే రాడు!

కొన్నాళ్ళు తండ్రి దగ్గర వేదం చదువుతాడు .. మరికొన్నాళ్ళు బడికి పోతూ వుంటాడు!

ఆవేళ గాయత్రికి కొంచెం తల నెప్పిగా ఉంది ఇంట్లోనే ఉండిపోయింది.

ఈ మధ్య గాయత్రి మనస్సు మరీ అస్థిమితంగా ఉంటోంది!

నెల్లోజుల్నుంచీ ఇంట్లో అన్నపూర్ణమ్మా .. చయనులూ గాయత్రికి తీసుకువచ్చిన సంబంధం గురించి రోజూ గొడవ పడుతూనే ఉన్నారు!

తన కూతురికి ఆ సంబంధమే చేస్తానంటాడు చయనులు! "నా కంఠంలో ప్రాణం ఉండగా ఆ సంబంధం జరగడానికి వీల్లేదు—" అంటుంది అన్నపూర్ణమ్మ!

గాయత్రి మాత్రం ఈ గొడవ చూసి బిత్తరపోయి... మతిపోయినదాన్లా.... .

నోరు మెదపకుండా ఉంటోంది!

చయనులు ఆ మధ్య వేద సభలికి వెళ్ళొచ్చిన దగ్గర్నించీ ఈ నిప్పు రాజుకొంది ఇంట్లో!

తెనాల్లో ఆయనకో సంబంధం తెలిసింది.

పెళ్ళికొడుకు పేరు చక్రధరరావ్! వెనకాల ఎవరూ లేరు ఒక్క ముసలి తల్లి తప్ప! పదెకరాల మాగాణీ, ఇల్లూ ఉన్నాయ్!

చయనులు అన్ని వివరాలు చెప్పగా వింది అన్నపూర్ణమ్మ. కాస్త ఆలోచిస్తే ఆ పెళ్ళి కొడుకు తల్లి ఆవిడికి చుట్టమే! కొంచెం దూరం చుట్టం.

మరుక్షణంలో అన్నపూర్ణమ్మ మొహం మాడిపోయింది!

ఆ చక్రధరరావ్‌కి ఇంతకుముందే ఓ పెళ్ళైంది.

అతనూ, తల్లీ కలిసి ఆ పిల్లని వేధించి...చివరకు ఆత్మహత్య చేసుకునేలా చేసారని అన్నపూర్ణమ్మ చెప్పింది.

ఈ మాట విని కూడా చయనులు నిబ్బరంగానే ఉన్నాడు.

"అదేంకాదు! ఆ పిల్ల ఒక శంఖినీ....పొగరుగొడ్డు...అత్తారి సొమ్మంతా పుట్టింటికి చేరేసేదట! ఏమైనా అంటే నూతిలో దూకేస్తానని బెదిరించేదట! ఓసారి తల్లీ కొడుకూ కనబడకుండా పోయిన బంగారం గొలుసు గురించి నిలదీసేసరికి ఆ పిల్ల నూతిలో దూకి ప్రాణం తీసుకుంది"—అన్నాడు తేలిగ్గా చయనులు!

"నేను బతికుండగా గాయత్రిని ఆ చక్రంగాడికిచ్చి పెళ్ళి చెయ్యడానికి 'ఒప్పుకోను"

"అయితే - నువ్ కూడా నుయ్యో, గొయ్యో చూసుకో!" అంటూ విసురుగా అక్కణ్నుంచి లేచిపోయాడు చయనులు.

ఆ రోజు మొదలు....చైనులూ, అన్నపూర్ణమ్మా ఈ సంబంధం గురించి గొడవ పడుతూనే వున్నారు.

చైనులు మహా మూర్ఖత్వం గల మనిషి!

"అమ్మాయిని చూసుకోడానికి రండి" అంటూ ఓ ఉత్తరం రాసిపడేసాడు తెనాలికి!

అన్నపూర్ణమ్మ ఒకటే గోల!

గాయత్రికి చాలా భయం వేసింది.

ఆ పెళ్ళికొడుకూ - తల్లీ ఎల్లాంటివాళ్లో దేవుడికి తెలియాలి.

ఏమైనా పెళ్ళికి ముందు కాబోయే భర్త గురించి అత్తగారి గురించి భయంకరమైన అల్లాంటి కబుర్లు తెలిశాక - ఏ కన్నెపిల్ల మనస్సు మందారాలు పూస్తుంది! మధురోహలు విరజిమ్ముతుంది

మొహానికి పసుపు రాసి - మెళ్ళో వేపమండలు కట్టి... బలికి సిద్ధం చేసిన మేకపిల్లకి... తనకి జరగబోయే ఘోరం గురించి తెలిస్తే....తెలుసుకొనే జ్ఞానం దానికి ఉంటే... ఆ మేకపిల్ల మనస్సు ఎల్లా వుంటుందో అప్పుడు గాయత్రి మనస్సు అల్లాగే వుంది!

విచిత్రం...చయనులు ఒక్కసారంటే ఒక్కసారి...ఆ సంబంధం గురించి గాయత్రికి ఒక్కమాట కూడా చెప్పలేదు.

అన్నపూర్ణమ్మ మాత్రం..."నాకా సంబంధం ఇష్టం లేద"ని గట్టిగా చెప్పమని ఏడుస్తుంది.

"కసాయివాళ్ళకి కట్టబెడుతుంటే నోరు విప్పి వద్దని చెప్పవేమే!" అని ఒకటే ఏడుపు!

గాయత్రి ఏం చెప్తుంది? అసలు తండ్రి తన మాట వింటాడా??

ముప్పైఏళ్ళ పైగా తన కష్ట సుఖాలు పంచుకొన్న మనిషి మాట తలకెక్కించుకోని మనిషితో...ఏం చెప్పి ఏం లాభం?...

మరో పది రోజులు గడిచాయ్!

తెనాలినుండి కార్డు వచ్చింది.

పెళ్ళికొడుకు తల్లి రాయించిన ఉత్తరం అది.

"వచ్చే నెల్లో ఏదో మంచిరోజు చూసుకుని - పిల్లని చూసుకోడానికి వస్తామనీ - పిల్ల నచ్చితే, మిగిలిన సంగతులు మాట్లాడుకొందామనీ-రాశారు.

ఈ దేశంలో మగాడికి ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకొన్నా....స్వతంత్ర నిర్ణయం- కట్నం కానుకలూ అన్నీ అమరుతాయ్.

చాలామంది ఆడపిల్లలకి...తొలిసారిగా తన జీవిత సహచరుణ్ని నిర్ణయించుకొనే అవకాశమే లేదు.

తనని చూసి ఏ పెళ్ళి కొడుకు బుర్రూపితే వాడే భర్త ఆ ఆడపిల్లకి.

ఆ ఉత్తరం వచ్చిన దగ్గర్నించీ గాయత్రికి భయం వేయసాగింది

"ఆ తెనాలివాళ్ళకి తాను నచ్చితే....కొద్దో గొప్పో తండ్రి ఇచ్చే కట్న కానుకలు నచ్చితే....తాను చక్రధరరావ్ ఇల్లాలు కాక తప్పదు"

అమ్మ నిరాహారదీక్ష చేసి చచ్చిపోయినా ...తనకి ఆ సంబంధం చేయక మానడు నాన్న....

ఊళ్ళో కళ్యాణోత్సవాల హడావిడిలో మునిగిపోయాడు చైనులు.

అన్నపూర్ణమ్మ ఇరుగు పొరుగు ఆడవాళ్ళతో కలిసి వీధి సిన్మా చూడ్డానికి బైలుదేరింది.

"వస్తావేమే! 'నర్తనశాల' సినిమా వేస్తున్నారట?" వెళ్ళేముందు గాయత్రిని అడిగింది అన్నపూర్ణమ్మ.

"నువ్ వెళ్ళమ్మా! నాకు తలపోటుగా ఉంది" అంది గాయత్రి.

"తలుపులు వేసుకో అయితే! విష్ణు వస్తే అన్నం పెట్టుకు తినమను-" అంటూ వెళ్ళిందామె.

దీపం చిన్నది చేసి పడుకొంది గాయత్రి.

ఎవరు? ఎవరు? తనని రక్షించేవాళ్ళు??

ఆ ధనదాహపు రాక్షసి కోరల్లో తన బతుకు తెల్లారవల్సిందేనా? ఏవేవో....తన భవిష్యజ్జీవితానికి సంబంధించిన ఆలోచనలు తేనెటీగల్లా ఆమెని భయపెట్టసాగాయ్!

చాలాసేపు అలా చూస్తూ పడుకొంది గాయత్రి.

గుళ్లోంచి పాటలు వినబడ్డంలేదు. సినిమా మొదలుపెట్టి వుంటారు.

కళ్ళు మండుతుంటే — నిద్రకి ఉపక్రమించింది గాయత్రి.

నిద్రలో...ఆ మగత నిద్రలో....

నందనారామ అమృతకాసారంలోంచి, సుతారంగా, విరిసిన శతపత్రాన్ని చేతుల్లోకి తీసుకుని...ఒక్కొక్క రేకును...రేకులోని జీవమాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నట్టు ... ...ఆఘ్రాణిస్తున్నట్టు...

సన్నగా...వెచ్చగా... తన బుగ్గలపై ఎవరో ముద్దు పెడుతున్నట్టు అన్పించింది గాయత్రికి.

కావ్యధ్వనిలా మధురమైన పెదిమల చప్పుడు.

అనిర్వచనీయం .... ఆపాతమధురం అయి...గాయత్రిని .. నిలువునా అమృతంపు నిడుబావిలో ముంచినట్లైంది ఆ స్పర్శ.

సుషుప్తిపైనుంచి .... స్వప్నానికి ... స్వప్నభూముల పొలిమేరల్లోంచి జాగ్రదవస్థకి వచ్చిన చైతన్యం....గాయత్రి కనురెప్పల్ని తట్టి లేపింది మంద్రంగా.

ఎవరు???

గాయత్రి పరీక్షగా చూసింది.

తన ముఖంపై ముఖం పెట్టి....చిరకాలపు స్నేహనిధుల్ని వెదుక్కుంటున్నట్టు—

ఆశగా....

ఆర్ద్రంగా...

ప్రణయోద్వేగంగా....రాగంగా....ఉన్న ఆ కళ్ళు ఎవరివి??

"ధ . ర్మ ...రాజు!"

గాయత్రిలో కోపావేశం జుట్టు విరగబోసుకుని నర్తించింది కాళికలా.... పైకెగసింది లావాలా.

ఓ మహా సముద్ర తరంగం...ఒక ఉప్పెన...ఒక గాలివానలా... నిగ్రహించుకోలేని కోపంతో ...

ధర్మరాజు చెంప "ఛెళ్"మనిపించింది గాయత్రి.

ధర్మరాజుకి ఆ దెబ్బ ఎంత గట్టిగా తగిలి ఉంటుందో - కొట్టిన గాయత్రి అరచెయ్యే పది నిముషాలదాకా చురచురలాడుతూనే ఉంది.

ధర్మరాజు....అవాక్కైపోయాడు.

ఒక్కక్షణం....తలొంచుకొని నిలబడ్డాడు.

వెనక్కి తిరిగి తలుపు దగ్గిరగా వేసి వెళ్ళిపోతూ అతడన్న మాట గాయత్రికి లీలగా విన్పించింది.

"క్షమిం...చు"

గాయత్రికి ఎందుకో ఎంత ఆపుకుందామనుకున్నా ఏడుపు ఆగలేదు.

నిలబడ్డది నిలబడ్డట్టే మంచంమీద పడి ఏడ్చింది.

మనస్సులో అన్నీ సందేహాలే!

అసలు ఇంత....రాత్రివేళ ధర్మరాజు ఇక్కడికెందు కొచ్చినట్టు?

ఏనాడూ..తన గొడవేంటో .... తన లోకవేంటో... తప్ప...మరో గొడవ తెలియని... ధర్మరాజు ... ఈ రోజు... ఎంత .. తెగింపుగా ఇంట్లో కొచ్చాడు?

ఈ విషయం...అమ్మా నాన్నలతో ...చెప్పాలా? వద్దా?

ఇప్పటికే నాన్నకీ అమ్మకీ జరుగుతున్న ఘర్షణ మూలంగా... ఇంటి విషయాలన్నీ ఊళ్ళోకెక్కాయ్.

ఈ సంగతి... చెపితే నమ్ముతారా?

ఇంకా ఏదో జరిగే వుంటుందని ఊరంతా గోల చెయ్యరూ? గాయత్రి తన నిస్సహాయత్వం తల్చుకుని ఏడ్చింది.

ధర్మరాజు బి.యే. చదివాడు. ఊళ్లో బుద్ధిమంతుడనే పేరుంది. ధర్మరాజు తండ్రి సత్యమూర్తిగారు వ్యాపారంలో బాగా ఆర్జించాడు.

జైనులు పొరుగు ఇల్లే సత్యమూర్తిగారిది.

వీధి సిన్మా అయిపోయింది.

జనం రోడ్డుమీద పోతూ గట్టిగా మాట్లాడుకొంటున్నారు.

టైమెంతయ్యిందో??

గడియారం చూసింది గాయత్రి

ఒంటిగంట!

## 2

మర్నాడు మధ్యాహ్నం!

దొడ్లో బట్టలారేస్తుంటే గోడ పక్కనుండి కాగితం ఉండ వచ్చి గాయత్రి భుజానికి తగిలింది.

గాయత్రి దాన్ని తీసుకుని విప్పింది.

ధర్మరాజు రాసిన ఉత్తరం అది.

గాయత్రి కళ్ళు అటూ ఇటూ చూసాయ్.

ధర్మరాజు గోడమీంచి నిక్కి నిక్కి చూస్తున్నాడు.

"షతెయ్యకు. దయచేసి చదువు-" అంటున్నట్టు సౌంజ్ఞ చేసాడు ధర్మరాజు.

ఏమిటీ ఇతసి తెంపరితనం?

గాయత్రికి ఒళ్ళు మండిపోయింది.

ఆ కాగితాన్ని పరపరా చింపి పడేద్దామనుకుంది – కానీ, ఏదో అదృశ్య శక్తి ఆమెని ఆ పని చెయ్యనివ్వలేదు.

కాగితాన్ని జాకెట్లో దాచి ఇంట్లోకి నడిచింది.

అన్నపూర్ణమ్మా, జైనులూ సావిట్లో కునుకు తీస్తున్నారు.

గాయత్రి గదిలోకి వెళ్ళి తలుపులు మూసి ఉత్తరం తెరిచింది.

"గాయత్రీ!

నిన్న ఆవేశంలో నేను చేసిన పని తప్పే!

నా జీవిత సమస్య ఒకటి నీతో మాట్లాడాలి. సాయంత్రం ఆరు గంటలకి నువ్ కాలవ దగ్గరికి రాకపోతే - ఈ ధర్మరాజు రేపటికి బతకడు. నిష్కారణంగా, నీ కారణంగా చచ్చిపోతాడు.

తర్వాత నీ యిష్టం!

"ధర్మరాజు"

గాయత్రికి అయోమయంగా వుంది.

ఉత్తరంలో తనని కాలవ దగ్గరికి రమ్మని ఆదేశించాడో – అభ్యర్థించాడో అర్థం కాలేదు.

ధర్మరాజుకి ...జీవిత సమస్యా??

అతని జీవిత సమస్య అయితే తనతో మాట్లాడ్డం ఎందుకు? తనేం చెయ్య గలదు?

గాయత్రికి ధర్మరాజు ప్రవర్తన చూస్తే అంతా పోకిరీ వేషంలా అన్పించింది.

"కాలవ దగ్గరికి వెళ్ళనుగాక వెళ్ళను." అనుకొంది గాయత్రి. ఆ ఉత్తరం ఎక్కడ దాచాలి? గాయత్రికి ఎవరూ గమనించని చోటు ఎక్కడా కనిపించలేదు.

బాగా ఆలోచించి ...విష్ణు లెక్కల టెస్టుబుక్‌లో పెట్టింది.

నిశ్చయంగా ఉత్తరం బయటకు రానిచోటు అదే!

గాయత్రి ధర్మరాజు వ్రాసినట్లు కాలవ దగ్గరికి వెళ్ళకూడదనే అనుకొంది కానీ - సాయంత్రం అయ్యేకొద్దీ ఆమెలో ఆరాటం ఎక్కువ కాసాగింది.

"పోనీ ...వెళ్ళి చూస్తాను....ఏం చెప్దామనుకొంటున్నాడో?" అనుకుందామె.

మగాళ్ళు... తమ జీవిత సమస్యలు ఆడవాళ్ళతో చర్చిస్తారనుకోడమే గాయత్రికి వింతగా అన్పించింది



ఇంట్లో తన తండ్రి "ఏం కూరలు తేవాలి?" అని కూడా తల్లిని అడగడం ఆమె వినలేదు.

బజారుకు వెళ్ళి ఆయన కిష్టమైన కూరలేవో అవి తేవడమే.

ఇంక అమ్మతో కుటుంబ సమస్యలు చర్చించడవా?

తన పెళ్ళి సంబంధం గురించిన గొడవలు నెల్రోజుల్నుంచి వింటూనే వుందిగా!

సంజ చీకట్లు ముసురుతుంటే...బిందె తీసుకొని కాలవవైపు నడచింది గాయత్రి.

పుట్టాక ఎన్నిసార్లు తాను కాలవకి వెళ్ళలేదు??

ఎందుకో ఈసారి మాత్రం...అడుగులు తడబడుతున్నాయ్ గాయత్రికి!

ఆరాటం! ఆందోళన!

భయం! సిగ్గు!

తటిల్లతలా అనేక భావాలు మెరిసిపోతున్నాయ్ గాయత్రిలో.

కాలవ దగ్గరైంది.

కాలవలో మెడలోతు నీళ్ళల్లో నిలబడ్డాడు ధర్మరాజు.

ధర్మరాజు మొహం గాయత్రిని చూడగానే కలువపువ్వులా విచ్చుకొంది.

"రా! రా! రేపు నాకు చావు తప్పదేమోనని అనుకొంటున్నాను ఇంత వరకూ." అన్నాడు ధర్మరాజు.

"చచ్చిపోవాల్సిన కర్మ ఏం వచ్చింది?" గాయత్రి అంది.

"అలా నిలబడి మాట్లాడకు. కూర్చో! బిందె తోముకుంటూ విను. నా సమస్య చెప్పుకొంటాను."

గాయత్రి తన పాదాలకి నీళ్ళు తగిలీ తగలకుండా ఉండేలా గట్టు అంచున కూర్చుంది.

"గాయత్రీ! నిన్న మీ నాన్నగారికోసం మీ ఇంటికి వచ్చాను. తలుపు తోయగానే మంచంమీద నిద్రపోతూ నువ్ కన్పించావ్! గుడ్డిదీపం వెలుగు నీ ఒంటిమీద స్పష్టాస్పష్టంగా పడుతుండగా....అజంతా సుందరో, రామప్ప నృత్య కళాకారిణో వందల వేలేళ్ళ నాట్యభంగిమలో నిలబడి అలిసిపోయి....అలా.... నీలా...విశ్రాంతి తీసుకుంటోందేమో ననిపించింది... ఆవేశం పట్టలేక - తప్పని నాకు తెలుసు... కానీ... ఆ మహా సౌందర్యాన్ని చూడనట్టూ...పట్టించుకోనట్టూ చిన్నబిరిచిపోవడం...నాకు చేతకాలేదు"

"ధర్మరాజూ! కాలేజీలో జేరాక ఏవైనా కథలూ, నవల్లూ గిలకడం మొదలెట్టావా?" అడిగింది గాయత్రి.

"అబ్బే! అల్లాంటిదేం లేదే?"

"ఏమోలే! నువ్ మాట్లాడే తీరు చూస్తే అల్లా అన్పించింది. మామూలుగా మాట్లాడు, అర్థం అవుతుంది"

ధర్మరాజు గట్టిగా నవ్వేసాడు.

"ఈ విషయం ఎల్లా చెప్పాలా అని రాత్రంతా రిహార్సిల్స్ వేసుకున్నా. అందుకే మాటలు అలా వస్తున్నాయ్! సరే! మామూలుగానే చెపుతాను. మా నాన్న ఏమీ లేని స్థితిలోంచి పైకి వచ్చాడు. వ్యాపారంలో బాగా ఆర్జించాడు! కానీ ఈ మధ్య ఆయన్ని పట్టుకున్న ధనదాహం చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది- చివరకు ఒక్కగానొక్క కొడుకునైన నా పెళ్ళి విషయం కూడా ఆయనికి ఒక వ్యాపారంలా కన్పిస్తోంది! ఎక్కణ్ణుంచో ఓ సంబంధం తెచ్చాడు. ఆ పిల్ల తల్లి దండ్రులికి ఏకైక సంతానం! లక్షల ఆస్తికి వారసురాలు! ఆ పిల్ల మెళ్లో తాళి కట్టకపోతే నా ప్రాణం తీస్తానంటున్నాడు మా నాన్న!...ఆ పిల్ల...

"ఆ పిల్ల అందంగా లేదా?" అడిగింది గాయత్రి

"ఫొటో చూసాను! బాగానే వుంటుంది!"

"మరేం! లక్షలు పట్టుకొచ్చే అందమైన పిల్ల నీకు నచ్చలేదా?"

ధర్మరాజు జీవితసమస్య ఏవిటో గాయత్రికి అర్థం కావడంలేదు!

ధర్మరాజు ఓ క్షణం ఆగి అన్నాడు - "ఆ పిల్ల మూగిది!"

గాయత్రి ఆశ్చర్యపోయింది! ...

дబ్బు! డబ్బు! డబ్బు!

ఆ డబ్బును చూసే ... మొదటి పెళ్ళాన్ని హతమార్చేసినవాడికి కూతురునిచ్చి కట్టబెట్టబోతున్నాడు తన తండ్రి.

ఆ డబ్బు కోసమే....ధర్మరాజు తండ్రి... తన కొడుక్కి ఓ మూగి పిల్లనిచ్చి మెడలు వంచి మరీ పెళ్ళి చెయ్యబోతున్నాడు.

ఈ డబ్బు .. ఎందరి జీవితాల్ని వేటాడిందో!

ఎందరి ఆశల్ని తుంపేసిందో! ఎందర్ని మృగాలుగా మార్చేస్తోందో!

"గాయత్రీ!

చిన్నతనంనుండీ నా స్వభావం నీకు తెలుసు! ఎవరినన్నా పలకరించాలన్నా భయం! ఎందుకో సంకోచం! కానీ ...ఇప్పుడిప్పుడే నాలో...నా స్వభావంలో ఏదో మార్పు కనిపిస్తోంది! ..ఎవరితోనైనా మాట్లాడాలనీ .. మనసులోని ఊహలన్నీ...వాళ్ళముందు నిర్భయంగా...నిస్సంకోచంగా ...పరచాలనీ అన్పిస్తోంది! సరిగ్గా ఈ క్షణంలోనే నా బతుకు మౌనానికి అంకితమైపోతుందనీ .. నా కాబోయే అర్థాంగి నోరు లేనిదని తెలిసి క్రుంగిపోతున్నా...

జాలిగా ధర్మరాజుకేసి చూసింది గాయత్రి.

ధర్మరాజు చెప్పుకు పోతున్నాడు!

"నీకు ఇష్టం అయితే. ..నేను నిన్ను పెళ్ళి చేసుకొంటాను! అవసరమైతే లోకాన్ని ఎదిరించి...అందరికీ దూరంగా పోయి బతుకుదాం! నా కండల్లో శక్తి ఉన్నంతకాలం...కామ కాదు...నాలో ప్రాణం ఉన్నంతదాకా... నిన్ను దేవతలా చూసుకొంటాను. లేదా ఇంతే!"

బుడుంగున నీళ్ళలో మునిగాడు ధర్మరాజు!

గాయత్రి కంగారుగా కాలవంతా పరికించింది.

ఏమైపోయాడు ధర్మరాజు! నిజంగా మునిగిపోయాడా?

తన పాదాలకు ఏదో తగిలినట్లనిపిస్తే ఉలిక్కిపడి చూసింది కిందకు!

ధర్మరాజు!

గాయత్రి పాదాల్ని ముద్దు పెట్టుకుంటున్నాడు తన్మయత్వంగా!

"గాయత్రీ! ప్లీజ్! ఆలోచించు. నువ్వొప్పుకోకపోతే నిజంగా చచ్చిపోతా!"

గాయత్రి మౌనంగానే వుండిపోయింది.

నీళ్ళబిందె తీసుకుని బుజాన్న పెట్టుకుని గట్టెక్కింది.

ధర్మరాజుతో ఏదో చెప్పాలని ఉంది. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

మాటలు దొరకడంలేదు! అసలు పుట్టిన దగ్గర్నించీ మాటలే లేనిదాన్లా అలా నిలబడిపోయింది.

"ధర్మరాజూ! నువ్ చచ్చిపోవద్దు" అంది గాయత్రి.

గాయత్రి మరేం మాట్లాడకుండా ఇంటికి నడిచింది.

చీకట్లు బాగా అలముకున్నాయ్.

గాయత్రి మనస్సు డోలాయమానంగా ఊగుతోంది.

ధర్మరాజుతో జీవితాన్ని పంచుకుంటే....తన బ్రతుకు ఎలా ఉంటుందో! నిన్నటిదాకా తండ్రిచాటు బిడ్డయిన ఇతడు లోకాన్ని ఎదిరించి నిలబడగలడా...?

ఆలోచించగా ధర్మరాజు మీద కోపం వచ్చింది గాయత్రికి.

...ఎంత తెంపరితనం? జీవితమంటే సినిమా అనుకొన్నాడా? తాను కాదంటే చచ్చిపోతాడుట ...ఛస్తే చావనీ ...ఎవరికోసం ఈ బెదిరింపు?...ఇంచు

మించుగా... అవే మాటలనకపోయినా "లేచిపోదాం పద" అన్నట్లు మాట్లాడాడు.

తానెంత లోకువైంది? లోకువ కాదూ?

తెనాలి సంబంధం గొడవలో అమ్మా నాన్నా వీధిన పడ్డంవల్లే.... తాను లోకువైంది.

ఊళ్ళో ఇంతమంది ఆడపిల్లలుండగా .. తననే ఎందుకు పెళ్ళి చేసుకోవాలనుకున్నాడో ధర్మరాజు... "

ధర్మరాజుమీద కొంచెం జాలివేసింది గాయత్రికి.

...ఉన్న డబ్బు చాలదూ? ఇంకా సంపాదించి ఏం చేసుకొంటాడో, ధర్మరాజు తండ్రి?....కొడుకు ఇష్టాఇష్టాలకన్నా ఆయనికి రూపాయ కట్టలే ప్రియంగా కన్పించాయ్!"

"ఉన్నదున్నట్టుగా చెప్పి...."నేను నిన్ను పెళ్ళి చేసుకొంటాను...." అంటూ నీతిగా ...నిజాయితీగా ఆడపిల్లని అభ్యర్థించే యువకు లెంతమంది వున్నారు ఈనాడు?....ఏమైనా ధర్మరాజు గుణవంతుడే ..." అనుకొంది గాయత్రి.

"ధర్మరాజూ! నువ్ చచ్చిపోవద్దు" అని ఎలా అనగలిగింది తాను? అసలు ధర్మరాజు తనకేమౌతాడు? అతడు చస్తే . నాకేవిటి బాధ...."

"ఆ మాట అనడంతో ..తన అంగీకారం తెలిపినట్లే అయిందా?"

"ఇంత చీకటి పడ్డాక బయల్దేరాలా నీక్కకి?" చయనులు ప్రశ్నకి సమాధానం చెప్పకుండా లోనికి నడిచింది గాయత్రి.

## 3

మధ్యాహ్న సమయం.

పోష్టుమేన్ ఇచ్చిన ఉత్తరం చదువుకుని "ఇంట్లో ఎలా వున్నదాన్ని అలా బైటకి రమ్మని" అన్నపూర్ణమ్మని కేకేసాడు చయనులు.

కారణం తెలియక కంగారు పడుతుంటే - చావుకబురు, చల్లగా చెప్పాడు.

అన్నపూర్ణమ్మ తల్లి ....ముసలావిడ....గుంటూర్లో కన్ను మూసింది.

అన్నపూర్ణమ్మ పెద్దగా ఏడుస్తూ వీధి మెట్లపై కూలబడింది.

క్షణాలమీద గుంటూరు ప్రయాణం అయినారు అన్నపూర్ణమ్మా, చయనులూ అపర్ణను వెంటబెట్టుకుని.

"తమ్ముణ్ణి చూస్తూండు. నాన్నగారు మళ్ళీ రేపో ఎల్లుండో వచ్చేస్తారు-" అంది అన్నపూర్ణమ్మ ముక్కు చీదుకుంటూ!

గాయత్రి తలూపింది.

విష్ణు ఎక్కడికెళ్ళాడో తెలియదు.

చేతి సంచీలో రెండు చీరలు కుక్కుకుని బైల్దేరింది అన్నపూర్ణమ్మ. మరుక్షణంలో ఒంటరిదై పోయింది గాయత్రి.

అమ్మమ్మ శతవృద్ధురాలు ...ముగ్గిన పండు రాలినట్లు రాలిపోయింది.

గాయత్రికి పెద్దగా దుఃఖం రాలేదు కానీ అమ్మమ్మ ఆపేక్షా... అభిమానం గుర్తుకు వచ్చాయ్!

చీకటి పడుతుండగా వచ్చాడు విష్ణు.

గాయత్రికి తమ్ముణ్ని చూడగానే కోపం వచ్చింది.

ఏరా? రాత్రీ పగలూ ఇల్లు పట్టకుండా ఎక్కడ తిరుగుతున్నావ్? నిన్న రాత్రి వెళ్ళేవ్ - ఇంతవరకు ఎక్కడ తగలడ్డావ్?"

"అక్కా! ఇవ్వేళా, రేపూ నన్నెక్కడికెళ్ళావని అడక్కు. మా అభిమాన హీరో వీరేశ్వర్ పిక్చర్ విడుదల! దానిగురించి ఫాంప్లెట్లు కొట్టించడం - హాల్లో పార్టీ చేయడం-అబ్బో! బోల్డు బిజీ! ..."

పల్లెలికూడా ఈ అభిమానసంఘాల పిచ్చి పాకిపోయింది!! ఎప్పుడో విడుదలైన పాతసినిమాలు అవూరు టూరింగ్‌టాకీస్‌లోకి వస్తాయ్!! హైస్కూల్




పిల్లలూ .. కాలేజీచదువులు వెలగబెట్టి సగంలోనే చదువును ఆర్పేసుకున్న ప్రబుద్ధులు అభిమానులపేరిట సినిమా మొదటిరోజున చేసే అల్లరి (?) అంతా ఇంతాకాదు.

జాతిని నడిపించే చిత్తశుద్ధిగల మహానాయకులూ.... వాక్శుద్ధికల మహాకవులూ ఇప్పుడు చెల్లని హీరోలు! డబ్బుకోసం గంతులేసే జీరోలన్నీ యువతరానికి ఆరాధ్యమైనవైనాయ్.

గాయత్రి భారంగా నిట్టూర్చింది.

విష్ణు అడిగాడు "-అవునుగానీ అమ్మావాళ్ళేరే!"

అమ్మమ్మ పోయిందని గుంటూరునుంచి ఉత్తరంవచ్చిందిరా! అంతా బైల్దేరి వెళ్ళారు. నువ్వీ రెండ్రోజులూ ఎక్కడికీ వెళ్ళక ఇంట్లోఉండు. నాకొక్కత్తికీ భయం.-"

విష్ణు ఏం మాట్లాడలేదు.

వంటింట్లోకివెళ్ళి అన్నంపెట్టుకు తినసాగాడు.

అయిదునిముషాల్లో అన్నంతిని బయటకివచ్చాడు విష్ణు.

"వస్తానక్కా! రాత్రి వచ్చేస్తాలే."

వీధిలోకి వెళ్ళిపోయాడు.

"వీణ్ణి బాగుచెయ్యడం బ్రహ్మతరంకాదు." అనుకొంది చిరాగ్గా గాయత్రి

## 4

ఉదయం!

వంటచేస్తోంది గాయత్రి.

"చయనులుగారున్నారాండీ?"

అపరిచిత కంఠం వీధిగుమ్మంలోంచి పలికింది.

గాయత్రి తలుపుతీసి చూసింది.

తెల్లలాల్చీ, పైజామా వేసుకున్న వ్యక్తిచేతిలో సూట్‌కేస్‌తో నిలబడి ఉన్నాడు గుమ్మంలో.

"లేరండి గుంటూరు వెళ్ళారు. రేపో ఎల్లుండో వస్తారు-"

ఆ వచ్చినవ్యక్తి గాయత్రిమొహంలోకి పరీక్షగాచూసాడు. చిరునవ్వుతో లోపలికివచ్చాడు.

గాయత్రి తెల్లబోయింది.

"ఇదేవిటీ మనిషి? తిన్నగా లోపలికొచ్చేస్తున్నాడు-" అనుకుంటూ కుర్చీ చూపెట్టింది.

ఆ ఆగంతకుడు కుర్చీలోకూర్చుంటూ మొదలుపెట్టాడు-

''.. అసలు వచ్చేనెల్లో అమ్మా నేనూ వద్దామనుకుని ఉత్తరంరాసాం! కానీ కొంచెం బిజినెస్ పనిమీద ఇక్కడికి రావల్సివచ్చింది. ఎల్లాగా ఊళ్ళోకి వచ్చాగదా... 'మీ నాన్నగార్ని కలిసిపోదామని.... వచ్చా....''

గాయత్రి గుండెలు గుబగుబలాడాయ్.

''మీరు___'' అర్థోక్తితో ఆగింది గాయత్రి

''ఓ! మర్చిపోయాను. నాపేరు చక్రధర్రావ్ అంటారు. మాది తెనాలి. అసలు మనం మనం బంధువులమే! రాకపోకల్లేక మనం ఒకళ్ళకొకళ్ళు ఈరోజు పరిచయంచేసుకోవల్సిన పరిస్థితివచ్చింది_'' అంటూ పెద్దగా నవ్వాడు చక్రధర్రావ్.

నాన్న .... ఇతనిగురించేనన్నమాట .... అమ్మతో గొడవపడుతూ ఉన్నాడు!.... ఇతనికిచ్చే.... నాకు పెళ్ళిచేద్దామనుకుంటున్నాడు నాన్న. ఈయన గారేకదూ.... మొదటిపెళ్ళాన్ని నూతులోదూకేదాకా వేధించిన వేటగాడు!...''

చక్రధర్రావ్ నవ్వు గాయత్రికి ఎలుగుబంటి దగ్గినట్లు విన్పించింది.

''అన్నట్లు నువ్వే గాయత్రివికదూ!''

గాయత్రి తలూపింది.

చక్రధర్రావ్ ఇంట్లోకి తొంగిచూసాడు.

''ఇంట్లో ఎవరూ లేనట్లుంది – ఎక్కడికెళ్ళారు అందరూ!''

''మా . అమ్మమ్మ .... పోయిందని.... అందరూ మా అమ్మా నాన్నా. చెల్లీ.... గుంటూరు వెళ్ళారు.''

గాయత్రికి మాటలు తడబడసాగాయ్.

గాయత్రి మాటలు వినగానే చక్రధర్రావ్ కళ్ళల్లో ఆనందం తళుక్కుమని మెరిసి అదృశ్యమైంది.

''గాయత్రీ! నీకు తెల్సేఉంటుంది. వచ్చేనెల్లో ఇక్కడికి నిన్ను చూసుకోడానికి నేనూ మా అమ్మా వద్దామనుకుంటున్నాం! అనుకోకుండా నేను... ఇలా.. పెద్దవాళ్ళెవరూ లేనిసమయంలో నిన్ను కలుసుకోడం ఒకరకంగా మంచిదే! ఒకళ్ళ మనసులో భావాలు ... మరొకళ్ళు తెలుసుకోడానికి ... ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకోడానికి...''

''కాఫీతెస్తాను'' గాయత్రి లోపలికి వెళ్ళిపోయింది.

గాయత్రికి భయంతో ఒళ్ళంతా చెమట్లుపట్టాయ్.

ఒక హంతకుడు ... ఒక నరరూపరాక్షసుడు ... ఒక పయోముఖవిష కుంభం... అమ్మచెప్పిన మాటల్నిబట్టిచూస్తే ... ఒక ధనవ్యామోహపిశాచి– తనకోసం కూర్చునట్లు– తనకోసం చేతులుచాపుతున్నట్లు అన్పించింది గాయత్రికి.

కాఫీపట్టుకుని సావిట్లోకి వెళ్ళేసరికి– చక్రధర్రావ్ లుంగీ, బనీనువేసుకొని చిన్న రేడియో చెవిదగ్గర పెట్టుకుని హిందీపాటలు వింటున్నాడు. మెళ్ళో పులి గోరు పతకం వ్రేలాడుతోంది.

''కా . ఫీ.''

అతడు నవ్వుతూ కాఫీ అందుకొన్నాడు.

''పెద్దవాళ్ళు ఎవరూ లేరని తెలిసికూడా... ఈరోజు ఇక్కడే ఉండి పోయేలా ఉన్నాడు ఈ మహానుభావుడు– అనుకుంది గాయత్రి కోపంగా.

విష్ణుమీద పీకల్దాకా కోపం వచ్చింది. ఈసమయంలో ఇంట్లోఉంటే ఎంత బావుండును! వెధవతిరుగుడూ వీడూను.''

వంటచేస్తుండగా వెనకాల ఏదో అలికిడైనట్లు విన్పించింది. గిరుక్కున వెనక్కితిరిగింది గాయత్రి.

చక్రం!

చిన్నగా నవ్వుతూ గడపమీద కూర్చుంటున్నాడు.

గాయత్రి గుండె ఝల్లుమంది.

''వంటయ్యాక భోంచేసివెళ్దరుగాని– ఈలోపున సావిట్లోకూర్చోండి.'' మెల్లగా అంది గాయత్రి.

''ఏం గాయత్రీ! నేనంటే నీకు భయంగా ఉన్నట్లుంది. చూడు. ఈకాలపు పిల్లల్లోఉన్న చొరవ నీకు లేనట్లుంది. పెళ్ళికావాల్సిన ఇద్దరు యువతీ యువకులు,, ఇలా .. ఒంటరిగా కల్సుకుంటే... ఈరోజుల్లో ... ఎల్లాఉంటున్నారో నీకు తెలుసునా?... ''

చక్రధర్రావ్ ప్రసంగం గాయత్రికి చాలా చిరాకనిపించింది. మళ్ళీ చక్రధర్రావే మొదలుపెట్టాడు.

''అదిసరే! నీకు నాగురించి కొన్నివిషయాలు చెప్పాలి. అఫ్‌కోర్స్.... మనపెళ్ళైనతర్వాతనైనా నీకు తెలియకపోవనుకో. నేను... నా... మొదటి పెళ్ళాన్ని... వేధించి చంపేసానని.... మన బంధువుల్లో అనుకొంటున్నారు.... కానీ అదంతా దుష్ప్రచారం! లేని ఇంటిపిల్లని జాలిపడి చేసుకుంటే పెళ్ళైన ఏడాది తిరక్కుండానే మా యింట్లో ఎనిమిదితులాల బంగారం మాయమైంది. మేం సహజంగా ఆమెనే అనుమానించాం... దొంగకి తేలుకుట్టిన అన్నట్లు అలా నిలదీసి అడిగేసరికి ఆమె నూతులోదూకింది.

జరిగినకథ ఇది. ఇంకచూస్కో.. నాల్డబ్బులు చేతిలోఉన్నవాణ్ణిచూస్తే . అందరికీ అసూయ, ఏకారణందొరుకుతుందా వీడిచేత ఆ నాలుగుడబ్బులూ ఖర్చుపెట్టించేద్దాం''అని లోకం చూస్తూఉంటుంది.

చుట్టుపక్కలవాళ్ళు నామీదా... అమ్మమీదా పోలీసులకి ఫిర్యాదుచేసారు. పోలీసులుదిగారు. మనిషి మనిషిలా ఉండగానే రక్తంపీల్చేయడం ఒక్క పోలీసులకే తెలుసు. మొత్తం పదివేలదాకా ఖర్చుపెట్టించారు.''

గాయత్రికి చక్రధర్రావ్ కథవింటే తలపోటుమొదలైంది.

''ఎవరు నమ్ముతారు ఈ కాకమ్మకథలు!'' అనుకుంది మనస్సులో.

గాయత్రి పనిపంకతో అటూ ఇటూ తిరుగుతుంటే – చక్రం అలా చెప్పుకుపోతున్నాడు.

''భోజనానికిలేవండి'' అంది గాయత్రి.

''ఆ! ఆ! భోజనంచేసేముందు కొంచెం పూజాకార్యక్రమం ఉంది. పది నిముషాల్లో వచ్చేస్తా!''

చక్రధర్రావ్ సావిట్లోకివెళ్ళి తలుపులుమూసుకున్నాడు.

గాయత్రికి నవ్వువచ్చింది.

ఇంత మహాభక్తునికి పెళ్ళాంమీద పిసరంత సానుభూతి ఎందుకు కలగలేదో!

తలుపు ఓరగాతోసి–లోనికిచూసింది గాయత్రి.

నిర్ఘాంతపోయిందామె.

బల్లమీద బ్రాందీసీసాఉంది. గ్లాసులో సగానికి బ్రాందీపోసిఉంది.

చక్రం మహా తన్మయత్వంగా ఒక్కొక్కగుక్కా వేస్తున్నాడు.

''చూస్తుంటే ఈయన సకల గుణాభిరాముడులా ఉన్నాడే.'' అన్పించింది గాయత్రికి.

పదినిముషాల్లో ''పూజాకార్యక్రమం'' ముగించుకొని బైటకొచ్చాడు చక్రం.

అప్పటికే మనిషిలో కొంచెం మార్పువచ్చినట్లుంది.

కళ్ళుఎర్రబడ్డాయి. వెకిలినవ్వులుకూడా ఎక్కువైనాయి.

గాయత్రి వంటకాలన్నీ దగ్గరుపెట్టి అరుగుమీదవచ్చి కూర్చొంది.

''గాయత్రీ!''

తాళికట్టినవాడికన్నా అధికారంగా కేకేసాడు చక్రధర్రావ్.

ఆ అధికారం మితిమీరిన చనువూ చూస్తుంటే గాయత్రికి చక్రధర్రావ్ అంటే చాలా అసహ్యంవేసింది.

గాయత్రి లోపలికివెళ్ళింది.

చక్రధర్రావ్ అన్నాడు: ''నేను వచ్చినప్పట్నించి చూస్తున్నా! తప్పించుకు తిరుగుతున్నావ్! ఏం? నేనంటే యిష్టంలేదా నీకు?

గాయత్రికి ఏంచెప్పాలో తోచలేదు.

చక్రధర్రావ్ మౌనంగాలేచి సావిట్లోకి వెళ్ళిపోయాడు.

గాయత్రి అన్నంతిందామని కూర్చుంది. కానీ ఒక్కముద్దకూడా గొంతు దిగలేదు. కంచంలో చెయ్యికడిగేసుకుంది.

సావిట్లోకితొంగిచూస్తే– చక్రం మంచంమీదపడి గుఱ్ఱుపెడుతున్నాడు.

గాయత్రి తేలిగ్గా నిట్టూర్చి - తలగడ తీసుకొని వంటింట్లో నేలమీద వేసుకుని మేను వాల్చింది

ఆమె మనస్సంతా అస్థిమితంగా వుంది!

పరాయి ఇళ్ళలో .. పరాయి మనుష్లతో కొందరిలా ఎలా...అసభ్యంగా ప్రవర్తిస్తారో!

'ఏమాత్రం సంకోచం లేకుండా....ఎలా మాట్లాడుతారో!

అమ్మా నాన్న ఊళ్ళో లేని సమయంలో ఇతడు ఊడిగొచ్చాడు. ఇతణ్ని ఎలా సాగనంపాలో! కొంపదీసి నాన్న గుంటూరినుండి వచ్చేవరకూ వెళ్ళడేమో?

అసలే తనకి చిన్నతనంనుండీ తాగినవాళ్ళని చూస్తే భయం.

ఏవేవో ఆలోచనల్తో కళ్ళు మూసుకొంది గాయత్రి.

సరిగ్గా ఆదే సమయంలో ...

రెండు బలమైన చేతులు పాముల్లా తన నడుం చుట్టూ పాకుతున్నట్టు అనిపించింది గాయత్రికి.

కళ్ళు తెరిచి చూసింది గాయత్రి.

చక్రధర్రావ్?!

గాయత్రి ముఖంమీద ముఖంపెట్టి చూస్తున్నాడు...ఆకలిగా!



కెవ్వున గాయత్రి వేసిన కేక గాయత్రి గొంతులోనే ఉండిపోయింది!

అంత శక్తి గాయత్రికెలా వచ్చిందో తెలియదు

చక్రధర్రావు పక్కకి తూలిపడేలా తోసింది.

తూలిపడబోతూ గోడని ఆసరాగా చేసుకొని నిలబడ్డాడు చక్రం!

"గాయత్రీ! ఐ లవ్ యూ! నేను నిన్ను....తప్పకుండా పెళ్ళి చేసుకొంటా. పరసైనవాళ్ళం....కాబోయే దంపతులం...ఇంకా భయం ఎందుకు?

చక్రం మాటలు తడబడుతున్నాయ్

"నువ్ మనిషివి గాదు ...పశువ్వి! ఒక్కడుగు ముందుకేసావో నీ రక్తం కళ్ళజూస్తా....నరు బ్రైటికి"

[illegible] గణాచారిలా గాయత్రి కోపంతో ఊగిపోతోంది.

ఆమె కన్నులు నిప్పులు కురుస్తున్నాయ్.

చక్రధర్రావ్ పెద్దగా నవ్వాడు.

"ఎవరైనా పిలు! కాబోయే మొగుడూ పెళ్ళాల సరసాలు అనుకొంటారు. ఈ రోజుల్లో ఇల్లాంటివి మామూలే....ఇందులో తప్పేం వుంది? రేపు ఎల్లాగా...తాళి కట్టాక...."

చక్రం గాయత్రి చెయ్యి అందుకున్నాడు.

గాయత్రి గింజుకోవడం మొదలుపెట్టింది

[illegible] సమయంలో ...

[illegible] తలుపులు పడాల్ని తోసుకుని - ప్రచండ ప్రభంజనంలా — పెను తుఫానులా—మందేహుల వికటాట్టహాసాన్ని గద్దిస్తున్న సహస్ర మయూఖ [illegible]

[illegible]డు ధర్మరాజు!

చక్రం తత్తరపడ్డాడు.

[illegible]ణంలో ధర్మరాజు జరుగుతున్న అన్యాయాన్ని ఘోరాన్ని [illegible] తలుపులు దగ్గరికి వేసి గడియ పెట్టేసాడు.

[illegible] వున్న చక్రం మెడమీద చెయ్యేసి సావిట్లోకి ఒక్క తోపు తోసాడు.

గాయత్రిని వంటగదిలోనే ఉంచి ఆవైపు తలుపులు కూడా దగ్గరికి [illegible].

మరుక్షణంలో.

లోపల్నించి దభీ దభీమని చప్పుళ్ళు వినబడసాగాయ్!

ఒకటి.... రెండు....ఏడు....తొమ్మిది....

గాయత్రి తలుపు తోసి చూసింది.

ధర్మరాజు చేతిలో చక్రధర్రావ్ చావు దెబ్బలు తింటున్నాడు.

కిందపడిన చక్రధర్రావ్ మెల్లగా పైకి లేచాడు.

[illegible] పైజామా వేసుకుని పెట్టె పట్టుకున్నాడు.

[illegible] గాయత్రికేసి చూస్తూ అన్న మాటలు అంతకుముందు ధర్మరాజు [illegible] దెబ్బల చప్పుళ్ళకు నాలుగు రెట్లై గాయత్రి గుండెల్లో ప్రతి [illegible]!

"గాయత్రీ! ఏదో సాగితే పెళ్ళెందుకన్నట్టు ఉందన్నమాట నీ వ్యవహారం. నువ్వేదో గొప్ప గుణవంతురాలవనుకున్నాను. నీకు తెలుసో తెలియదో - నిన్ను ఇచ్చి పెళ్ళి చేస్తానంటే మీ నాన్నకి అయిదువేలు ఇచ్చాను. గుంటూరినుంచి రాగానే ఆ డబ్బు మొత్తం పట్టుకుని మా ఇంటికి రమ్మని చెప్పు మీ నాన్నకి..."

గుమ్మం దాటుతూ చక్రధర్రావ్ అన్న మాటలకి రాతిబొమ్మే అయింది గాయత్రి.

[illegible] పెళ్ళి చేస్తా[illegible] ఇతని దగ్గఱ నాన్న అయిదువేలు పుచ్చుకొన్నాడా?

అంటే చక్రానికి తనని అమ్మేసాడా?

అందుకేనా....అమ్మ వాడొక హంతకుడండీ" అన్జెప్పినా వినకుండా తిరిగి మూర్ఖంగా వాదిస్తున్నాడు.

వేదసభలకి వెళ్ళి వచ్చిందగ్గర్నించీ తన తండ్రి నిత్యం పేకాటలో మునిగి తేలుతున్న డబ్బు చక్రం ఇచ్చినదేనా?

ఏ తండ్రైనా...తన కూతుర్ని తనకన్నా ఉన్నతస్థితిలో వున్నవాడి చేతుల్లో పెట్టాలనీ....సుఖపడాలనీ కోరతాడు ...కాని తన తండ్రి....రెండో పెళ్ళివాడికి....అందునా మొదటి పెళ్ళాన్ని వేధించి చంపిన దగుల్బాజీకి ఇచ్చి పెళ్ళి చేస్తానంటున్నాడు.

కారణం....డబ్బు!

డబ్బు ఎంత పనైనా చేయిస్తుంది.

డబ్బుముందు భార్యా భర్తా....తండ్రీ....కూతురూ....కొడుకులూ....మనవలూ... అనే బంధాలు లేవు! అనుబంధాలు అసలే ఉండవ్!

అన్నా....తమ్ముడూ....అనే రక్తసంబంధాలు లేవ్!

అది యుద్ధాల్ని చేయిస్తుంది. అంతర్యుద్ధాల్ని సృష్టిస్తుంది. ఆ డబ్బు కోసం నిండుజీవితాన్ని....తన కూతురు జీవితాన్ని బలిపశువుగా చేయడానికి చూస్తున్న తండ్రి.... వేదం చదువున్న పండిత వేషంలో....ఇన్నాళ్ళూ....ఇన్నేళ్ళూ....తన ప్రక్కనే....ఒకే ఇంట్లో....చాలా సమీపంగా మసుల్తున్నాడంటే....గాయత్రికి ఒళ్ళు జలదరించింది భయంతో.

"గాయత్రీ!"

సాంత్వనంగా భుజం తట్టాడు ధర్మరాజు.

గాయత్రి గుండెల్లోంచి దుఃఖం పెల్లుబికింది.

ధర్మరాజు గుండెలపై ఒదిగిపోయి బావురుమంది.

## 5

ఆ రాత్రి....

నిశాకాంత....నక్షత్రాల పూలు ఆకాశం కొప్పులో చుట్టుకొని - వెన్నెల తెలివలువ కట్టుకుని - కార్తీక చంద్రునితో అభిసరించిపోయిన రాత్రి - ఏ మహాకవుల హృదయాలు వాచ్యం చెయ్యలేని మౌన మహా ప్రణయలోకంలో లోకం మునిగిపోయిన రాత్రి - గాయత్రికి తొలిరాత్రి అయింది.

రాత్రి పగలూగా ద్విధావిభక్తమైన ప్రతిరోజూ "రాత్రి దేవవ్యరంసీత్" అన్నట్టు - గాయత్రి ధర్మరాజు కమ్మని కబుర్లలో నిలువునా కరిగిపోయింది.

విరిసిన ప్రతి పూవులోను - కురుస్తున్న మంచులోను - మెరుస్తున్న చుక్కల్లోను - గది మూల గూడు కట్టుకుంటున్న రెక్కలపురుగు దీక్షలోనూ - ధర్మరాజు హృదయాన్ని, ప్రేమనీ, ఆశల్నీ, చూసుకొంది గాయత్రి.

గదిముందు - తెల్లారేసరికి మందారం నాల్గయిదు పువ్వులైనా జార విడుస్తుంది.

రాలిన పూలు రాలిపోతుంటే - చెట్టుమీద మరికొన్ని మొగ్గలు విరిసి పోడానికి సిద్ధంగా నిలబడతాయ్ రేపటి ఆశల్లాగే!

చెప్తే నయం... నీరు తాగి బతుకుతాయ్.

మనుషులు ఊహల్ని తింటూ బతకలేరు

ప్రేమని తాగి నిలబళ్ళేరు.

గాయత్రిని తీసుకువచ్చిన నెల్రోజులు తిరక్కుండానే ధర్మరాజు తెచ్చిన డబ్బులు అయిపోయాయ్.

సర్టిఫికెట్లు పట్టుకుని ఉద్యోగం వేటలో పడ్డాడు మర్నాటినుంచే ధర్మరాజు.

కుళాయిలో నీళ్ళు తాగి... టౌన్‌లో తిరుగుతున్నాడు పనికోసం!

ఎక్కడకెళ్ళినా ఒకటే సమాధానం!

"ఖాళీ లేదు"

తొలిసారిగా రెక్కలు విప్పుకుని ఎగురుతున్న పక్షి పిల్ల డొక్కలో తగి. లిన మట్టిగుండులాంటి సమాధానం అది!

స్వతంత్రంగా బ్రతుకుదామనుకున్న జీవులికి ఈ లోకంలో 'ఖాళీ వుండదు. అడ్డమైన పన్లూ చేసి ...అడ్డదారులు తొక్కినవాళ్ళకి, ఈ లోకం ఎంతో విశాలంగా కన్పిస్తుంది. వాళ్ళదే ఈ దేశం!

ఇక్కడ నీతికీ-నిజాయితికీ-కష్టానికీ విలువ లేదు.

కుహనా నాగరికతకీ - నక్క వినయాలకీ ఈ లోకం పెద్ద పీట వేస్తుంది!

ధర్మరాజు సాయంత్రందాకా టౌన్‌లో తిరుగుతాడు.

సాయంత్రానికి . గుండెలు జారిపోయినవాళ్ళా...పడమంది మీద బడి దౌర్జన్యంగా తన్ని పడేసిన వ్యక్తి . లేచి ఒళ్ళు దులుపుకుని...కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని వస్తున్నట్లు...ఇంటికి వస్తాడు.

కానీ.. ఆ కళ్ళల్లో ఏదో ఆశ కొట్టుమిట్టాడుతూ వుంటుంది.

"ఇంటికి వెళితే గాయత్రి వుంటుంది. ఆమె చెప్పే ధైర్యవచనాలు ఉంటాయి. అన్నింటికి మించి .. ఈ బ్రతుకు పోరాట స్మృతుల్ని మరపించే కమ్మని ఒడి వుంటుంది-"

ఒక కాలే కడుపు మరో కాలే కడుపుని ఓదార్చుతుంది.

ఎల్లాంటి మహావీరుణ్నయినా మట్టి కరిపించే శత్రువు-ఆకలి!

అనాదిగా ఈ భూమ్మీద పడిన జీవకణం ఎన్నెన్ని రూపాలుగా మారిందో- తన సనాతనత్వాన్ని నిలబెట్టుకుంటూనే అనేకానేక అవతారాలెత్తిందో - అన్ని రూపాల్లో - అన్ని అవస్థల్లో - అన్ని దశల్లో దాన్ని వెంటాడింది ఒక్క ఆకలే— ఆకలి!

గాయత్రికి వంట చెయ్యడం ఎలాగో తెలియదు.

కట్టెలుండవ్. అగ్గిపెట్టుండదు. ఉన్న రెండే రెండు గిన్నెలూ దేనికీ సరిపోవు!

చింతపండు లేదు - ఉప్పు...లే... దు!

ఉండేవి రెండే రెండు! నకనకలాడే కడుపులు మాత్రమే!

ఎప్పటిలా ధర్మరాజు అస్తమయోన్ముఖుడైన కర్మసాక్షిలాగే – ఇంటికి వచ్చాడు.

రాగానే ఉస్సూరుమంటూ గోడకు జేర్లబడ్డాడు.

"ఈ సర్టిఫికెట్లు నమ్ముకుని...ఎంత మోసపోయాడు తాను. ఇంత కాలం . మహాభక్తిగా... అదే లోకంలా ...ప్రాణంలా...మంత్రంలా... మననం చేసుకొన్న గొప్ప విషయాలు...ధర్మరాజును వెక్కిరిస్తున్నట్లు మనశ్చక్షువు గోచరింపసాగాయ్!

షేక్స్‌పియర్ నాటకాలూ ...మహాభారతం - తిక్కన రచనా వైశిష్ట్యం, అశోకుడూ... గోల్డెన్ ఏజ్ ఆఫ్ గుప్తాస్ ...మతాలూ ...సమాజం... యుద్ధాలూ తేదీలూ... ఈస్టిండియా కంపెనీ...భారత స్వాతంత్ర్య చరిత్ర... ఇవేవీ ఆకల్ని తీర్చలేవు!

తన ఇరవై రెండేళ్ళ జీవితంలో పదిహేడేళ్ళ కాలాన్ని కబళించి ...తనని దేనికీ...ఏ పనికీ పనికిరాకుండా చేసిన....సరస్వతి - జ్ఞాన సరస్వతి....కాలే కడుపుకీ ఒక్క ముద్దని సంపాదించడానికి శక్తురాలు కాలేకపోయింది.

అన్నం కావాలి... కూలీపని కావాలి...డబ్బు కావాలి.

అవును! డబ్బు! డబ్బు కావాలి.

డబ్బు గొడవలేని జంతువులు స్వతంత్రంగా, స్వేచ్ఛగా బతుకుతాయ్.

## నా గురించి



నా పద్నెనిమిదవ యేట తొలి కవితా ఖండికను [illegible] అన్న సంతోషం కల్గించింది భారతి!

ఇంతవరకూ యాభై కవితా ఖండికలూ, పది కథలూ, వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డాయ్!

"మ్రోగని మువ్వ" (1984), "కుళింద కోన బాలిక [illegible] 1985) వరుసగా ఆంధ్రపత్రిక, బాలజ్యోతిలలో ద్వితీయ, తృ[illegible] గెల్చుకొన్నాయ్!!

'శివాలాపం' పద్యకావ్యం ముద్రితము – నాగా [illegible] - పత్రిక, ఋతుదీప్తి మొదలగు కావ్యాలు అముద్రితాలుగా ఉన్నై!!

ప్రస్తుతం వ్రాస్తున్న 'పాటలు' విని సహృదయ [illegible] భుజం తట్టుతున్నారు!!

నా తల్లి దీవన, భారతి వంటి ఉత్తమ పత్రికల [illegible]. ఊపిరిగా సాగిస్తున్నాను అక్షర యాత్ర!

విశ్వనాథ అభిమాన కవి!

పుట్టినది తూర్పుగోదావరి జిల్లా టి కొత్తపల్లి గ్రామం[illegible] ప్రస్తుతం విశాఖ జిల్లా లంకలపాలెం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో తెలుగు పండిట్‌గా పని చేస్తున్నాను!

'యాత్ర'కు బహుమతి నిచ్చి ప్రోత్సహించిన భారతి సంపాదకులకు – న్యాయనిర్ణేతలకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు!!

సహ విజేతలకు అభినందనలు!

బులుసు వేంకటేశ్వర్లు

ఈ 'డబ్బు' మనిషిని పరాధీనుణ్ణి ...దీనుణ్ణి చేస్తుంది.

మనిషి సృష్టించుకొన్న ఒక లోహపుబిళ్ళ....ఒక కాగితం .. మనిషినే బొంగరాలాట ఆడిస్తుంది.

నీరసంగా గోడకి జేర్లబడిపోయిన ధర్మరాజుని చూస్తే గాయత్రికి [illegible] లేని జాలి వేస్తుంది.

చుట్టుపక్కల ఒక్క రూపాయి అప్పుకోసం పొద్దుటినుండీ ప్రయత్నించింది. కానీ ముక్కూ మొహం తెలియనివాళ్ళ మధ్య అప్పు ఎలా దొరుకుతుంది. ఒక్క రూపాయి దొరికితే... నూకలు కొని జావ కాద్దామనుకొంది గాయత్రి.

ప్చ్! లాభం లేకపోయింది.

ధర్మరాజు తిరిగి తిరిగి వస్తే... ఆకలి అ[illegible]

ఏడుస్తూ కూర్చుంది గాయత్రి.

ఏవిటీ లోకం?

కష్టపడి బతుకుతానంటే....ధర్మరాజుకి "పని" లేదంటుంది.

రాళ్ళు మోసేచోట అతని బి.ఏ. డిగ్రీ ఎక్కువైపోయింది.

లెక్కలేసే గుమాస్తా పనికి ఆ డిగ్రీయే తక్కువై పోయింది.

ఇంట్లో ఎప్పుడైనా పేపర్ చూసి నిరుద్యోగం గురించి చదివింది కానీ... గాయత్రికి ఈ నిరుద్యోగ వలయం ఇంత ఘోరంగా ఉందని తెలియదు.

ధర్మరాజుని చూస్తే .. ఒక్కొక్కప్పుడు భయమేస్తుంది.

ఉద్యోగం లేదని నిరాశలో ఇతడు ఏదైనా అఘాయిత్యానికి పూనుకొంటే-

అమ్మో! తల్చుకొంటేనే గాయత్రికి ముచ్చెమ[illegible]!

"గాయత్రీ! తినడానికి ఏమైనా ఉందా?" అడిగాడు ధర్మరాజు.

ఏం చెపుతుంది గాయత్రి?

తళా తళా మెరుస్తున్న ఖాళీ గిన్నెల్ని చూసి కూడా ధర్మరాజు అలా అడిగితే ఏం చెప్పాలి?

ఇంట్లో ఏం లేదని అతనికి తెలుసు.

కానీ ...కానీ .. ఆకలేమో పాపం! తెలిసి కూడా అడిగిస్తుంది.

కన్నీటిపొరని తుడుచుకుంటూ ఉండిపోయింది గాయత్రి.

"నిన్ను చేసుకొనేకంటే ఆ మూగిదాన్నే చేసుకోవల్సింది." అన్నాడు కటువుగా ధర్మరాజు

గాయత్రికి రోషం వచ్చింది. "చేసుకోవల్సింది. ఇంతమాత్రానికి నువ్వు లేకపోతే చచ్చిపోతానని ఉత్తరాలు రాయడం ఎందుకు?"

"మరి లేకపోతే ఏవిటి? అడిగినదానికి జవాబు చెప్పవు?"

"ఏం చెప్పను? నిన్న పక్కవాళ్ళ దగ్గర రెండ్రూపాయలు అప్పుచేసి జావ కాచిపోసాను. ఈ రోజు అదీ లేదు. నువ్వయితే నిన్నయినా జావ తాగావు. నేనో...నిన్నటినుంచి ఏం తిన్లేదు."

ధర్మరాజు గోడవైపు తిరిగి పడుకున్నాడు.

కాళ్ళు జాపుకుని పడుకుందుకు సరిపోని ఆ గదికి అద్దె యాభై రూపాయలు.

ప్రతి నెలా ఒకటో తారీకున — సూర్యుడు ఉదయించకముందే ప్రత్యక్ష మవుతాడు అద్దె వసూలు చెయ్యడానికి ఓనర్.

అప్పుడే ఓ నెల అద్దె బాకీ పెట్టాడు ధర్మరాజు.

అద్దెకోసం వచ్చినప్పుడల్లా గాయత్రికేసి వెకిలిచూపులు చూసి పోతాడు ఆ యాభై ఏళ్ళ ఆసామి!

మళ్ళీ ఒకటో తారీఖు వస్తోంది.

ఈసారి గత నెల బాకీతో కలిపి వంద రూపాయలు ఇవ్వాలి.

ధర్మరాజు నడవమంటే చెట్టుకింద కాపురం ఉండడానికైనా సరే ..తాను సిద్ధమే.

కానీ...కానీ ..

ముందు ముందు తనకి ఓ గూడు చాలా అవసరం.

గాయత్రి ఆ విషయం గురించే ధర్మరాజుకి ఎలా చెప్పాలా అని ఆలోచిస్తోంది

ఇవ్వేళో రేపో గది ఖాళీ చేయించడానికి ఇంటి యజమాని సిద్ధంగా ఉన్నాడు

ఎక్కడైనా ఓ పూరి గుడిసైనా సరే ...నిర్భయంగా "ఈ చోట్లోంచి తనని ఎవరూ బయటకి వెళ్ళమనరు." అనే ధైర్యం కలిగే చోటు కావాలి తనకి ఖరీదయిన మందులు అక్కర్లేదు

డాక్టర్ల పర్యవేక్షణ అక్కర్లేదు

నాలుగ్గోడలూ పైకప్పూ గల చోటు ..అదెంత నరకంలో ఉన్నదయినా సరే...కావాలి.

జంతువులా రోడ్డుమీద "తల్లి" కాలేదు.

తన స్థితి తల్చుకొంటేనే భయంగా వుంది గాయత్రికి.

జావ కాచుకొనేందుకే పైసల్లేవు.

ఈ మహా నగరంలో ఓ మనిషి తలదాచుకొనేందుకు గూడు దొరకడం ఎంత కష్టం

అసలు తాను తల్లి కాబోతోందని ధర్మరాజుకి ఎల్లా చెప్పాలో తెలియలేదు గాయత్రికి.

ఒకరకంగా మాటలే కరువయ్యాయి గాయత్రికి.

ధర్మరాజుకేసి చూస్తే - గోడవైపు తిరిగి నిద్దర పోతున్నాడు •

కిటికీలోంచి ఝుమ్మని రొద చేస్తూ రెక్కల పురుగు మళ్ళీ వచ్చింది

గాయత్రి దానికేసి చూసింది

అసలు నెల్రోజులుగా...ధర్మరాజు టౌన్‌లోకి పోయాక ఇంట్లో కూర్చుని ఆ పురుగునే చూస్తూ ఉండేది గాయత్రి.

ఓ రోజు!

అది కిటికీలోంచి టప్పున గదిలో పడింది

మరో రెండు రోజులు పోయేసరికి ఆ పురుగు కిటికీ తలుపు వెనక్కి వెళ్ళడం - రావడం గమనించింది గాయత్రి.

ఉత్సుకతతో కిటికీ రెక్క పక్కకి లాగి చూసింది.

ఆ చెక్కమీద ఓ మట్టిముద్ద కన్పించింది.

ఆ రెక్కల పురుగు గంటకి పదిసార్లయినా కిటికీలోంచి లోపలికి వచ్చి బయటకు పోతూ వుంది.

మరికొన్నాళ్ళు... ఓ యోగంలా... ఓ దీక్షలా ...ఓ తపస్సులా...గంటల తరబడి యాతాయాతపునః ప్రయాత క్రమతో ఓ బుల్లి గూడు కట్టుకొంది ఆ పురుగు.

గాయత్రి ఆశ్చర్యపోయింది—మానవ నిర్మాణ శక్తినే సవాలు చేసిన ఆ రెక్కల పురుగు, గాయత్రికి ఈ నెల్రోజులుగా కాలక్షేపం ఇచ్చింది.

ఎక్కణ్నించి తెచ్చిందో... అన్ని రంగులు మేళవించిన మట్టిని? ఆకాశ గంగా పులిన తీరస్వర్ణ రజుస్సులు అద్దుకొన్నట్లు మెరిసిపోతోంది గూడు.

నిరంతర ప్రవాహంలాంటి సృష్టి యజ్ఞంలో నేను సైతం సమిధినౌతాను అన్నట్లు - జీవధర్మాన్ని, తనదైన ఆడతనానికి వరమైన పరమోత్తమ ధర్మాన్ని నిర్వర్తించేందుకు ఆ గూట్లోకి దూరిపోయింది రెక్కలపురుగు.

గాయత్రి ఆ రోజు అనుకొంది. "ఎలాగైనా సరే - ఈరోజు ధర్మరాజుకి చెప్పేస్తాను" అని

"ఈ రోజో, రేపో - ధర్మరాజుకి ఏదో పని దొరక్కపోదు. ఏ కష్టాలు పడయినా తమ ప్రేమఫలాన్ని పెంచుకోలేకపోతామా?"

ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

ధర్మరాజు లేపుతుంటే మెలకువ వచ్చింది గాయత్రికి.

లేచి చూస్తే .. ధర్మరాజు చేతిలో రెండు రొట్టెలున్నాయి.

"ఎక్కడివి?"

"ఈసందు చివర ముసలమ్మదగ్గర అరువు పెట్టాను. తిను."

గాయత్రి ఓ రొట్టెవిరిచి నోట్లో పెట్టుకుంది

చల్లబడిపోయి కొంచెం వాసన వచ్చిందికూడాను ఆ రొట్టె.

"ఇంక ఎలాగూ అమ్ముడవ్వదని...అరువు ఇచ్చేసి వుంటుంది ఆ ముసిల్ది" అనుకుంది గాయత్రి.

చీకట్లో ధర్మరాజు తన చెవిలో "గాయత్రీ!" అని మంద్రంగా పిలిచినప్పుడు... గాయత్రి చెప్పాలనుకున్న సంగతి చెప్పేసింది.

"ధర్మరాజూ! మనకి పాపో . బాబో . పుడతాడు ..."

అంతే! మరెలా చెప్పాలో తోచలేదామెకి.

టక్కున గాయత్రిపై వేసిన చెయ్యి వెనక్కి తీసుకున్నాడు ధర్మరాజు!

## 6

ధర్మరాజు అన్న మాటలు గాయత్రి చెవుల్లో హోరుమంటున్నాయ్! అంతేనా? తన ప్రతిరూపాన్ని లోకంలోకి ఆహ్వానించే ఒక తండ్రి అనవలసిన మాటేనా అది?

ధర్మరాజు అలా అనకుండా ఉండుంటే బాగుండునన్పించింది. గాయత్రికి.







తాను తల్లిని కాబోతున్నానని చెప్పినప్పుడు .. అతడు ఒక్క ముద్దు తన చెంపలకి అర్పిస్తే....చాలు .. తానెంత పొంగిపోయేది!

జన్మాంతం ఆ మధుర క్షణాన్ని జ్ఞాపకం పెట్టుకోదూ తాను?

లేదు! ధర్మరాజు అలా అనాలని అని వుండడు.

ఉద్యోగం దొరకలేదన్న చిరాకులో.. తిరిగి తిరిగి ఇంటికి వచ్చిన అస్తమితంలో అలా అని వుంటాడు.

"మళ్ళీ మన దరిద్రం పంచుకోడానికి ఈ లోకంలోకి ఒకడు రాబోతున్నా డన్నమాట—"

ఈ మాట ధర్మరాజు నోట తాను వింది.

ఆ మాట అబద్ధం అని చెప్పి చెవులు మోసం చెయ్యమంటున్నాయ్!

ఆ క్షణంలో దుఃఖం దిగమ్రింగడం గాయత్రికి శక్యం కాలేదు!

ఆమె బోరున ఏడ్చింది!

ధర్మరాజు గాయత్రిని ఓదార్చలేదు.

ఇంటికప్పుకేసి - నిశ్చలంగా చూస్తూనే ఉండిపోయాడు తెల్లవార్లూ

ఎండెక్కగానే సర్టిఫికెట్లు పట్టుకుని బయల్దేరాడు ధర్మరాజు.

"వస్తాను."

గుమ్మంలో నిల్చున్న గాయత్రికి కనుమరుగయ్యాడు ధర్మరాజు.

ఆ సాయంత్రం!

ధర్మరాజు కోసం నిరీక్షిస్తూ గుమ్మంలోనే కూర్చుంది గాయత్రి.

ఏరోజుకారోజే....ఏదో కొత్త ఆశ!

ఈనాడైనా ధర్మరాజుకి ఏదో "పని" దొరక్కపోదు!

కాలే కడుపులికి గంజినీళ్ళు పోసేపాటి చిన్న "పని" అయినా చాలు!

పిట్టలు గూళ్ళకి చేరుతున్నాయ్!

సంజ చీకట్లు ముసిరాయ్!

చీకటి పడింది. చంద్రుడు పొడిచాడు!

ధర్మరాజు రాలేదు.

గదిలో బుడ్డిదీపంలో కిరసనాయిల్ అయిపోయింది.

ఆరిపోయింది.

ఆ చిమ్మచీకట్లో....ధర్మరాజు కోసం కన్నుల్లో వత్తులేసుకొని ఎదురు చూస్తూనే వుంది గాయత్రి.

అలా చూస్తూండగానే....తెల్లవారింది కూడా!

ఒకటి ... రెండు....మూడు రోజులు....గడిచిపోయాయి.

. గాయత్రి టౌన్‌లో తిరగని చోట్లు లేవ్!

సందుల్లో... గొందుల్లో . రైల్వేస్టేషన్ దగ్గర.. కలక్టరాఫీస్ అరుగుల సీదా....చూసింది...

చూసిన చోట్లే మళ్ళీ మళ్ళీ వెతికింది గాయత్రి.

ధర్మరాజు తనని వదిలిపెట్టిపోయాడా?

అప్పుడప్పుడు అనుమానం వస్తోంది గాయత్రికి.

ఛీ ఛీ! ధర్మరాజు అలాంటివాడు కాదు. పనికోసం ఎక్కడెక్కడో తిరుగు తున్నాడేమో?!

పని దొరికితే కానీ తన మొహం చూపించకూడదనుకున్నాడో!

రోడ్డుపక్క ఎవరో యువకుడు సొమ్మసిల్లి పడుంటే దగ్గరకి వెళ్ళి చూసింది గాయత్రి.

ఊహుఁ ధర్మరాజు కాదు.

దూరంగా... నిస్త్రాణగా నడచిపోతున్న ఆసామీని చూసి-గట్టిగా కేకేసింది గాయత్రి. ఆ వ్యక్తి గాయత్రికేసి చూసాడు.

అతడూ ధర్మరాజు కాదు.

"ధర్మరాజూ! ఎక్కడున్నా సరే, వెంటనే రా!"

గట్టిగా....దిక్కులు బద్దలయ్యేలా అరవాలనిపించింది గాయత్రికి.

ఓ తిండిలేదు...ఓ స్నానం లేదు....కంటిమీద కునుకు లేదు. నిరంతర పరిభ్రమణం....ప్రతి క్షణం అన్వేషణ!

గాయత్రి రైల్వేస్టేషన్‌లో సొమ్మసిల్లి పడిపోయింది.

## 7

అలా ఎన్ని పూటలు గడిచాయో గాయత్రికి తెలియదు.

కానీ... తెలివొచ్చే సమయానికి ఓ చల్లని చెయ్యి తన కళ్ళు తుడుస్తోంది.

ఉన్న శక్తిని కళ్ళల్లో పెట్టుకుని చూసింది గాయత్రి.

ఎవరో వృద్ధమూర్తి!

ఆ మొహంమీద ముడతలు చాలు... ఆమె ప్రపంచాన్ని కాచి వడబోసిన విజ్ఞానాన్ని తెలియజేసేందుకు!

"ఎవత్తివే పిల్లా? నిన్నట్నించీ ఇలా పడున్నావ్?" అంది ఆ ముసల్ది గాయత్రిని గుచ్చి గుచ్చి చూస్తూ!

గాయత్రికేం చెప్పాలో తెలియలేదు.

"ఇంద. ఈ వణ్ణం తిను. పేనం కుదుటబడతాది-" అంటూ సత్తు కేరేజీ మూత తీసింది ఆ వృద్ధురాలు.

కూర్లూ.. పులుసూ... అన్నం కలిసిపోయి ఏకాకారంగా ఉన్న పదార్థం అది....

ఈ సభ్య సమాజం చూపించలేని దయతో జాలితో....తనకోసం దాచుకొన్న అన్నాన్ని ఓ ప్రాణం రక్షించడానికి వినియోగిస్తున్న ముసిల్ది — ఇంకా లోకంలో ఏ మూలో మినుకు మినుకుమంటున్న మానవత్వానికి చివరి వెలుగులా కన్పించింది గాయత్రికి.

అన్ని రుచులూ కలిసిపోయి అదో వాసనతో ఉన్న ఆ అన్నం గాయత్రికి కొంచెం వెగటు వాసనగా అనిపించినా - మండుతున్న క్షుధాగ్ని రుచీ పచీ చూడకొండానే స్వీకరించింది.

"లే! పిల్లా! నా గుడిసెకి పోదాం" అంది కేరేజీ సద్దుకొంటూ ముసిల్ది.

గాయత్రి ఆమె వెనకాలే నడిచింది.

అడుగుతీసి అడుగు వెయ్యడానికూ్కడా గాయత్రికి కాళ్ళు సాగడం లేదు.

స్టేషన్‌కి కొంచెం దూరంలో పల్లపు వీధిలో రోడ్డుపక్కగా అట్టలు కప్పిన గుడిసెలోకి దూరింది ముసిల్ది.

గాయత్రి ఆ గుడిసెలోకి అడుగు పెట్టింది.

"పిల్లా! ఇక్కడి బతుకు శానా గోరంగా ఉంటాది! సూత్తే ... పెద్దింటి పిల్లనాగున్నావ్. మీ ఊరికి ఎల్లిపోతావా? లేకపోతే ఈడే ఉండిపోతావా?

గాయత్రికి మళ్ళీ తన ఊరు వెళ్లాలనిపించలేదు.

కష్టవో సుఖవో తన బతుకు తాను బతకాలి.

ధర్మరాజు ఈరోజు కాకపోతే రేపయినా కనబడతాడు.

ఈ టౌన్‌లోనే వుండి .. కూలిపనయినా చేసి .. నా కాళ్ళమీద నేను నిలబడతా...మగాడికే పన్దొరకని ఈ అడవిలో....తాను కష్టపడతానన్నా చోటు దొరుకుతుందా?

ఆ ముసిల్దానికి గాయత్రి తన కథంతా పూస గుచ్చినట్లు చెప్పింది.

ఆ వృద్ధురాలు గాయత్రి కథ విని ఓ నిట్టూర్పు విడిచింది.

"అంతేనే పిల్లా! దెబ్బతిన్న పెతీ ఆడదాని కతా ఇంతే!

"మరి నా కత ఇలాంటిది కాదు! చెపుతా యిను.

నాను తొమ్మిది పుర్ళ్ళోసుకున్నాను .. ముగ్గురు మొగుళ్లు ఒకళ్ళైనకాల ఒకళ్లు నన్నేలుకున్నారు. మొదటి మొగుడు తాగి తాగి సచ్చినాడు. రెండోవాడు ముగ్గురు పిల్లలు పుట్టినాక కడుపునిండే మార్గంలేక ... కట్టపళ్ళేక ...కాసాయం గుడ్డలు సుట్టుకుని సన్నాసుల్లో కలిసిపోనాడు. మూడోవాడు కోరిపన్లో నారీకింద పడి సచ్చిపోయినాడు ...

నాకు తొమ్మిదిమంది సంతానం అన్జెప్పినానా?

నలుగురు ఆడముండలూ - అయిదుగురు మొగ ఎదవలు! ఇద్దరు మగ పిల్లలు ఇద్దరు ఆడపిల్లలూ పాల్లేక సచ్చినారు.

మిగిల్నోళ్ళు కడుపు సేత్తో పట్టుకుని ఏడకి పోనారో - ఇయ్యేలెక్కడుంటారో ... రేపెక్కడుంటారో ...నా తెలిక లేదు.

నాను మాత్తరం ..యీడ పుట్టినాన్ని. ఈడే సచ్చిపోదాం గదాని ... ఎక్కడికీ ఎల్నేదే పిల్లా .. కొన్నాళ్ళు కంపెనీల్లో నీళ్ళు మోసినా, కొన్నాళ్లు పెద బాబుల ఇళ్ళల్లో పాచిపన్లు సేసినా ..

ఒంట్లో ఓపికున్నంతదాకా కష్టపడి సంపాదించుకొన్న గంజే తాగినాను.

మరి నన్ను సూసినావా? ఇప్పుడు కట్టబళ్ళేను! కొన్నాళ్ళు ఓటేళ్ళకాడ సెయ్యి సాపి నిలబడినాను .. కొన్నాళ్ళు రైళ్ళకాడా, బస్సులకాడా అడుక్కున్నాను.

పిల్లా! లోకంలో దరమం సచ్చిపోనాది.

పట్నాల్లో మరీను!

ఏలకి ఏలు....వందలికి వందలు .. జీతాలు తీసుకున్న రోజు కూడా ఓ పావలా....నాలాటి ముసిల్దానికి దరమం చెయ్యరు....

ఇంకెంతకాలం బతుకుతాలే ...అన్జెప్పి యిల్లాగే బతుకు లాగించేత్తున్నా!

లోకంలో ఎన్ని కట్టాలున్నాయ్యో అన్నింటిని సూసినా!

అయినా సరే దేవుడుండమన్నంతకాలం ఉంటాను. సచ్చిపోను"

అంటూ తన కథ ముగించింది ముసిల్ది.

"మామ్మా! నీ పేరేవిటి?"

"సత్తెమ్మ! నన్ను 'మామ్మా' అని పిలవ్వే మనవరాలా" అంది నవ్వుతూ సత్తెమ్మ.

"మామ్మా! రేపు టౌన్‌లోకెళ్ళి ఏదేనా పన్దొరుకుతుందేమో చూస్తాను. నాకు పన్దొరికితే ఇంక నువ్వు టౌన్‌లో తిరగక్కర్లేదు. ఇద్దరం కలిసి కలో గంజో తాగుదాం!...."

సత్తెమ్మ లేచి గాయత్రి చంపలమీద మెటికలు విరిచింది

"మా అమ్మే ...బంగారుతల్లివి! తొమ్మిదిమందిని కన్నాను, ముగ్గురెదవల్తో కాపురం సేసినా....ఈ జలమలో ఇలాంటి సల్లనిమాట ఇన్లేదు. రాలిపోయే ముందు ఎంత సల్లనిమాట చెప్పావే పిల్లా! ఇంక భయ్యం లేదు. మరో పదేళ్ళు బతికేత్తా" అంది నవ్వుతూ సత్తెమ్మ.

గాయత్రి గట్టిగా నవ్వేసింది.

గాయత్రి మర్నాటినుంచే పనికోసం వేట మొదలెట్టింది.

## 8

"ఓ నాల్నెల్లు పనుంటుంది. వర్కర్లకి కావలసినంత నీరు మొయ్యాలి! నెలకి డెబ్బైఅయిదు ఇస్తాను .. నీ యిష్టం."

వర్క్‌షాప్ మేనేజర్ గాయత్రి కళ్ళల్లోకి చూస్తూ అన్నారు.

గాయత్రి తలూపింది.

మేనేజర్ ఓ వర్కర్‌ని కేకేసాడు. అతడు వచ్చి లోపలికెళ్ళి ఓ సిల్వర్ బిందె గాయత్రి కిచ్చాడు.

గాయత్రికి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఈ మాత్రం 'పని' ఓ నెల్లాళ్ల క్రితం ధర్మరాజుకి దొరికితే....తన బ్రతుకు ఎట్లాగుండేదో?

విశ్వప్రయత్నం చేసిన వ్యక్తికి బతుకు దారి కన్పడదు.

అయాచితంగా....సులభంగా....మరొకడికి త్రోవ కన్పడుతుంది.

ఆ వర్క్‌షాప్ కనుచూపుమేరదాకా ఆక్రమించి ఉంది.

ఆవరణ చుట్టూ ముళ్ళతీగె చుట్టారు.

అక్కడ ఇనప దూలాలు, కమ్ములు కార్మిక స్వేదబిందు స్పర్శతో.... ఎన్నో రూపాంతరాలు చెంది లారీలకెక్కుతాయ్.

కార్మికుల కరకు కండలికి ఇనుము భయపడిపోతుంది!

పువ్వులా....దూదిలా.... వాళ్ళెలా మలిస్తే అలా మారిపోతుంది.

ఆ ఆవరణలో చిట్టచివర ఓ గొట్టపుబావి...

ఎండలకి అందీ అందకుండా పోయిన నేలలోని నీటిపొరని విశ్వ ప్రయత్నం చేసి పైకి తీసుకొస్తుంది ఆ బోర్‌వెల్!

సన్ననిధార—

నిరంతర శ్రమైక జీవిత మాధుర్యాన్ని దోచుకుని-అమ్ముకుని శ్రామికుల చేతుల్లో పెట్టిన సగం జీతం డబ్బులాగే - మరీ సన్ననిధార వస్తోంది ఆ గొట్టం గుండా!

అధోజగత్సహోదరులు — లోకంలో అనాదిగా నవ్య జగత్సృష్టికర్తలు! జీవితగ్రంథానికి భాష్యకారులు!

విడివిడిగా అంతా బతకలేనివాళ్లే....అందరూ కలిసి లోకాన్ని బతికిస్తారు!

వాళ్ళమీద అజమాయిషీ చేసే వర్క్ ఇన్స్పెక్టర్లు! వాళ్ళని ఓ కంట కనిపెట్టి చూసే సూపర్వైజర్లూ! వాళ్ళని మంచి జేసుకుని డబ్బు కొట్టేసే విషపు చూపుల మేనేజర్లూ ...అంతా మరో ప్రపంచంలా అన్పించింది గాయత్రికి.

శ్రమైకజీవుల్ని నిరంతర చైతన్యానికి చిరత్న రత్నాల్ని....చూసి గాయత్రి గర్వపడింది.

వాళ్ళ తడిసిన వీపులమీద సూర్యుడు ముఖం చూసుకుంటుంటే జాలి పడింది!

ఆ వర్క్‌షాపులో పది పదిహేను యూనిట్లుంటాయ్.

ఒక్కొక్క యూనిట్‌లో పదిమందిదాకా కార్మికులుంటారు.

ప్రతి యూనిట్ దగ్గరా ఓ మట్టికుండా, దానిమీద మూకుడూ.

గాయత్రి ఆ కుండల్ని నింపసాగించి.

మొట్టమొదటి కుండ నిండగానే... రెండు... మూడు...

ఈలోపున అక్కడక్కడ మంచినీళ్ళకోసం కేకలు!

"అమ్మాయ్! ఇక్కడ నీళ్లేవ్!"

చివరి యూనిట్‌లో మంచినీళ్ళు నింపేసరికి మొదటి యూనిట్‌లో కుండ ఖాళీ!

మధ్యాహ్నం ఆ శ్రామికులు మిరపకాయ నంజుకుని జావ తాగేవేళ ఓ గోలెం నీళ్ళు సిద్ధంగా ఉంచాలి.

గాయత్రి నీళ్ళు మోస్తూనే ఉంది.

ఉదయం - మధ్యాహ్నం రెండు షిఫ్టుల్లో పనిచేసే ఆ వర్క్‌షాప్‌లో గాయత్రికి మాత్రం ఉదయంనుండి సాయంత్రందాకా పనే!

సాయంత్రం వర్క్‌షాప్‌లో పెద్దగంట - "అందరూ ఇళ్ళకి వెళ్ళి పొండ్రా వెళ్ళి నాగన్నల్లారా! రేపటికోసం కొంచెం రక్తాన్ని, చెమటని దాచుకోండి" అంటున్నట్లు మోగినవేళ—

గాయత్రి చేతిలో పది రూపాయల నోటు పెట్టాడు మేనేజర్.

జీవితంలో తన మొదటి సంపాదన!

కష్టపడి సంపాదించిన డబ్బు!

ఫెళ ఫెళ్లాడే కొత్త నోటుని బొబ్బలెక్కిన అరచేతులు ఇముడ్చుకోలేక పోయాయ్!

అరచేతులు చూసుకుంటే పూచిన మందారాల్లా కన్పించాయి గాయత్రికి

అయితేనేం? శారీరక శ్రమని మైమరపించే అకోరకం సంతృప్తి ఆమెకి సత్తువనిచ్చింది.

పొద్దు వాలిపోయింది.

గాయత్రి గుడిసెకు బయల్దేరింది.

రైల్వే కాలనీలోంచి వస్తుంటే గాయత్రికి సత్తెమ్మ కనబడింది.

ఓ ఇంటి తూము దగ్గర చిరిగిపోయిన జల్లెడ పట్టుక్కూర్చుంది సత్తెమ్మ.

తూములోంచి వచ్చే నీటిలో ..అన్నం మెతుకులూ, తిని పారేసిన మామిడి తొక్కలూ...కూర ముక్కలూ ఉండి ఉండి నీళ్ళతో కొట్టుకొస్తున్నాయి, జల్లెడలోంచి నీళ్ళు కిందకి పోగా మిగిలిన పదార్థాల్ని తీసి కేరేజీలో సర్దుకుంటోంది సత్తెమ్మ.

"సస్యశ్యామలాం....మాతరం

వందేమాతరం—" అని దేశమాతని కీర్తించుకునే దేశంలోనే సత్తెమ్మ బతుకుతోంది!

ఆకలి సామ్రాజ్యంలో ఎన్నెన్నో గాథల రహదార్లు!

ఏ ఒక్క జీవితం మరో జీవితంతో పోలదు

ఒకటి కాగితాలేరుకుంటుంటే, మరోటి గాజుముక్కల్ని పోగెట్టుకుంటుంది.

ఒక ప్రాణి కుక్కల్తో .. పందుల్తో పోరాడి వాటి నోటికూడుని లాక్కుని బతుకు తుంటే-మరో జీవి కళ్ళు కాలవల్లోదిగి కడుపునింపే దేనికోసమో వెతుక్కుంటుంది.

ఒంట్లో ఓపికున్నంతకాలం విధితో పోరాడింది.

ముసలితనం పులి కోరల్లో చిక్కుకున్నాక-మరో మార్గంలేక మురికి తూముల్లోని మెతుకుల్ని కడుక్కుని తిని బతుకుతోంది సత్తెమ్మ.

సత్తెమ్మని చూస్తే ...గాయత్రికి ఏడుపొచ్చింది.

"మామ్మా!" ఆర్ద్రంగా పిల్చింది గాయత్రి.

సత్తెమ్మ గాయత్రికేసి చూసింది.

"లే మామ్మా! గుడిసెకు పోదాం ...

"చూడవే పిల్లా! యీది గుమ్మంలో నిలబడి పొద్దస్తమానం అరిస్తే— ఒక్క ముద్ద దరమం సెయ్యరు. ఇద్దరి కడుపులికి సరిపోయే కూడు ఈ మురిగ్గొట్టంలోంచి తోసేత్తారు!" అంటూ లేచింది సత్తెమ్మ.

"మామ్మా! ఇలా చూడు"

తన తొలి కష్టార్జితం పది రూపాయలూ సత్తెమ్మ చేతిలో పెట్టింది గాయత్రి.

"పన్నారికిందేవిఁటే పిల్లా?"

సత్తెమ్మ నవ్వు మొహం మరింత ముడతల్ని చూపింది.

తలూపింది గాయత్రి.

కష్టపడ్డానికి వీలు దొరికితే ఆనందపడిపోయే జాతి సత్తెమ్మది.

పది రూపాయల నోటుని పరీక్షగా చూస్తూ అంది సత్తెమ్మ "ఏ-పిల్లా! రూపాయికి అద్దరూపాయే కరుసెట్టుకొని మిగతా అద్దరూపాయి దాచాలి తెల్సిందా?

"ఎందుకు మామ్మా?"

"ఎందుకేటే పిల్లదానా! రేపు పుట్టబోయే బుడ్డోడికి శానా కరుసులుంటాయి.

అద్దరూపాయి వాటా వాడిది. జాగ్రత్త" అంది బెదిరిస్తున్నట్లు చెయ్యూపుతూ సత్తెమ్మ.

గాయత్రి సిగ్గుపడింది.

ఇంతవరకు మామ్మకి తాను తల్లి కాబోతున్నానన్న విషయం చెప్పలేదు సిగ్గుతో.

ప్రతి ఆడది తను తల్లి కాబోతున్నట్లు సాటి ఆడది గుర్తించి గౌరవించాలని కోరుకుంటుంది

"నిజవేఁనా?" ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేసి అడిగింది సత్తెమ్మ.

చిన్నగా నవ్వుతూ తలూపింది గాయత్రి.

అవును.... ఎవడోబుడ్డోడు...ఈలోకంలోకి రాబోతున్నాడు. వాడికోసం.. వాడికోసవేఁ తాను బ్రతుకుతోంది.

నిన్న మొన్న పరిచయమైన సత్తెమ్మ అన్నమాట- ఆనాడు ధర్మరాజు అన్లేకపోయాడు.

కనీసం.... ఆ పుట్టబోయేవాడికి తండ్రిగానైనా సంబరపడలేకపోయాడు.

ఆలోచనల్తో డీ నడుస్తోంది గాయత్రి.

గుడిశ దగ్గరపడింది.

## 9

అక్కడెవరూ పంచభక్ష్యపరమాన్నాలు వండుకోరు!

చేతిలో పైసలున్నరోజు జావతాగుతారు అంతే!

అక్కడ ఎవరిగొడవ వాళ్ళది! ఎవరి బతుకులు వాళ్ళవి.

పక్కవాడు బాగుపడుతున్నాడన్న ఈర్ష్యలేదు- తాము ఇంతకన్నా చెడిపోతామన్న బాధలేదు అక్కడ మనుషులకి.

వెలుగురేకలు - వచ్చీరాగానే ఆ గుడిసెల్లో ముప్పాతికపంతు జనాన్ని జీవిత సంగ్రామంలోకి తరిమేస్తాయ్.

పిల్లాపీచులాంటి వాళ్ళుమాత్రం గోళీలు ఆడుకొంటూ గుడిసెలదగ్గరే ఉండిపోతారు.

ప్రతి ఆడదీ ప్రతి మొగాడు తమ శక్తిని - శ్రమశక్తిని అమ్ముకొని సాయంత్రానికి తిరిగొస్తారు.

మొగాళ్ళు కొందరైతే తాగొస్తారు.

గుడిసెలన్నీ కలకల్లాడిపోతుంటాయ్ అప్పుడు.

ఆ చివరుండే ఫకీరు- పెళ్ళాన్ని చావబాదేస్తూ ఉంటాడు.

పెంచలయ్య అయితే రిక్షామీదే పడుకొని కోడికూర వండితేకానీ-అన్నం ముట్టనని కేకలేస్తూ ఉంటాడు.

రాత్రి పదయ్యాక - ఆ జావే తాగిపడుకుంటాడు.

ఉండి ఉండి పిల్లకాయలు ఎందుకో గొల్లుమంటూ ఉంటారు.

తల్లో, తండ్రో వాళ్ళని "నోర్మూయండెహే!" అని మళ్ళీ బాదేస్తూ ఉంటారు.

బైరాగిమాత్రం.... ఏం తింటాడో... ఎక్కడతింటాడో తెలియదుకానీ- రాత్రి మూడోజాముదాకా ఏదోతత్వాలు పాడుతూనే ఉంటాడు.

రైళ్ళు వస్తూపోతూ చెవులు దిమ్మెక్కేలా కూస్తూఉంటాయి.

గాయత్రికి ఈ గుడిసెలప్రపంచం వింతగా కనబడింది.

కల్మషంలేకుండా మాట్లాడతారు.

మనసులో ఏవీఁదాచుకోకుండా పోట్లాడుకొంటారు.

రాత్రి.... ..

మగతనిద్రలో - ఏదో కలకలం వినబడి మెలుకువచ్చింది గాయత్రికి.

"ఏందిమామ్మా! హడావుడి?"

చూరుకిందకూర్చుని ఏదో గొణుక్కుంటున్న సత్తెమ్మని అడిగింది గాయత్రి.

"ఏవుందిపిల్లా! రేత్తిరి రెండోజావుఁదాకా తత్వాలు పాడుతూనే ఉన్నాడు బైరాగి! అద్దరేత్తిరేళ... అందర్నీ... గట్టిగా కేకేసాట్ట! గుండెల్లో నొప్పిగా ఉందిరా" అన్నాట్ట మరోగంటకి పేనం ఒగ్గేసాట్ట.—

బైరాగి చచ్చిపోయాడా?

గాయత్రి నమ్మలేకపోయింది!

లేచి గుడిసె బైటికి వచ్చింది!

నిజవేఁ

బైరాగిని బయటపెట్టారు! తలవెనుక ఎవరో దీపంపెట్టారు.

అందరూ తలోమాటా బైరాగిగురించే మాట్లాడుకొంటున్నారు.

అసలు అతడు ఎక్కడివాడో ఎవరికీ తెలియదుట. రెండేళ్ళక్రితం ఈ గుడిసెలో దిగాట్ట.

ఈ రెండేళ్ళుగా ఏవో తత్వాలూ పాటలూ అలా పాడుతూనే ఉన్నాడు.

"మామ్మా ఎవరైనా డాక్టర్ని పిల్చుకురాలేదా?"

ఏందేపిల్లా మన బతుకులికి డాకటేరుకూడానా? ఈ గుడిసెల్లోకి ఈ అలగా జనాలమజ్జికి డాకటేరు ఒత్తాడా? ఒచ్చినా... ఒయిజ్జెం ఎవరుసేయిత్తారే.... ఎల్లావచ్చినోళ్ళు అలాగేపోతారు మనం సూత్తూ ఊరుకుండేటోళ్ళమేఁ" అంది సత్తెమ్మ.

మరికొంతసేపటికి మున్సిపాల్టీమనుషులొచ్చి బైరాగి శవాన్ని తీసుకుపోయారు.

బైరాగికోసం ఏడ్చినవాడు ఒక్కడంటే ఒక్కడు లేడు.

ఆ గుడిసెల్లో ఎక్కడవిన్నా "బైరాగి అదురుట్టవంతుడు.... సల్లగపోయినాడు-" ఇదేమాట.

వీళ్ళ మనస్సుల్లో నిర్వేదం తొలిగేదెప్పుడు?

ఎవడు? వీళ్ళకి రేపుమీద ఆశలుకల్పించే నాయకుడు?

వీళ్ళందరి ముగింపులు ఇంతేనా? మరీ ఇంతహీనంగా?

గాయత్రి కళ్ళుతుడుచుకుంటూ వర్క్‌షాప్‌కి నడిచింది.

మేనేజర్ గాయత్రిని చూడగానే మండిపడ్డాడు.

"గంట ఆలస్యం అయింది తెలుసా?"

గాయత్రి తలూపింది,

"ఏం?" అధికారంగా ప్రశ్నించాడు మేనేజర్.

గాయత్రి జరిగిన సంగతంతా చెప్పింది.

"వాడెవడోచస్తే నీకేం వచ్చింది? వాడేవైఁనా నీబాబా? తాతా? ఇదిగోపిల్లా- ఇల్లాంటి కబుర్లుచెప్తే తిన్నగా ఇంటికిపోతావ్!" అన్నాడు మేనేజర్.

గాయత్రికి చాలా కోపంవచ్చింది.

సాటిమనిషి మరణంమీద ఎంత ఉదాసీనత? ఎంత నిర్లక్ష్యం? అసలు వీళ్ళకంటికి — మనుషులు మనుషుల్లా కనబడుతున్నారా? మేనేజర్‌కి గట్టిగా సమాధానం చెపుదామనుకొన్న గాయత్రి చాలా కష్టంమీద కోపాన్ని నిగ్రహించుకొంది.

పొట్టగడవనివాళ్ళకి ఆవేశం పనికిరాదు

అది నురగలా ఆరిపోవల్సిందే! ఆర్పేసుకోవల్సిందే.

ఇదివరకులా కాదు- ఇప్పుడు పన్జెయ్యాలంటే అస్సలు ఓపికలేకుండా ఉంది గాయత్రికి.

ఎవరైనా చేసిపెడితే తిని కూర్చోవాలని ఉంది.

పనిలో ప్రవేశించిననాటి ఉత్సాహం.... హుషారు ఇప్పుడు లేవు.

నాలుగుబిందెలు మోసేసరికి నడుంపట్టేస్తోంది.

చేతులు పీకెస్తాయి. కానీ... తప్పదు.

గాయత్రి పదినిముషాలు ఆలస్యంచేస్తే... పక్కషాపు "సిళ్ళు సిళ్ళు" అని గోలపెట్టేస్తుంది.

ఆ కిష్టజీవులది "అబ్బురేదును చెదగ్రోలు నంతత్పవ-

గాయత్రి శరీరంలో ఎంతో మార్పొచ్చింది.

పంగుని బిందె ఎత్తుకోవడం ఎంతో కష్టమైపోతోంది.

పన్జెయ్యడానికి శరీరం అస్సలు స్వాధీనం కావడంలేదు.

గాయత్రి అవస్థలు పక్కవాళ్ళు చూస్తూనే ఉన్నారు. పాపం వాళ్ళుమాత్రం ఏంచేస్తారు?

వాళ్ళ పెళ్ళాలూ అంతే... ఎదపిల్లా.. చంటిపిల్లల్తో.. పురిటిరోజుల్లోకూడా ఇంటెడు చాకిరిచేస్తూ జావకాచిపోసి తెల్లవారేసరికి భర్తల్ని పన్లోకి పంపిస్తున్నారు.

బాలెంతఅయినా.. చూలెంతఅయినా.. రోగిష్టిఅయినా వాళ్ళ ఆడాళ్ళకి విశ్రాంతిలేదు.

అసలు ఆడబతుక్కి విశ్రాంతిలేదేమో...

"తాను ఇంక పన్జెయ్యలేదు.. ఉంటే తినడం.. లేకపోతే పస్తుఉండడం_

మామ్మదగ్గర కూడబెట్టిన సొమ్ముతో. నెలరోజులు గంజీనీళ్ళుతాగొచ్చు... ఆతర్వాత చూద్దాం.. తన రెక్కలకష్టం తనకెలాగా తప్పదు" అనుకొంది గాయత్రి.

ఆ సాయంత్రం.. మేనేజర్ గంటసేపు ఏవో లెక్కలు వేసివేసి ముప్పై రూపాయలు గాయత్రిచేతిలో పెట్టాడు.

## 10

ఓ సాయంత్రం...

గాయత్రి గుడిసెలోకూర్చునిఉంది.

అంతలో... ఏవో హాహాకారాలు... ఆర్తనాదాలూ విన్పించాయి.

ఆశ్చర్యంతో బయటికొచ్చి చూసింది గాయత్రి.

ఆ పక్కనుండి మొదలుపెట్టి గుడిసెల్ని కూల్చేస్తున్నారు కొందరు. రోడ్డుపక్కనే పోలీస్‌వేన్ ఉంది.

చాలా సహజంగా నవ్వుంకుంటూ తమపనితాము చేసుకుపోతున్నారు వాళ్ళు.

గుడిసెలమీద అట్టల్ని... ఎండిపోయిన తాటాకుల్ని... బద్దలైన కుండ పెంకుల్ని చెల్లాచెదురుగా పడేస్తున్నారు.

క్షణంలో ఆచోటు శ్మశానంలా అయిపోయింది.

గుడిసెల్లో జనంమాత్రం రోడ్డుపక్క కూర్చుని ఏడుస్తున్నారు.

మరికొందరు ఆవేశంతో శాపనార్థాలుపెడుతున్నారు.

గాయత్రి అటూ ఇటూ చూసింది సత్తెమ్మకోసం!

రోడ్డుపక్క చెట్టుకింద కూర్చుని ఏడుస్తోంది ఆమె.

ఎవ్వడూ ఇదేమిటని అడిగేవాడులేడు.

అన్యాయం అని అరిచే గొంతులేదు.

వినోదంచూస్తున్నారు కొందరు యువకులు.

అయ్యో! దేశమాతా! నీకొడుకుల్లో ఒక్కడంటే ఒక్కడు... వేడిరక్తం కలిగినవాడు లేడా?

"మాకే ఓటెయ్యండి___" అని ఆ గుడిసెలచుట్టూ నిన్నటిదాకా కుక్కల్లా తిరిగిన జనం— ఏరా? ఎక్కడచచ్చారా?..."

చూస్తుండగానే సత్తెమ్మ గుడిసెకూడా మట్టిలో కలిసిపోయింది. ఉన్న రెండు సత్తుగిన్నెలూ గాయత్రి బయటికుతెచ్చింది.

గాయత్రి నెమ్మదిగా సత్తెమ్మదగ్గరికి వెళ్ళింది.

"లే! మామ్మా! చేతులు నరికేసినట్లు ఏడుస్తావేంటి? రా! పోదాం! మనం ఇక్కణ్ణుంచి ఎక్కడికైనా వెళ్ళిపోదాం! ఎక్కడికెళ్ళినామనరెక్కలుమనకున్నాయి. నడు." అంది గాయత్రి.

ధైర్యం బజార్లో దొరకదు.

గుండెల్లో చిగురిస్తుంది.

ఆ నిస్సహాయస్థితిలోంచే... ఆ దెబ్బతిన్న మనస్సులోంచే ధైర్యం... తెగింపు పుట్టుకొస్తాయి.

ఈ అలజళ్ళకీ.... అస్తవ్యస్త జీవితానికి.. దూరంగా - తాను మసిల్దీ, తనబిడ్డా నిశ్చింతగా బతికే చోటికి....గాయత్రి పోవాలనుకుంది.

అసలలాంటిచోటు ... ఈ భూమ్మీద ఉందా?

మనిషిని మనిషి కొట్టుకుతినని నేల-

మనిషిని మనిషి దోచుకోనిఊరు-

మనిషిని మనిషి చంపుకోని భూమీ- ఈ లోకంలో ఉందా?

నిర్వికారంగా... సత్తెమ్మతో కలిసి రైలుఎక్కేసింది గాయత్రి.

## 11

ప్రతి రోజూ తూర్పుదిక్కు నొప్పులుపడుతుంది.

మందారంలాంటి బాలభాస్కరుణ్ణి ప్రసవిస్తుంది.

తూర్పుదిక్కు నిత్యప్రసూత! వీరప్రసువు!

సరిగ్గా....

తూర్పున తెల్లతెల్లని వెలుగురేకలు విచ్చుకొనీ విచ్చుకోని పారిజాతాల కాంతుల్ని విరజిమ్ముతున్నప్పుడు....

జగత్సాక్షి నవోదయానికి సముద్రకెరటాలు- ఆనందంతో మండలనృత్యం చేస్తున్న వేళ...

తొలి మలయపవనాలు వీచినవేళ...

గాయత్రి తల్లిఅయింది.

ఒక్క సత్తెమ్మతప్ప....

పలకరించేవాళ్ళులేరు!

అయ్యో! అనేవాళ్ళు లేరు.

ఓ మంత్రసానిలేదు-

ఈ లోకంలోకి అప్పుడే జారిపడ్డ.. ఆ సుధాకలశాన్ని గుండెకు హత్తుకునే వాళ్ళు లేరు.

రైల్వేస్టేషన్‌లోనే ఓవర్‌బ్రిడ్జికింద... ఎవరో జాలిపడిఇచ్చిన గుడ్డ ముక్క తెరగా అడ్డంకట్టి గాయత్రికి పురుడుపోసింది సత్తెమ్మ.

సృష్టిచక్రం.. అనాదిగా అలా తిరుగుతూనేఉంది. ఆ చక్రభ్రమణంలో..

వచ్చేవాళ్ళు ఈ కల్మషలోకంలోకి వస్తూఉంటే - పోయేవాళ్ళు ఏ పరసౌఖ్య మహర్లోకాలకి పోతున్నారో తెలియదు మరి.

ఆ చక్రానికి మొదలు-తుద ఎక్కడ?

పసికందు లేత చెంపలమీద గాయత్రి ముద్దుపెట్టింది - ధర్మరాజు గుర్తొచ్చాడు.

ఇన్నాళ్ళూ అదిమిపెట్టిన దుఃఖం కట్టలుతెంచుకున్న ప్రవాహంలా బైటికి దూకింది.

ఎక్కడున్నాడో? అసలున్నాడా? లేడా?

జనసముద్రంలోనికి వెళ్ళిన ధర్మరాజుని ఏ తిమింగలాలు మింగేసాయో! మాటేసిన ఏ దౌర్జన్యం కాటేసిందో?

ఊళ్ళోకెవెళ్ళిన సత్తెమ్మ తిరిగొచ్చేదాకా గాయత్రి ఏడుస్తూనేఉంది.

సత్తెమ్మ నూకలుకొని పట్టుకొచ్చి జావకాచి పోసింది

రైల్వేస్టేషన్‌లోని కుళాయినీళ్ళతోటే చంటాడికి స్నానంచేయించింది.

"పిల్లా! సముద్రంకాడ ఓ గుడిసె ఖాళీఅయిందట - నెలకి ఇరవైరూపాయలు అద్దెంట! అడకిపోదాం! వానకీ- సలికీ బుడ్డోడు తట్టుకోలేకపోతున్నాడు ఈడ" అంది సత్తెమ్మ.

నిజమే!

ఈ న్యాలోజులనించి గాయత్రిని అంటిపెట్టుకునేఉన్నాడు పిల్లాడు వాడికి కప్పుదామనుకుంటే మరో గుడ్డముక్కలేదు గాయత్రిదగ్గర.

ఈ వంతెనకింద అస్సలు రక్షణలేదు.

తలుపూ తడకా అడ్డంలేని ఈ చోట్లో -చివరికి ఏ కుక్కైనా పసిగుడ్డుని ఈడ్చుకుపోతుందికూడాను.

గాయత్రి చంటాణ్ణి బుజానవేసుకుని నిలబడింది.

* * * *

తెల్లవారుతోంది.

గతస్మృతిలోబడ్డ మనస్సుకి అస్థిమితంగాఉంది.

కుర్రాణ్ణి కాళ్ళల్లోవేసుకుని ఉగ్గుపడుతోంది సత్తెమ్మ.

ఈ సముద్రంఒడ్డున గుడిసెలోకి మారి అప్పుడే నెల్లాళ్ళుఅయింది.

పనిగురించి ఎప్పుడు మాటాడినా - "పనిగురించి అప్పుడే బెంగపడకు పిల్లా! ఏదో నూకలుకోసం దాచుకొన్న డబ్బులున్నాయ్. ఇంకా ఒళ్ళు పచ్చి ఆరకుండా ఏం పనిచెయ్యగలవ్" అంటూ సత్తెమ్మ గాయత్రి ప్రయత్నాల్ని ఆపుచేసేది.

చివరికి ఎల్లాగైతేనేం సత్తెమ్మని ఒప్పించి ఆఫీసర్స్ కాలనీలో ఇంటిపన్జేయడానికి ఒప్పుకుంది గాయత్రి.

అంట్లుతోమడం- పిల్లలికి నీళ్ళుపొయ్యడం- వాళ్ళని కాన్వెంటుకి దిగబెట్టి రావడం- ఇదీ పని! జీతం యాభై రూపాయలు.

అన్నం ఎప్పుడైనా మిగిల్తే పెడతారు.

ఆ యాభై రూపాయల్లో మూడుప్రాణాలు నిలబడాలి.

నూకలే కేజీ రూపాయన్నరదాకా అమ్ముతున్నారు.

ఆ మహానగరంలో పుల్లలు దొరకవ్ కిరోసిన్ అసలుదొరకదు.

పొయ్యి వెలిగించడమే పెద్ద ఇబ్బంది అయిపోతోంది.

అన్నింటికీమించి- ఆ ఇంటియజమాని చూపులు భరించడం మరీ కష్టంగా ఉంది గాయత్రికి.

పెళ్ళాం వంటపన్లోఉంటే- ఈయన తనచుట్టూ తిరుగుతాడు. ఏదోవంకని "గాయత్రీ" అంటూ పిలుస్తూనే ఉంటాడు.

తువ్వాలుఅనీ... సబ్బుఅనీ.... బాత్‌రూమ్‌లోంచి కేకేస్తాడు.

పట్టుకెళ్ళి ఇస్తే సగం తెరిచిన తలుపు సందులోంచి తనకేసిచూసి పళ్ళికిలిస్తాడు.

తాళికట్టించుకున్న పెళ్ళాంకూడా ఇలాంటి వెకిలివేషాలు సహించదే. గతిలేని పరాయి ఆడది మగాడికి ఇంతలోకువా?

మళ్ళీ పెళ్ళాం ఏమైనా అనాకారాఅంటే- కుందనబ్బొమ్మే!

ఈ మగాళ్ళకి ఇదో రోగంఏమో అనుకుంది గాయత్రి.

గిన్నెలు తోముతుంటుంటే తలుపుచాటుగా ఉండి తనని దొంగచూపులు చూస్తూనే ఉంటాడు.

ఆ చూపులు ఎలాఉంటాయంటే - నిప్పురవ్వల్లా కట్టుకున్న గుడ్డల్ని కాల్చేసి తన శరీరాన్ని బొబ్బలెక్కిస్తున్నట్టుంటాయి.

రోజులు గడుస్తున్నాయి భారంగా.

చంటాడు పాకడం మొదలుపెట్టాడు.

పదిమందిని పెంచినతల్లి- సత్తెమ్మ చేతిలో బాగానే పెరుగుతున్నాడు వాడు-

ఆరోజు సాయంత్రం——

"అమ్మగారూ!"

తలుపుతోసి లోనికివెళ్ళింది గాయత్రి.

ఇంటియజమాని టేప్‌రికార్డర్‌లో పాటలువింటున్నాడు హాల్లో.

"అమ్మగారు లోపలుంది-" అన్నట్లు చెయ్యి ఆడించాడు ఆయన! తిన్నగా లోపలికెళ్ళింది గాయత్రి.

వీధితలుపు గడియపెట్టిన చప్పుడువినిపించి గిరుక్కున వెనక్కితిరిగింది గాయత్రి.

జరగబోయే ఘోరం క్షణంలో పసిగట్టింది.

కానీ ... ఏంచెయ్యాలి?

"గాయత్రీ!"

అతని కళ్ళల్లో కోర్కె మండిపోతోంది మరీదగ్గరకొచ్చి నిలబడ్డాడతడు.

"గాయత్రీ! అమ్మగారూ పిల్లలూలేరు ఊరెళ్ళారు. ఇక్కడికెవరూ రారు. భయంలేదు. రా."

గాఢతమకంతో చెయ్యిపట్టుకున్నాడాయన.

గాయత్రి ఒక్కసారి అతడి చెయ్యి విదిలించింది.

ఆమె పెదవులు కోపంతో కంపించసాగాయి.

"ఆగు. కూటికోసం నీయింట్లో పనిచెయ్యడంవల్ల నీకులోకువయ్యాగదూ? ఒక్కడుగు ముందుకేస్తే నీప్రాణాలు దక్కవ్. ఈగదిలోంచి ఇలాగే పోలీస్ స్టేషన్‌కువెళ్ళి నీమీద రిపోర్టుజేస్తా. అంతేకాదు .. అమ్మగారు రాగానే... ఈ ఘోరంఅంతా చెప్తా."

అతడు కొంచెం వెనక్కి తగ్గాడు.

"ఏదో .. నీకూ మగతోడులేదుకదా అని ..." అంటూ నసిగాడు.

"ఏం మగాడులేకపోతే ఆడది బతకలేదా? పాపం .. నామీద ఎంత జాలి? మర్యాదగా వెళ్ళి తలుపుతియ్యి. లేదా.."

"తీస్తా .. తీస్తా...."

అతడు కంగారుపడుతూ వెళ్ళి తలుపు తెరిచాడు.

గాయత్రి ఇంట్లోంచి బయటపడుతుంటే అతడన్నాడు "—గాయత్రీ... అమ్మగారితో .. చెప్పకు...ప్లీజ్!"

గాయత్రీ నడుస్తూ ఆలోచించసాగింది.

ఛీ! ఏం ప్రపంచం?

ఎక్కడ చూసినా కాటెయ్యడానికి సిద్ధంగా ఉన్న పాములే!

పంజా విసరడానికి మాటేసిన పులులే!

కూలి కోసం ...కూటికోసం ... వెదుకులాడుకునే తనలాంటి ఒంటరి ఆడది ఈ లోకంలో బ్రతగ్గలదా?

అయితే ...ఎలా? ఎలా?

## 12

చంటాడు ఏదైనా ఆసరా పట్టుకుని నిలబడుతున్నాడు.

వాడికప్పుడే ఏడాది వెళ్ళింది.

శరణాలయంలో 'ఆయా' కావాలని తెలిసింది గాయత్రికి.

సర్వానంద బాబా స్థాపించిన శరణాలయం అది.

సమాజం సెక్రటరీ సరోజినిని కలిసింది గాయత్రి.

సరోజిని వేషం అత్యంతాధునికంగా ఉంది.

గాయత్రి కథంతా విని ఆవిడంది.

"మాకు ఆయా కావాలి నిజమే! అయితే వెనకాల ఏ బాదర బందీలు లేని వాళ్ళే మాకు కావాలి. పిల్లల్ని ప్రేమగా చూసుకోవాలి."

గాయత్రి తలూపింది.

"మరో సంగతి! ఆశ్రమం విషయాలు పెదవిదాటి వెళ్ళడానికి వీల్లేదు. ఇక్కడ చూసిన ఏ విషయం అయినాసరే ఇక్కడే మరిచిపోవాలి. తెలిసిందా?" అంది సరోజిని.

గాయత్రి అలాగే అంది.

"సాయంత్రం సర్వానందబాబా దర్శనం చేయిస్తాను. రేపు పనిలో జేరుదువు గాని-" అంది సరోజిని.

సాయంత్రం కాగానే సరోజిని గాయత్రికి కబురంపింది.

ఇద్దరూ కలిసి దగ్గరగా వున్న మేడలోకి వెళ్ళారు.

ఆ భవనాన్ని చూస్తే గాయత్రికి ఆశ్చర్యం కలిగింది.

ఖరీదయిన తివాచీలూ, పాలరాతి గచ్చూ...గోడలనిండా శృంగారభరితమైన కళాచిత్రాలు! అన్నీ ఎయిర్ కండిషన్డ్ రూంలు!

"సన్యాసుల నివాసంలో ఈ దేవేంద్ర భోగాలేమిటో!" అనుకొంది గాయత్రి.

సర్వానందబాబా పచ్చ దబ్బపండైన ఛాయతో మెరిసిపోతున్నాడు.

సరోజినినీ, గాయత్రినీ చిరునవ్వుతో ఆహ్వానించాడు.

"మన శరణాలయంలో పిల్లలకి నీళ్ళూ పాలూ చూడ్డానికి ఈఅమ్మాయిని కొత్తగా వేసుకున్నాం - పేరు గాయత్రి" అంటూ పరిచయం చేసింది సరోజిని.

గాయత్రి నమస్కారం చేసింది

గాయత్రిని చూసి చిరునవ్వుతో తల పంకించాడు సర్వానందబాబా.

ఎందుకో ఆ నవ్వు నచ్చలేదు గాయత్రికి

గాయత్రి చెవిలో చెప్తున్నట్లు మెల్లగా అంది సరోజిని.

"నువ్వెళ్ళి రేపట్నుంచి పన్లోకి రా!" నేను బాబాతో ముఖ్యమైన విషయాలు మాట్లాడి తర్వాత వస్తా. నువ్వెళ్ళు-" అంది సరోజిని.

మర్నాటినుంచే గాయత్రి శరణాలయానికి వెళ్ళడం మొదలుపెట్టింది.

ఉదయం సాయంత్రం పిల్లలందరికీ స్నానాలు చేయించడం - వాళ్ళకి ఉప్మా పాలూ ఇవ్వడం గాయత్రి పని.

కాస్త పెద్ద పిల్లలు వాళ్ళ పన్లు వాళ్ళే చేసుకుంటారు.

మరీ చిన్నపిల్లలకే గాయత్రి అన్ని పనులూ చూడాలి.



శరణాలయంలో పనిచేసే మిగిలిన ఇద్దరూ కూడా స్త్రీలే.

గాయత్రి తేలిగ్గా నిట్టూర్చింది,

"ముఖ్యంగా మగవాళ్ళవల్ల ఇక్కడ ఏ ఇబ్బందియూ ఉండదు" అనుకొంది గాయత్రి.

బాబా దగ్గరకి ఎప్పుడెవరో బాగా ధనవంతుల్లా ఉన్నవాళ్లు వస్తూ వుంటారు. వాళ్ళు బాబాతో రహస్యంగా ఏదో చర్చించుకొని వెళ్ళిపోతారు.

ఆశ్చర్యం ఏమిటంటే నడిచివచ్చే భక్తుడు ఒక్కడూ లేడు ఆ బాబాకి.

అక్కడ కొచ్చేవాళ్ళందరూ విలాస జీవితం గడిపేవాళ్ళలాగే కనబడతారు.

కష్టపడకుండా లక్షలకి లక్షలు-కోట్లకి కోట్లు సంపాదించాలనే తాపత్రయం ఉన్నవాళ్లే అక్కడికి చేరతారు.

అయినా బాబా గొడవ నాకెందుకు? ఆయన శిష్యులూ-ఆయనా ఎలాంటివారయితేనేం?

తన 'ఈసు' ఎత్తేవాళ్ళు ఇక్కడ లేరు.

రోజులు నిశ్చింతగా దొర్లిపోతున్నాయి.

పొద్దుతిరుగుడు పువ్వుల్లాంటి ముద్దుగొలికే పసిపిల్లల్తో కాలక్షేపం—గాయత్రికి మనశ్శాంతినిస్తోంది.

ఆ పిల్లల్ని చూసినప్పుడల్లా గాయత్రికి అనిపిస్తుంది ...ఎవరు చేసిన పాపానికి ... ఈ ముద్దమందారాలు అనాధలయ్యాయో! తన కొడుకు కూడా అంతేనా?

ఎప్పుడూ కాదు! తానుండగా వాడెందుకు అనాధ అవుతాడు?

ధర్మరాజు కనబడకుండా పోవడానికి - తన బ్రతుకు ఇన్ని మలుపులు తిరగడానికి కారణం విధి! అంతే!" అనుకొంది గాయత్రి. అయితే - వక్రించిన విధిని ఎదిరిద్దామనుకునే గాయత్రి ప్రయత్నిస్తోంది.

ఆ ప్రయత్నంలో తన విశ్వాసం కొడిగొట్టకుండా చేసిన మనిషి.... బతుకుమీద ప్రేమని చిగురింపజేసిన వ్యక్తి-సత్తెమ్మ!

"మామ్మ లేకపోతే ఏనాడో తన జీవితం సమాప్తం అయ్యేది" అనుకొంది గాయత్రి.

బాబా ఏడాదికి నాలుగు నెలలు మాత్రం ఈ దేశంలో ఉంటాడు మిగిలిన ఎనిమిది నెలలూ విదేశాల్లో తన ఆశ్రమాల్లో ఉంటాడు.

బాబా ఎక్కడికి వెళ్ళినా ప్రముఖుల స్వాగతాలు, ఖరీదయిన విందులూ జరుగుతాయి.

గాయత్రి మొదట్లో చాలా ఆశ్చర్యపోయింది.




సన్యాసి అయిన బాబాకు ఈ విలాసాలమీద మోజెందుకో?

ఈ కార్లూ, విమానాలూ, కోటీశ్వరులు జరిపే పాదపూజలూ...ఇవన్నీ ఏమిటో?

బాబా బ్రాంచీల్లో ప్రతిచోటా ఒక అనాధ శరణాలయం, పాఠశాలా ఉంటాయట!

వాటి నిర్వహణ కోసం అంటూ బాబా శిష్యులు వేలమీద విరాళాలు ఇస్తారు. అయినా శరణాలయంలోని పిల్లలికి పాలడబ్బాలు సరిపోవు - నాసిరకం నూకల్తో వండిన జావే పోస్తారు.

రెండే జతల గుడ్డలు మురికితో ఉంటాయి అవే కట్టుకొంటారు సంవత్సరమంతా.

ఆశ్రమ నిర్వహణ అంతా సరోజినిదే!

బాబా పేరుమీద ఆవిడే అన్ని పన్లూ పురమాయిస్తుంది.

ఆమె భర్త సైన్యంలో ఆఫీసరట.

పిల్లలికి పాలు కలుపుతుంటే సరోజిని దగ్గఱనుండి కబురు వచ్చింది గాయత్రికి.

వెళ్ళింది గాయత్రి.

"రా గాయత్రీ! నీకో శుభవార్త చెప్తామని రమ్మన్నాను. సర్వానంద బాబాగారి పుట్టినరోజు కానుకగా మన సంస్థలో పనిచేసే వాళ్ళందరికీ యాభై రూపాయల చొప్పున జీతాలు పెంచాను."

"చాలా సంతోషమండి"

"మరో ముఖ్య విషయం ఏమిటంటే బాబాగారి పుట్టినరోజు మరో నాల్రోజుల్లో జరగబోతోంది. ఈ మధ్య బాబా తన పుట్టినరోజు పండగ విదేశాల్లో చేసుకొంటున్నారు. శిష్యుల కోరికపై ఈ యేడు ఇక్కడే జరుపుకోడానికి అంగీకరించారు. అందుచేత ఈ నాల్రోజులు నువ్వు ఇంటికి పోవడానికి కుదరదు ... రాత్రీ పగలూ ఇక్కడే ఉండిపోవాలి. తప్పదు ..."

గాయత్రికి గుండెల్లో రాయి పడింది.

నాల్రోజులు ఇంటికి వెళ్ళకుండా వుంటే ఎలా?

మామ్మకి అసలే ఓపిక లేదు. కుర్రాణ్ణి సముదాయించలేకపోతోంది ఈ మధ్య. 'అదిగో-ఇదిగో' అంటూ ఎలాగో సాయంత్రందాకా గడుపుతుంది వాడి అల్లరి భరిస్తూ.

"ఇంటికి వెళ్ళకపోతే చంటాడు గోల పెట్టేస్తాడండి" అంది మెల్లగా.

సరోజిని నిష్ఠూరంగా అంది: "అందుకే వెనకాల ఏ బాదరబందీ లేని వాళ్ళకే ఇవ్వాలనుకుంటాం ఇక్కడ ఉద్యోగం. ఉద్యోగం ఇచ్చేముందు సరేనంటారు. అవసరమైన రోజుల్లో ఏదో వంక చెపుతారు."

గాయత్రి మాట్లాడలేదు.

అదీ నిజమే! ఈ ఉద్యోగం లేని రోజుల్లో తాను ఎంత కష్టపడింది. ఏదో ఇక్కడ పని దొరికాక - తిండికి బట్టకి లోటు లేకుండా సాగిపోతోంది జీవితం.

అవసరమైనప్పుడు తమకు పూర్తిగా సహకరించాలని వాళ్లు అనుకోవడంలో ఆశ్చర్యం ఏముంది?

గాయత్రి అంది సరోజినితో: "మీరు చెప్పినట్టే చేస్తా ఈరోజు మాత్రం ఇంటికెళ్ళి మామ్మకి కనిపించి వచ్చేస్తానండి."

"గుడ్ గర్ల్" సరోజిని నవ్వుతూ అంది.

ఇంటికెళ్ళి జరిగిన సంగతంతా సత్తెమ్మకి చెప్పింది గాయత్రి.

సత్తెమ్మ సంశయిస్తూనే అంది - "పిల్లాణ్ణి నాల్రోజులుపాటు నేన్జూడలేనే పిల్లా! నాకా చూపు ఆనదు .. పైగా ఓపిక లేదు...."

గాయత్రి బతిమాలుతూ అంది-"మామ్మా! ఈ ఒక్కసారికి ఎలాగో

కష్టపడు. ఈ నా్రలోజులూ అక్కడ ఉండకపోతే....ఈ ఉద్యోగం పోయినా పోవచ్చు. కాదనకు....చచ్చి నీ కడుపున పుడతా..."

"మరీ అంత బతిమాలాలేవిఁటే! ఏదో మాట వరసకన్నాను అంతే! ఎళ్ళిరా! వీణ్ణి నేన్జూసుకుంటాలే" అంది సత్తెమ్మ.

మర్నాడు గాయత్రి శరణాలయంలోకి వచ్చేసరికి అక్కడంతా కలకలంగా ఉంది.

రాత్రంతా బాబా శిష్యులు నిద్రలేకుండా పనిచేసి ఆశ్రమ ప్రాంతాన్ని బాగా అలంకరించేసారు.

గేటునుండి ఆశ్రమందాకా రంగు రంగుల విద్యుద్దీపాలు ఏర్పాటు చేసారు.

హోమగుండాల కోసం అక్కడక్కడ భూమిని తవ్వారు లోతుగా.

షామియానాలు వెలిసాయ్.

భక్తులు ఎక్కడెక్కణ్ణుంచో కుటుంబ సమేతంగా రావడం మొదలు పెట్టారు. ఖరీదయిన కార్లలో వచ్చి వాలుతున్నారు.

గాయత్రి వాళ్ళందరికీ అతిధి సత్కారాలకోసం నియమించబడింది.

సర్వానందబాబా పుట్టిన్రోజు రానేవచ్చింది.

ఆ రోజు....తెల్లవారుజామునుండే భక్తిగీతాలు మంద్రంగా వినబడుతున్నాయి ఆశ్రమంలో.

ఎవడో-కేంద్రమంత్రి ఆనాటి ఉత్సవాలకి ముఖ్యఅతిథిగా హాజరయ్యాడు.

వచ్చీ రాగానే ..."బాబా...బాబా...." అని కలవరిస్తూ ఆశ్రమం లోనికి పోయాడు.

జరగబోయే మంత్రివర్గం మార్పుల్లో ఆయనకి ఉద్వాసన చెపుతారేమోనని ఆయన భయం ఇప్పుడు.

అందుకే బాబా అనుగ్రహం కోసం పరితపించిపోతున్నాడు ఆయనిప్పుడు.

ఆశ్రమ ప్రాంగణంలో వేదికపైన....మంత్రివర్యులు బాబాపక్కన ఆశీనులయ్యారు.

వేదికపై ఎవరెవరో మాట్లాడుతున్నారు.

బాబానీ .. అయన ఆధ్యాత్మిక సంపత్తినీ స్తుతిస్తున్నారు.

భారతదేశం ఉనికికి బాబాయే మూలస్థంభం అంటున్నారు.

గాయత్రికి తలపోటుగా ఉంది.

ఈ మూడు రోజులనుంచీ నిద్రలేదు. రాత్రంతా ఆశ్రమాలంకరణలో గాయత్రి కూడా పాల్గొనక తప్పలేదు.

గుడిసెలో మామ్మ ఏం తిప్పలు పడుతోందో కుర్రాడితోటి.

యజ్ఞగుండం దగ్గర బాబా ఆయురారోగ్యాలకై హోమం జరుగుతోంది.

గాయత్రికి 'బుక్‌స్టాల్' నిర్వహించే పని అప్పగించింది సరోజిని.

ఆ స్టాల్‌లో బాబా ఫొటోలు - చాలా ప్రవచనాలు ఇంకా ఇంకా... ఇలాంటివే బాబా సాహిత్యం ఉంది.

ఆశ్రమంలోకి వచ్చేవాళ్ళు ముందుగా బుక్‌స్టాల్ సందర్శించి ఏవేవో పుస్తకాలు కొంటున్నారు.

పుస్తకాలకన్నా ...నిజం చెప్పాలంటే బాబా ఫొటోలే ఎక్కువగా అమ్ముడైపోతున్నాయి.

"ప్లీజ్ గివ్ మి ఏ బాబా ఫోటో!"

తలెత్తి చూసింది గాయత్రి ఆ యువకునికేసి.

"ధ . ర్మ...రాజు!"

ఓ వంద తుఫానులూ - ఓ వెయ్యి పేలిన అగ్ని పర్వతాలూ - ఓ లక్ష శతఘ్నులూ .. గుండెల్లో విజృంభించి - పేలి - సమస్త భూమండలం ధూళిగా పైకెగసి గాయత్రిని కప్పేసినట్లు తన హృదయపు ఎడారిలో అణుశక్తిని పరీక్షించగా .. ఆ హృదయం ...

శకావికలై —

చీలికలై —

పేలికలై ...

ఆ మహా నిర్ఘాతపాతజాతమైన మనస్సులోంచి - రౌద్రంగా .. దిగంతాక్రామిత ధ్వని తరంగ శకలాలై ... ఆశ్రమాన్ని పునాదుల్తో కదిలించినట్లు ... గాయత్రి కంఠంనుండి వెలువడింది ఓ కేక!

"ఒరేయ్ ...ధర్మరాజూ!"

వేదికపై ఉపన్యాసం ఆగిపోయింది.

యజ్ఞగుండం దగ్గరి వేదధ్వని మూగబోయింది

ఓ లిప్తకాలం ఆశ్రమమే స్తంభించింది.

అతడు కాలిముందు పడగ విప్పిన కాలనాగుని చూసినట్లు భయంతో ఒక్కడుగు వెనక్కేసాడు.

గాయత్రి .. ఈ మహానగరంలో ...

ఇక్కడ .. ఇలా ....

ఎలా? అవతరించింది??

అతని మనస్సు మొద్దుబారిపోయింది. భయంతో మొహం వెల వెలపోయింది.

అతని ప్రక్కనున్న అమ్మాయి జరుగుతున్నదేవిఁటో తెలియక "ఏవిఁటి? ఏం జరిగింది?" అన్నట్లు ధర్మరాజుకి సౌంజ్ఞలు చేస్తోంది.

"ఏరా?

గాయత్రి ఇక్కడికెలా వచ్చిందని చూస్తున్నావ్ గదూ?

నేను గాయత్రినేరా!

డబ్బు కోసం ...లక్షల ఆస్తికోసం ...నన్నొదిలి పారిపోయావ్ కదూ? నువ్వేదో... అయిపోయావనీ — ఎక్కడో దౌర్జన్యానికి బలైపోయావని ఈ క్షణం....ఈ క్షణందాకా నిన్ను తల్చుకుని జాలిపడుతున్నాన్రా! నువ్వు చెప్పినట్లే... రెక్కల్ని నమ్ముకుని. . బతుకుతున్నాన్రా!

నీతిగా....నిజాయితీగా బతుకుతున్నాన్రా!

నువ్ మాత్రం .. నన్ను ఈ ఊబిలోకి దింపి... డబ్బు కోసం ఈ మూగిపిల్ల మెళ్ళో మూడుముళ్ళు కట్టి...విలాసంగా బతుకుతున్నావ్!

నీలాంటి-

పయోముఖ విషకుంభాల్ని-



నీలాంటి-

మేకవన్నె పులుల్ని - బ్రతకనివ్వకూడదురా! బతకనివ్వనా! చెప్పరా! నన్నెందుకు తీసుకు వచ్చావ్! ఎందుకు నాలో ఆశల్ని రేపావ్! నన్నెందుకు తల్లిని జేసి పారిపోయావ్??

చెప్పు! నన్నెందుకు వంచించావ్??"

ఆవేశంతో....మాటలు తడబడుతూంటే....

ఆక్రోశంతో గొంతు వణుకుతుంటే....

పరిసరాల్ని...బలాన్ని...సమాజాన్ని....ఏమీ గమనించని....గమనించలేని....ఉన్మత్తమూర్తియై గాయత్రి మెరుపులా దూకి ధర్మరాజు చొక్కా పట్టుకొంది.

ధర్మరాజు పెళ్ళాం మూగిపిల్ల ఈ సంరంభం ఏమిటో తెలియక బిత్తరపోతోంది.

ఆశ్రమం అంతా విభ్రాంతితో చిత్తరువైపోయింది.

సరిగ్గా అదే సమయంలో...

గాయత్రి చేతుల్ని పట్టుకున్నాయ్ రెండు చేతులు కర్కశంగా....

తలతిప్పి చూసింది

పోలీసులు!

అవి దీనుల్ని రక్షించే భటుల హస్తాలు కావు ...చట్టాల్ని రక్షించే భటుల హస్తాలు మాత్రమే!

"... ఆ చేతులు గాయత్రిని వేన్ దగ్గరికి ఈడ్చుకుపోతున్నాయ్.

ఒరేయ్... ఈ రోజు... కాకపోతే .. రేపు .. ఎప్పుడయినా సరే...

వస్తానా... నిన్ను ...నిన్ను ...నీ అంతం...

చూస్తానా... నాలాంటి కన్నెపిల్లల్ని...

మోసం చేసిన...నిన్ను....

బ్రతక ....నివ్వనా

నీ అం ...

తు... "

గాయత్రి కేకలు వేన్ చప్పుడులో కలిసిపోయాయ్!

ధర్మరాజు ...చొక్కా సర్దుకుని.... చెదిరిన క్రాఫ్ సరిచేసుకున్నాడు.... తేలిగ్గా నిట్టూర్చాడు.

"ఎవత్తో పిచ్చిది" సౌంజ్ఞ చేశాడు భార్యకి.

ఆ మూగిపిల్ల తేలిగ్గా విశ్వసించింది.

మరుక్షణంలో—

సమాజంలో ...అంతకుముందు అక్కడ ఏమీ జరగనట్లే - భజనలూ హోమాలూ జరిగిపోతున్నవి.

## 13

"నీ పేరేమిటి?"

"గాయత్రి"

"ధర్మరాజుగారు నీకు తెలుసా?"

"తెలుసు!"

"ఆయన నీకు ఎలా తెలుసు?"

"ఆయన నా భర్త!"

నవ్వులు! స్టేషన్ దద్దరిల్లేలా నవ్వులు

"నిన్నెప్పుడు పెండ్లి చేసుకున్నాడాయన?"

"రెండేళ్ళ క్రితం."

"మరయితే ఎందుకు వదిలేసాడు నిన్ను?"

"తెలియదు."

"ఎన్నాళ్ళు కాపురం చేసావు ఆయన్తో?"

"రెండు నెలలు "

"ఆయన ఎమ్మెల్యేగారి అల్లుడని తెలుసా?"

"తెలియదు."

లాఠీకర్ర ఫక్కుమని నవ్వింది.

ఖాకీబట్టలు గర్జించాయ్ రెజ్లైల్ల పెళ్ళాంలాటిది. పట్టుకు తన్నండ్రా లంజని.

బాగా డబ్బులున్నోణ్ణిచూసి - రోడ్డుమీద "వీడే నన్ను పెళ్ళిచేసుకుని వదిలేసాడు" అంటూ హంగామాచెయ్యడం ఇదో బాగోతం అయిపోయింది ఇలాంటి లంజలికి."

కేంద్రమంత్రి పర్యటనలో శాంతిభద్రతల స్థాపనకి అడ్డొచ్చి తమపరువు పోగొట్టడానికి ప్రయత్నించినదానిగా... కసిగా....

లాఠీలు ప్రళయతాండవంచేసాయి గాయత్రి ఒంటిమీద.

అలుపు వచ్చేదాకా-

పైశాచికానందం తీరేదాకా-

ఒకటి తర్వాత ఒకటిగా-

అన్నీ ఒక్కసారిగా...

గాయత్రి ఏడ్చేలా... స్పృహతప్పేలా... భూమ్మీదికి ఒరిగిపోయేలా...

లాఠీలు నిర్విరామ నృత్యంచేస్తూనే ఉన్నాయి.

గాయత్రి మెలుకువలోకొచ్చేసరికి...

అర్థరాత్రి... రోడ్డుపక్క పడిఉంది తనశరీరం.

ఆమె ఒళ్ళు పచ్చిపుండైంది.

కాళ్ళూ, చేతులూ వాచిపోయి కమిలినాయి.

దాహంతో నాలిక పిడచకట్టుకుపోతోంది.

ఆకాశంలో నక్షత్రాలూ భయంభయంగా గాయత్రికేసి చూస్తున్నాయి.

గాయత్రి లేచింది.

నెమ్మదిగా గుడిసెకేసి నడవసాగింది.

కుక్కలు మొరుగుతున్నాయి భయంకరంగా-

కాలుతీసి కాలు వెయ్యలేనంత బాధఅయిన అవస్థ.

ప్రతి అంగుళానికి ఎముక విరిగినట్టు... అసలు ఒంట్లో రక్తంకాదు... సలసలామరిగే నూనె ప్రవహిస్తున్నట్టు అనిపించింది గాయత్రికి.

"ఈలోకంలో ఎలా బ్రతకాలి.. తాను?

అన్యాయం అని అరిస్తే సానుభూతిచూపేవాళ్ళు లేరు- సరిగదా - అరిచే గొంతును పిసకడానికి మాత్రం చేతులుచాపుతున్నారు.

అక్రమాన్ని... నిలదీస్తే... "అయ్యో పాపం!" అనేవాళ్లు లేరు. కాని తిరగబడ్డవాళ్ళనే చంపుతుంది లోకం.

'నీతి-నిజాయితీ'లు పుస్తకాల్లో పదాలై పోతూయి.

పిచ్చాళ్ళ అరుపులై పోయాయి.

ఈ అడవిలో తాను బతగ్గలదా? ఈ ద్విజిహ్వాల విషపూత్కారాలా ఈ తోడేళ్ళ సహవాసాలూ... ఇంకా భరించగలదా తాను?

లోకం!

ఎదిరిస్తే గొంతు నులుముతుంది.

సహిస్తే కాలరాస్తోంది.

ఎలా? ఎలా బతకడం?

ఊహుఁ! ఇంక తాను బ్రతకలేదు. బ్రతక్కూడదు.

ఈ గాయత్రి కథ ఇక్కడితో ముగించడం మంచిది.

తడకతోసి గుడిసెలోపలికి చూసింది గాయత్రి.

గుడిసె ఖాళీగాఉంది.

ఏరీ మామ్మా? చంటాడు?

గుండె గుభేలుమంది గాయత్రికి.

"ఏడకిపోనావ్ పిల్లా?"

ప్రక్కగుడిసెలోని వీరమ్మ పలకరించింది వీరమ్మ వెనకాలే చంటాణ్ని భుజానవేసుకొని రావుఁడు బైటకివచ్చాడు.

"గోరం జరిగిపోనాది పిల్లా! మామ్మ సచ్చిపోనాది!

ఈనాల్రోజుల్నించీ.. టౌనంతా గాలిత్తున్నా... నీకోసం... నువ్వెక్కడుండేదో నాకు తెలవదు-" అన్నాడు రావుడు.

మామ్మ... చచ్చిపోయిందా?"

నిజంగా... నిజంగానే .. మామ్మ... చచ్చిపోయిందా?

సముద్రం ఒక్కసారే బుసకొట్టి విజృంభించి చెలియలకట్టదాటి-గుడిసెల్ని తనలో కలిపేసుకున్నట్లు - నిలుచున్న భూమిగ్రక్కదలి... ప్రక్కకు తప్పుకొంటున్నట్లు... అయింది గాయత్రికి!

రావుడు చెప్పుకుపోతున్నాడు.

"మూడ్రోజుల కితం . ముసిల్ది... '' ఒరే... రావుడా! జొరంవచ్చినట్లుందిరా! లేవలేను.. కాస్త ఈపూటకి బుడ్డోణ్ణి సూడండిరా!'' అంది నాకాడకి ఒచ్చి. తీరా సూత్తినా రేత్రికి జొరం ఎక్కువై పోనాది. మర్నాడు గవర మెంటు ఆసుపత్రి మందు పట్టుకొచ్చి ఏసినాం... లాభంలేకిపోనాది... ఆ రాత్రే ముసిల్ది పేనం ఒగ్గేసింది."

నీకోసం .. టౌన్లో తిరగని చోటులేదనుకో శవాన్ని రోజంతా అట్టే పెట్టినాం! ఏడున్నావ్ పిల్లా! ఇంటికొత్తే కడసూపన్నా దక్కేదిగాదా?

ఏంచేస్తాం! ఇదిగో తీసుకో బుడ్డోణ్ణి."

చంటాణ్ణి భుజంమీదకు తీసుకుంది గాయత్రి

ఆమెకళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"పిల్లోయ్! నూకళ్లేకపోతేసెప్పు... ఇత్తాను! మరి బాధపడకు. ఏడిత్తే పోయినోళ్ళు తిరిగొత్తారా?"

వేదాంతంచెపుతూ రావుడూ ఈరమ్మా గుడిశలోకి పోయారు.

తల్లిలా... తండ్రిలా.... అంతకన్నా ఎక్కువగా ఈ రెండేళ్ళు .. తనతో తిని.. తనకోసం.. తన బ్రతుకోసం అహర్నిశలు సాయపడిన మామ్మకి- తనేం చెయ్యగలిగింది?

కడసారి గొంతులో ఓ గుక్కెడు నీళ్ళు పొయ్యలేకపోయింది. అసలు తాను మనిషేనా? లేక రాబందునా?

ఇన్ని దెబ్బలు... ఒకదిపై ఒకటి భరించి బతుకుతూనేఉంది తాను! ఈ నిర్భాగ్యజీవితాన్ని ఇంక పొడిగించకూడదు.

మనస్సులో సత్తెమ్మని తల్చుకుని దండంపెట్టుకుంది గాయత్రి.

"మామ్మా! నన్ను క్షమించు! ఎల్లాగైనాసరే బ్రతకాలి! చచ్చిపోకూడదు'' అంటావు నువ్వు. లాభంలేదు. ఎలా బతకాలో నాకు తెలియడంలేదు.

నేనూ, చంటాడూ కూడా నీదగ్గరికే వచ్చేస్తున్నాం.

గాయత్రి హృదయం ఆక్రోశించింది.

చంటాణ్ణి భుజంపైనవేసుకొని బయటకు నడచింది గాయత్రి

పది అడుగులువేస్తే.. సముద్రం!

హోరుమంటూ.... పిలుస్తోంది.

"రండి! రండి! మీ బాధలన్నీ నాతోచెప్పుకోండి. నాలోకిరండి. క్షణంలో మిమ్మల్ని కష్టాలనుండి దాటిస్తాను— అంటున్నట్లు హోరుమంటున్న కడలి!

ఏనాటిముసలి ఈ కడలి?

ఎన్ని అభాగ్యజీవితాలకి- ఎన్ని నిరాశామయజీవితాలకి- ఎన్నిముక్కలైన వసంతాలకి- చరమగీతం జోలపాటపాడి తనఒడిలో నిద్రపోగొట్టిందో?

ఆ నిశ్శబ్ద నిశీధంలో... సముద్రాన్ని శాంతంగా చూస్తుంది గాయత్రి-

ఏడుస్తూ.. చంటాడి బుగ్గపై ముద్దుపెట్టింది.

వాడు కెవ్వున ఏడుపందుకున్నాడు.

పాదాల్ని తడుపుతోంది సముద్రతరంగం.

"రా! రమ్మం"టూ పాదాలకింద ఇసకని తవ్వి తొందర పెడుతోంది.

గాయత్రి అడుగు ముందువెయ్యడానికి ఉద్యుక్తమైంది.

"చచ్చిపోదామనుకుంటున్నారా! ఇంకా చూస్తారేం!

దూకండి సముద్రంలోకి-"

శాంత స్వరంతో పలికింది ఓ కంఠం.

గాయత్రి తలతిప్పిచూసింది.

ఎవరో యువకుడు ఇసుకతిన్నెపై కాళ్ళుముడుచుకుని కూర్చున్నాడు చీకట్లో అతనిముఖం స్పష్టంగా కన్పించలేదు గాయత్రికి.

చివరికి అపరిచితుడైన వీడికూ్కడా తాను లోకువైంది.

గాయత్రికి రోషంవచ్చింది.

"చచ్చిపోవాలనుకుంటే మిమ్మల్ని రక్షించను. నిరభ్యంతరంగా చచ్చిపోవచ్చు మీరు.. ఎందుకంటే నాకు కళ్ళులేవ్.'' అన్నాడతడు చిన్నగా నవ్వుతూ.

గాయత్రికి అతనిమాటలు విచిత్రంగా తోచాయి.

"రండి! ఓ రెండునిమిషాలు నాకోసం బ్రతకండి. తర్వాత హాయిగా చచ్చిపోదురుగాని... సముద్రం ఎక్కడికీ పారిపోదు."

గాయత్రికి ఆ మాటల్లో ఏదో ఆకర్షణ ఉన్నట్లు అన్పించింది. తనకు తెలియకుండానే తన కాళ్లు ఇసుకతిన్నెకేసి నడిచి అక్కడ కూలబడ్డాయ్.

"గుడ్! ఎందుకు చచ్చిపోవాలనుకుంటున్నారు?'' ఆ యువకుని మొహంలో నవ్వు విరుస్తోందా

"నేను జీవితంలో చాలాదెబ్బలుతిన్నాను.. నాకు బతకాలనిలేదు.

అతడు చిన్నగా నవ్వాడు..

"జీవితం... దెబ్బలు! అసలు ఏ దెబ్బలూ తినని జీవితం.... ఏ అవ రోధాలని ఎదుర్కొని జీవితం చప్పగాఉండదూ? ఆ జీవితంలో రుచేవుంటుంది?"

ఆ మాటలు గాయత్రిని విభ్రాంతురాల్ని చేసేయి.

మీపేరు?

"గాయత్రి!"

"గాయత్రిగారూ! పుట్టడం చావడంకోసమా? జీవితం అనుభవించడమంటే హాయిగాతిని- తాగీ.... భోగభాగ్యాల్ని అనుభవించడవేఁవా? అంతకుమించిన జీవితం ఇంకేవీఁలేదూ?

ఆలోచింపజేసే ప్రశ్నలు! ప్రస్తుతం ఆలోచించేశక్తి, ఆసక్తి రెండూలేవ్!

"ప్రతి జీవితానికి ఓ పరమార్థంఉంది. ఉంటుంది. ఆ పరమార్థం సుదీర్ఘ జీవితంలో ఏక్షణాన వికసిస్తుందో - కనిపిస్తుందో ఎవరు చెప్పగిలరు? చెట్టుగొడ్డలి దెబ్బలుతింటుంది. రాయి సుత్తిదెబ్బలు భరిస్తుంది. తాగా మనిషికి ఎదురుదెబ్బలు తగలవని ఎందుకనుకుంటున్నారు?"

గాయత్రి రోషంగా అడిగింది.

"ఓదార్చడం సులువే! జీవితంలో భంగపడ్డప్పుడు కానీ—"

"అబాధ తెలియదంటారు. అయితే నన్ను చూడండి.

"పుట్టుకతోటే నాకు చూపులేదు. చిన్నతనంలోనే అమ్మా నాన్నా చచ్చి పోయారు. నా అనేవాళ్ళు ఎవ్వరూలేరు-కటిక చీకటితప్ప? మరి నేను ఎందుకు బ్రతకడం చెప్పండి?"

గాయత్రి మనస్సు ఆ యువకునిఎడ సానుభూతితో నిండిపోయింది.

గాయత్రి ఒడిలో కుర్రాడు సన్నగా ఏడుస్తున్నాడు.

"మీ అబ్బాయా?"

"అవును."

"ఎంతవయస్సు?"

"రెండేళ్ళు"

"ఓ! ఇలాఇవ్వండి-" చేతులు చాపాడతడు.

పువ్వుని ఆఘ్రాణించినట్లు సుతారంగా చంటాడి బుగ్గమీద ముద్దుపెట్టాడు ఆ యువకుడు! తన ఒళ్ళో పడుకోబెట్టుకున్నాడు.

"మీకోసంగతి చెప్పాలనిపిస్తోంది." చల్లగాలి రివ్వున వీస్తోంది.

చెప్పండి!

"చిన్నప్పుడు అంటే నాకు పన్నెండు, పదమూడు ఏళ్ళున్నప్పుడు మానాన్న పోయాడు! వింటున్నారా??"

"ఊఁ చెప్పండి!"




"ఆయన అస్తమాట్లూ చెపుతూఉండేవాడు. ఆయన ఒక గొప్ప భక్తుడు! దేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ కాలినడకన తిరిగి దర్శించాడు. అప్పటికి రైళ్ళూ-కారులూ ఇంకా రాలేదుట: ఆ యాత్రలో ఎన్నోకష్టాలు!

ఒక్కోచోట అరణ్యంగుండా ప్రయాణం- కాటేసే పాములూ - పులులూ మధ్య రోజులతరబడి ప్రయాణంచేసేవాడుట. మరికొన్నిచోట్ల బందిపోట్లు - కట్టు కొన్న బట్టల్నికూడా విప్పించి డబ్బు దోచుకుపోయేవారుట! మరికొన్నిచోట్ల భయంకరమైన అంటురోగాలు.

ఎన్నో కష్టాలు- భరించి తరించి చివరికి వారి గమ్యమైన క్షేత్రాన్ని దర్శించేవారుట! అయితే ప్రయాణంలోపడ్డ క్లేశాలన్నీ స్వామిముందు చేతులు జోడించి నిల్చున్నప్పుడు గుర్తుకొచ్చేవికావుట. "జీవితంకూడా యాత్రనంటిదేరా అబ్బాయ్" అంటూ ఉండేవాడు ఆయన! నిజం కాదంటారా?

గాయత్రి మౌనంగా ఉండిపోయింది.

"మీరు ఎవరు?" మెల్లగా అడిగింది అతనిని.

"నేను ఎవరో తెలుసుకోవాలన్నదే నాయాత్ర! ఆ గమ్యంకోసమే కటిక చీకటిలో కాంతికోసం వెదుకుతున్నాను" అన్నాడతడు.

గాయత్రి సమాధానం అర్థమయ్యీ అర్థమవనట్లు తోచింది.

"ఇంతరాత్రి ఇక్కడ...."అర్థోక్తిలో ఆగిపోయిందామె.

"పగలూ రాత్రీ అనేవి మీకే.... నేను ఆ ద్వంద్వానికి అతీతుణ్ని!" చిన్నగా నవ్వాడు అతడు.

"అవును! నాకు తెలిక అడుగుతాను. మీరేవో ఎదురుదెబ్బలు తిన్నా నన్నారు. మరి వీడేంపొందాడు ఆఘాతంగాలు?"

స్థాణువైపోయింది గాయత్రి.

నిజవేఁ ఇంకా కళ్ళతెరిచి లోకంచూడనివాణ్ణే తనకడుపునపుట్టిన పాపానికి తల్లియయుండి... చంపుకోదల్చింది తాను! ఎంత ఘోరం!

ఆయువకుడన్నాడు- "మీరు జీవితంలో ఎవరిచేత ఎదురుదెబ్బలుతిన్నారో- ఏఏ వ్యక్తులు మీయెడ.. ఎల్లా ప్రవర్తించకుండాఉండే బాగుండునని మీరు అను కొంటున్నారో- వీణ్ణి మీ ఆశయాలకి అద్దంలా పెంచలేరూ? అదే గమ్యంలా మీ జీవనయాత్ర ఎందుకు కొనసాగించలేరు?"

చంటాణ్ణి గాయత్రి చేతుల్లో పెట్టాడు అతడు.

"అరెరె! ఇదేవిఁటి?"

తనకాళ్ళదగ్గర పెట్టిన పసికందు చిట్టిచేతుల్ని పట్టుకుని పైకెత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"నాకళ్ళు తెరిపించారు- నిజమైన బ్రతుకంటే ఏవిఁటో - ఎల్లాబ్రతకాలో చెప్పారు. కుర్రాడికి మీనోటిమీదుగా పేరుపెట్టండి. మీరుచెప్పినట్లే యాత్ర కొనసాగిస్తా ... ఎన్నికష్టాలు ఎదురైనాసరే."

గాయత్రి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆ యువకుడు ఒక్కక్షణం ఆలోచించాడు

సముద్రమోత విన్పిస్తోంది నిత్యచైతన్యశక్తిగా.

"సాగర్!... విద్యాసాగర్."

పసివాణ్ని ప్రేమగాస్పృశించి వెనుదిరిగి కాస్సేపటిలో కనుమరుగు అయినాడు అతడు.

గాయత్రి మళ్ళీ గుడిసెలకేసి తిరిగింది

ఇప్పుడు ఆమెలో పిరికితనంలేదు బేలతనంలేదు. భయమన్నది లేనేలేదు.

నిరనరానా ఉత్సాహం తెగింపు. ధైర్యం ప్రవహిస్తున్నాయి. జనారణ్యంలోకి ఈసారి ధైర్యంగా అడుగు పెడుతోంది.

తూర్పున వెలుగురేకలు విచ్చుకొంటున్నాయి.



## కార్టూనిస్టులకు సూచనలు !

- కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి
- ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !
- వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సంచిక సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం
- రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్ల కాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారుకూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జత చేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

సం॥

సీరియల్

# సృష్టి

## ఇచ్ఛాపురపు రామచంద్రం

### [గత సంచిక తరువాయి]

"ముందు జాగ్రత్త కోసం.... నీ భవిష్యత్తుకి భద్రతకోసం.. నువ్వు గర్భాశయాన్ని ఎవరిబిడ్డకు ఆశ్రియం కల్పిస్తున్నావో ఆమె భర్తకి, నీకూ మధ్య ఒప్పందం రూపంలో వ్రాయించాను దయామయీ. ఇది - నీకేమంచిది. రేపు - ఎవరూ మాట తిరగకుండా.... ఎదుటి వారికి అన్యాయం చేయకుండా. చదవమంటావా, "చదువుకుంటావా?" చేతిలో కాగితాలు పట్టుకుని అలిస్.

అది. ఆమె ప్రయివేట్ రూమ్. ఎవరూ రాకుండా జాగ్రత్త పడిందామె. అలిస్.... దయామయి.... సుషమ ... తప్ప ఎవరూ లేరు. ఇప్పుడప్పుడే రారుకూడా.

"మీరే చదవండి."

ఆ మాటకి అలిస్. గిల్టీగా ఫీలయింది. ఎందుకంటే.... ఈ వొప్పందం నిజంగా ఆమె దయామయి క్షేమంకోరి వ్రాయించలేదు. ఎక్కువగా జయదేవ్ కోరిక తీరేలాగే వ్రాయించింది. ఒక విధంగా యీ అగ్రిమెంట్ దయామయిని పదినెలలపాటు బంధించి ఉంచుతుంది. ఆమె — వెనక్కి వెళ్లే మార్గాలన్నిటినీ మూసివేస్తుంది. ఆమెకెంత డబ్బు లభించినా —స్వేచ్ఛ మాత్రం కరువౌతుంది. ఏంచేస్తుంది తను? తనని మొదటి నుంచీ ప్రభావితం చేస్తున్నవాడు జయదేవ్. అతని క్షేమం కంటె ఎక్కువగా దయామయి క్షేమాన్నెలా కాంక్షించ గలదు తను? సుషమ చేత వ్రాయించిన అగ్రిమెంటు ఎక్కువ అనుకూలంగా ఉండేదతనికే. అందుకే — అదీ చదివి వినిపించడమంటే— అన్యాయమేమో అనిపిస్తూంది.

"స్థూలంగా విషయం చెబుతాను. సంతానం కలగక ఆత్మహత్య చేసు కుందుకు నిర్ణయించు కున్న పద్మ— జయదేవ్ భార్య, భర్త పరారీకాగా పిల్లలను సక్రమంగా పోషించుకోలేక.... వారిని చంపి తనూ చచ్చిపోవాలని సిద్ధమయిన దయామయి. పద్మ తరఫున ఆమె భర్త — జయదేవ్‌కి — దయామయికీ జరిగిన వొప్పందం యిది...."

దయామయి... ఏమీ అనలేదు. మౌనంగా....గంభీరంగా.... వింటూంది. ఆమెకళ్లు చెమర్చుతున్నాయి. ఏ గతం.... భర్తతో [illegible]— జ్ఞాపకం వొస్తున్నాయో!

"ఇంతవరకూ— అసత్యమేమీ లేదుకదా?"

లేదు. అంతానిజమే అన్నట్లు తల ఊపింది.

"పద్మ— ఇన్ ఫాన్‌టైల్ యుటేరస్ వల్ల - బిడ్డలను కనటానికనర్హురాలు. పిండం— పెరిగేందుకామె గర్భాశయం ఆశ్రయమివ్వగలిగేంత విశాలంకాదు. అయినా.... ఆమె అండాన్ని విడుదలచేయగలదు. జయదేవ్ సెమెన్‌లోని స్పెర్మ్‌తో జోనా ఆ అండంతో కలసి, ఫెలోపియన్ ట్యూబ్స్‌లో పిండమూకాగలదు. సమస్యంతా — తరువాతే.

• పద్మా జయదేవ్‌ల శుక్రశోణితాల సంయోగ ఫలితంగా— టెస్ట్‌ట్యూబ్‌లో ఏర్పడిన జైగోట్‌కు తన గర్భాశయంలో ఆశ్రయమిచ్చి.... పెంచి.... తగు సమయంలో ప్రసవించి.... ఆ శిశువుని.. పద్మా జయదేవ్‌ల సంయోగ ఫలమని చెప్పదగిన ఆ శిశువుని... వారి కప్పగించేందుకు— దయామయి

గృహనిర్వహణ కవసరమయిన ఆర్థిక సహాయం కోసం.... తనూ పిల్లలూ సుఖంగా జీవించడం కోసం — యిప్పుడు లక్ష రూపాయలూ.... శిశువుని ప్రసవించి అందజేసిన వెంటనే మరొక లక్ష రూపాయలూ.... జయదేవ్ నుండి స్వీకరించడానికి.... తాను తన గర్భంలో వారి పిండాన్ని పెంచి నందుకు ప్రతిఫలంగా తీసుకుందుకు — తన సంపూర్ణాంగీకారం తెలుపుతూ వ్రాయించి యిస్తున్న పత్రమిది.

ప్రస్తుతం లక్ష.... ప్రసవానంతరం మరో లక్ష.... తీసుకుంటున్నందుకుగాను— దయామయి.... ఈనాటి నుంచీ. ప్రసవించి- వైద్యులు అనుమతించే వరకూ సకల సదుపాయాలతోనూ కూడిన నర్సింగ్ హోమ్‌లో.... వైద్య పర్యవేక్షణ క్రింద ఉండటమూ; వైద్య పరీక్షలకూ ప్రక్రియలకూ సంపూర్ణంగానూ మనస్ఫూర్తిగానూ.... శారీరకంగానూ సహకరించడమూ; ప్రసవించిన తక్షణమే శిశువుని పద్మా జయదేవ్‌లకు శాశ్వతంగా ధారాదత్తం చేయడమూ; తన గర్భంలో పెరుగుతున్న పిండానికి హాని కలిగించే పనులేవీ చేయకుండా జాగ్రత్తగా ఉండడమూ.... వీటి కంగీకరిస్తూ వ్రాయించి యిస్తున్న పత్రమిది....

దయామయి కళ్ల వెంట ధారాపాతంగా కారుతోంది కన్నీరు. ఆమెకు.... ఎందుకో తెలియని భయం.... ఏదో విచారం....

"దయామయీ!" జాలిగా చూసింది సుషమ.

ఆమె కనులు తుడుచుకుంది. "ఏమీలేదు, కానివ్వండి.... అనేసింది.

"టెస్ట్‌ట్యూబ్‌లో ఏర్పడిన.... నాలుగు వారాలుపెరిగిన.... పద్మా జయదేవ్‌ల పిండాన్ని .... తన గర్భాశయంలోకి అనుమతించి.... పెంచి.... వారికి— ప్రసవించి అందజేసే పవిత్ర బాధ్యతను నిర్వర్తించి - ప్రతిఫలం తీసుకోడయే తప్ప - అనంతరం ఆ బిడ్డమీద తనకే విధమయిన అధికారాలూ ఉండవనీ, హక్కులుండవనీ.... మనస్ఫూర్తిగా అంగీకరిస్తూ.... తనూ తన

పిల్లల క్షేమం దృష్ట్యా— సంతకం చేస్తున్న అగ్రిమెంటు యిది. జయదేవ్—షరతుల నతిక్రమించి— రెండు లక్షలూ- ప్రసవించేసరికి యివ్వక పోయినా.... దయామయి నిబంధనల నుల్లంఘించినా...."

"ఆపెయ్యండి డాక్టరు. చాలు...." ఏడ్చింది ఆమె.

"దయామయీ!" జాలిగా పిలిచింది ఆలిస్.... "ఇలాగ వ్రాయించడం - నీ కోసమే. నీ పిల్లలకి మ ం చి చదువు..., పోషణ.."

"ఔను. అందుకే.... ఎక్కడ సంతకం చేయాలో చెప్పండి. చేసేస్తాను." "బాధపడుతున్నావా! ఇటువంటి విషయాలు కాగితం మీద ఉండడమే ఉభయ పక్షాలకూ శ్రేయస్కరమని.... నిజానికి - మంచి మనిషి కొకమాట. కాని.... ఈ రోజుల్లో మనుషుల మాట కంటె - కాగితం మీది అక్షరాలకే స్థిరత్వమూ శక్తి అధికం. ఎట్టి పరిస్థితుల్లోనూ - నీ రెండు లక్షలకీ ఢోకా లేకుండా ఉండాలని...."

చివ్వున తలెత్తింది దయామయి. దెబ్బ తిన్నట్లుగా ఉం దామె ముఖం. "నేను .... డబ్బుకోసం... నా గర్భాశయాన్నమ్ము కుంటున్నానను కుంటున్నారా?" "లేదు లేదు...." అంది ఆలిస్.

సుషమ— కంగారుగా.... ఈనగాచి నక్కలపాలు చేసి నట్లు.... యింతా చేశాక దయామయి కాదనదు కదా? అగ్రిమెంటుని రూపొందించడంలో - చేతగాని తనంతో— ఆమె హృదయాన్ని నొప్పించ లేదు కద తను?

నిజంగా తను పాపాత్మురాలే. దయామయి ఆర్థిక పరి స్థితిని - స్వలాభానికి వినియోగించుకో జూసింది. పిల్లలను బోర్డింగ్ స్కూల్లో చేర్పి ... దయామయికి నోట్ల కట్టలు చూపి... ఆమెను మభ్యపెట్టాలని ప్రయత్నించింది. అదంతా - కేవలం జయదేవ్ యివ్వబోయే లక్షకోసం కాదెంత మాత్రమూ. కేసులో ఉన్న ఆసక్తి. ఒక అసాధ్యాన్ని సాధ్యం చేద్దామనే సరదా. ఒక స్త్రీ ని ఆత్మహత్య చేసుకోకుండా రక్షించాడానికి....

ఆది కాదండీ దయామయీ!.... కాగితం మీద పెట్టేటప్పుడు కొంచెం చేదుగా ఉంటాయి కొన్ని విషయాలు. అంతే...."

"ఇంకేమీ చదవక్కర లేదు. ఎక్కడ పెట్టాలో చెపితే అక్కడ సంతకం పెట్టేస్తాను."

ఆలిస్ అదీ మంచిదే అన్నట్లు .... "శుభస్య శీఘ్రం." అంటూ ఆ కాగితాల మీద సంతకాలు చేయించింది. అవి - ఐదు రూపాయల — నాన్ జ్యూడిషియల్ స్టాంప్ పేపర్లు. వాటిలో ఏం రాసిఉందో కూడా చూడ కుండా. తననితానే ఎంత బంధించు కుంటూందో గమనించకుండా.

అప్పటికి - ఆలిస్ - తెరిపిన పడ్డట్లు ఊపిరి పీల్చుకుంది. "నిజంగా మీకు చేతులెత్తి నమస్కరించాలి. ఒక దంపతులకు మీరు చేస్తున్న మహోపకారం సాటిలేనిది." అంది కృతజ్ఞతలు తెలుపుతున్నట్లు.

దయామయి - జీవం లేని నవ్వొకటి నవ్వి ఊరుకుంది.



''సుషమా, ఈమెకు ప్రత్యేక మయిన రూము ఏర్పాట యింది కదూ?"

"ఓఁ."

"దయామయీ! మీకేం కావాలన్నా చెప్పు. మొహమాట పడకు. లోటు అనేది ఉండ కుండా.... హాయిగా ఉండు. శారీ రకంగా కాని మానసికంగా కాని నువ్వు ఏమీ లోటు అనుభవించ కూడదు. తెలిసిందా?''

''ఊఁ"

బెల్‌కొట్టి నౌకర్ని పిలిచి ఆమె నతని వెంటపంపింది. అమె వెళ్లి పోయాక....

"అమ్మయ్యా! ఇక ఫరవారేదు." అంది అలిస్ నిట్టూర్చుతూ,

"అప్పుడే మనం అలా అనేసుకుందుకు లేదు. మనమింకా- గడపదాటాం అంతే. వారణాశి రాలేదు."

"ఏమిటి?"

"గడపదాటి- వారణాశెంతదూరం అని అడిగారుట ఎవరో.. సామెత నీకూ తెలుసు. అదికాదు."

" కాగితాల మీద సంతకాలు చేసిందని మనం ధీమాపడి పోయేందుకు లేదు.''

"ఏం?"

"ఆ కాగితాలు —— నిజంగా కోర్టుకి వెడితే చెల్లవు."

"ఆ!"

అగ్రిమెంటు ఇల్లీగల్ అనే ప్రమాదం చాలా ఉంది.. ." సుషమ ఆలోచిస్తున్నట్లుగా అంది. సైకిలునీ రిక్షానీ అద్దె కివ్వడం న్యాయం కానీ స్త్రీ శరీరాన్నద్దెకివ్వడమే యీ దేశంలో యిమ్మోరల్ (అవినీతి) ఇల్లీగాల్ (చట్ట విరుద్ధమూ)- అటువంటిది - గర్భాశ యాన్నద్దెకివ్వడాన్ని చట్టం న్యాయ సమ్మతమని ఎలా అంగీక రిస్తుంది?

"జయదేవ్‌కోర్టుకి వెళ్లడు కదా!"

"దయామయి?" ఆమె సంగతేమిటన్నట్లు చూసింది సుషమ.

"డబ్బు అందాక ఆమెకు కోర్టుతో ఏం పని?"

"అప్పటికామె మనసెలా మారుతుందో.... ముందుగా ఏం చెప్పగలం?"

"ఆమె—— అలావెళ్లె అవకాశం లేదు. ఎందుకంటే కాగి తాలలో.... తను సంతకంచేసిన కాగితాలలో —— పిల్లల్ని చూపి తను ఆత్మహత్య చేసుకుందుకు ప్రయత్నించినట్లామె అంగీకరిం చింది."

"ఐతే?"

"ఆత్మహత్యా ప్రయత్నం నేరం: పిల్లల్ని చంపబోవడం మరో నేరం."

"మరి - జయదేవ్ వెళ్ల వలసివాస్తే?"

"దేనికి అతను కోర్టుకి వెళ్ళాలి?"

"దయామయి- ఎనిమిదిన్నర మాసాలు మోసి కన్నబిడ్డగా తీరా సమయం వొచ్చే సరికి యివ్వనంటే? తనకే కావాలంటే..?"

"సు ... ష.... మా!" తెల్లబోయింది. "అలా జరుగు తుందంటావా?"

"ఎప్పుడేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? కాలం—— మానవ జీవితాన్ని ఏక్షణంలో ఏ మలుపు తిప్పుతుందో?"

"ఐతే—— యీ కాగితాలూ అగ్రిమెంటూ దేనికి?"

"నిజంగా అనవసరమే. జరిగినదానిలో - మనస్సులే సాక్షి ఏ వొప్పందం కోర్టులో చెల్లదో- అది వొప్పందమే అని పించుకోదు మనుషులు - మాటకి కట్టుబడి ఉండాలంతే."

"ఇప్పుడేమిటీ మార్గం?"

"ఏసుని ప్రార్థించు. దయామయి మనసు మారకూడదని."

"సుషమా!"

"నేను నిజమే చెబుతున్నాను. ఈ కాగితాలు మననేమీ రక్షించలేవు. ఇవి పట్టుకుని కోర్టుకి వెడితే - గర్భాన్నద్దెకిచ్చి నందుకు దయామయీ, అద్దె చెల్లించినందుకు జయదేవ్, ఈ కార్య క్రమానికి దోహదం చేసిన డాక్టర్లుగా మనమూ - అందరమూ కట్టి కట్టుకుని కట కటాలవెనక్కి వెళ్ళవలసిందే."

తలపట్టుకుంది ఆలిస్. ఐతే—— యింత వరకూ పడిన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరేనా?

"అలా విచారించక్కరలేదు. ఈ కాగితాలు ఒకరి నొకర బెదిరించేందుకు చాలు. చూడు ఆలిస్!.... దయచేసి దయామయినీ జయదేవ్‌నీ ఒకరి నొకరికి పరిచయం చెయ్యకు. గర్భదాత ఎవరో అతనికీ - ధనదాత ఎవరో ఆమెకీ తెలియకుండా ఉండడమే క్షేమమేమో!"

టీ తెమ్మంది ఆలిస్ నౌకర్నిపిలిచి.

[ ఇంకావుంది ]

# శిష్యోపదేశం

(తైత్తిరీయోపనిషత్తు ఏకాదశానువాకానికి అనువాదం)

కం. వేదములు చెప్పి శిష్యున
కాదర మెసగంగ జీవితాంతము ధర్మే
కాదృతి నాతఁడు బ్రదుకున
మోదము గొన గురుఁడు హితము ముట్టఁగఁజెప్పున్.

కం. సత్యము పలుకుము ధర్మం
బత్యంత శ్రద్ధ నలుపు స్వాధ్యాయంబున్
నిత్యంబు చదువ మఱవకు
శ్రుత్యుక్తములైన ధర్మసూక్ష్మము లెఱుఁగన్.

చం. గురువున కిష్టమైన ధనకోటి యొసంగి యపత్యవృద్ధి చే
వ్వరయుము; సత్యమేమఱకు; మట్టుల ధర్మము నాచరింపు; శ్రీ
కరమగు కార్యమేమఱకు; గౌరవహీనములైన కార్యముల్
సిరికయి చేయకుండు; కడు చేటగునట్టులు చేయఁజూచినన్.

కం. వేదములు నీవు చదువుచు
నాదరమున శిష్యతతికి నవి చెప్పుట యు
న్నైష దేవపూజ పితృ కా
ర్యాదరణము చేయవలయు నవహితబుద్ధిన్.

తే. తల్లి దేవుఁడంచుఁ దలఁచుచునుండుము
తండ్రి దేవుఁడంచుఁ దలఁపవలయు
గురువు దేవుఁడంచుఁ గొలుచుచునుండు మీ
యతిథి దేవుఁడంచు నాదరింపు.

కం. ఏవియదూష్య క్రియలో
సేవింపుము వానిఁ; బెఱలు చింతింపకు; మే
మేవేళఁజేయు సుకృతురె
సేవింపుము; చేయవలదు చెడుపనులైనన్.

కం. గౌరవ మొప్పెడి విద్యా
పారీణులు ధర్మనియతి ప్రవచించెదుచో
నూరుపు విడువక వినుమీ;
వారికి నాసన మొసంగవలయును భక్తిన్.

కం. ఇచ్చునది భక్తితోడుత
నిచ్చుటయేవలదు భక్తిహీనత; వినయం
బచ్చుపడఁగ సిరికిందగ
నిచ్చుట తగు మిత్రుకొఱకు నీశ్వర కృపకై.

చం. నడతను దైవకర్మల మనంబున సంశయ మేర్పడంగన
య్యెడ నరసద్వివేకమతి యేర్పడ క్రూరతలేని ధార్మికుల్
నడచెడు భంగి నీవును నొనర్పుము; దోషము గల్గునంచుఁదో
చెడునెడ నట్టి సన్మతులు చేసెడు పద్ధతి నీవుఁజేయుమీ.

కం. ఇది యాదేశంబగు;
నిది యుపదేశంబు; వేదమిదియ యుపనిష
త్తిది తాను శాసనము; శుభం
బొదవంగా నెల్లరిట్టు లొనరింపఁదగున్.

డా. పి.యస్. సుబ్రహ్మణ్యం

# విలోకించు ఒక్కసారి

నఖీ....!
గతించిన కాలపు చీకటి పొలిమేర దాటి
లెక్కలేనంత దూరాన్ని
నిర్లజ్జగా
నగ్నంగా
మోస్తున్న వ యోరథ్యల్ని
నా అడుగులతో కప్పేస్తూ
వేకువ వెలుతురు సరిహద్దులోకి
చిగురులు తొడుక్కొని వచ్చాను
విలోకించు ఒక్కసారి
తొంగలి రెప్పలెత్తి....
నేలకి
పాదాలకి
నడుమగల నిశ్శబ్ద నీలిమను
అదృశ్య మంజరులకాంతి శబ్దాలత
సాంధ్య గీతాలుగా నజ్జకట్టి వచ్చాను
విలోకించు ఒక్కసారి
తొంగలి రెప్పలెత్తి
నే నడుగుపెట్టిన వేళావిశేషమేమోకానీ
మంచుతెర నందుల్లోంచి
లేత సవిత
పూత కిరణాల జలతారు రజంతో
అభిషేకిస్తున్నాడు....
మూర్ఖ సిద్ధాంతాల ముళ్ళలో దిగబడి
వెలుతురు మొలిచినచోటను నిర్లక్ష్యం చేసినా
నన్ను
క్షమించిన మిత్రుడు మరిచిపోలేనంత
నాగరిక సంస్కారాన్ని నా నెత్తిన పులిమి పోయాడు
నేనిప్పుడు సరికొత్తవాడ్ని
విలోకించు ఒక్కసారి
తొంగలి రెప్పలెత్తి....
తెల్లారిందని తెలిసి
కలల తలవాకిళ్ళు మూసి
ఓరుగంటి శిల్పంలా
ఓరవంటి చూపుల్తో
ఒళ్ళు విరుచుకుంటున్న
సాఖీ....
రాగ వైశాఖీ....
రాత్రి కలలో నే కన్పించిన
నా రూపం గురించి చెప్పవూ
అరమూత కళ్ళలోని అర్ధనగ్నత్వం
ఏ అర్థ ప్రతి పాదకమో
ఆ ముడి విప్పవూ....
విలోకించు ఒక్కసారి ప్రియా....

సాంధ్యశ్రీ



# కలగూరగంప

## గౌరవయ్యాలు మైలారుదేవ వీరభటులా?

"గౌరవయ్యల వృత్తాంతం" [భారతి, జూలై 1986] లో లేని క్రొత్త విషయాలను తెల్పుతున్నాను.

1. గౌరవయ్యాలు రాయలసీమలోని శ్రీశైలం, ఎల్లర్తి, గట్టు [ఆలూరు తాలూకా, కర్నూలు జిల్లాలలోనే కాక ఆలూరు తాలుక, నెరణికి లో వున్నారు. ఏటా ఇచట జాతర జరుగుతుంది.

2. కన్నడ దేశంలోని గొరవయ్యలను "గొరగ" లంటారని వ్యాసకర్త వ్రాసెను. అచట గొరగలను "గొగ్గయ్య" [గొరగ > గొర్గ > గొగ్గ] లనికూడా అంటారు. పాల్కురికి సోమనాథుని "పండితారాధ్య చరిత్ర"లో గొగ్గయ్య, గొగ్గవ్వ అనే వీర శైవ భక్తులపేర్లు వస్తాయి. గతకాలపు సుప్రసిద్ధ చలనచిత్ర నటుడు వేమూరి గగ్గయ్య.

3. మన గౌరవయ్యల వంటివారు ఇస్లాం మతంలోనూ వున్నారు. వీరిని "దర్వీషు" లంటారు. వీరూ గౌరవయ్యలవలెనే భిక్షకభక్తులు. గ్రొరెవున్ని అంగరఖా (గౌను) ధరించి కొనగాదీర్చిన వున్ని కుచ్చుటోపీ పెట్టుకొని, పిల్లనగ్రోవి వూదుచూ గుంపుగా గుండ్రంగా ఆవేశంతో పాడుతూ పరవశులై పోతూవుంటారు. దీనికి "దర్వీషు నాట్యం" అంటారు. వీరు టర్కీ, ఇరానులలో వుంటారు. తెలుగులోని "చార్ దర్వేష్ కథలు" వీరివే. దర్వీషుల నాట్యం గురించి నేను ఇంతకుముందే భారతి [సెప్టెంబరు 1985] లో "ప్రాచీన గ్రీకుల అహేతుక భావసరణి" అనే వ్యాసంలో వ్రాసినాను.

4. గౌరవయ్యలు "గొరగ" లే అయితే, ఈ గొరగల ప్రసక్తి మొట్టమొదట యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనం [క్రీ.శ. 9వ శతాబ్దం నాటిది] లో వస్తుంది మనకు కావలసిన పాఠభాగం నేటి "స్పెల్లింగు"తో పొందుపరచు చున్నాను.

"పరగగ బెజవాడ గొమరస్వామికి భక్తుండై గుడియు నిరుపమతి నృపధాముండెత్తిచ్చె నెగిడీర్చె మఠంబు గొరగగ్గా కొరులింద విడిసి బృందంబు గొనియుండువారు ..... యబ్బారణాసి ప్రచ్చిన పాపబుగొండ్రు

జననుత చేబ్రోలునుండి బెజవాడ జాత్రకువచ్చి ... .................. గని మల్లండెత్తించె గుడియు మఠంబును కార్తికేయునకు దీని చేబ్రోలుయేలెడు వారలిబేలు వారొండు సోటి గొరగలును...... ...."

ఈ శాసనంలో "గొరగలు" అనేపదం రెండుసార్లు వస్తుంది. "మఠం", "జాత్ర" అనే పదాలూ వున్నాయి మల్లుడు కుమారస్వామికి గుడినీ, గొరగ్గలకు మఠమూ కట్టించినాడు. జాతరా అవుతుంది. గొరగలు కుమారస్వామి జాతర చేసుకొనుచుండేవారు.

శ్రీనాథుని "క్రీడాభిరామం" అనే వీధినాటకంలో "గొరగపడుచు నాడు చున్నది" [పద్యం 143] అనివుంది.

5. గౌరవయ్యాలు ఆరాధ్యదైవం మైలార దేవుడు [శ్రీశైల మల్లికార్జునుడు] అన్నారు వ్యాసకర్తగారు. ఈ మైలార దేవుడు వరంగల్లు దగ్గర "అయినవోలు" లో ఉన్నాడన్నారు. అట్లయితే, మైలార దేవుడు మల్లికార్జునుడెట్లా అవుతాడు? గౌరవయ్యలదేవుడు శ్రీశైల మల్లికార్జునుడీ [ముద్దుపేరు 'మల్లయ్య'] కాని అయినవోలి మైలారదేవుడు కాడు. మైలార దేవుని భక్తులకు "మైలారు దేవర వీరభటులు" అనిపేరు. గౌరవయ్యాలు వీరభటులుకారు. మైలారుదేవర వీరభటుల విషయం "క్రీడాభిరామము" లో వస్తుంది. ఆ భాగాలిస్తాను.

"మహిష శృంగ నాదలహరిఁ గూడి
డమరు డిండిమంబు డమడమ ధ్వని మ్రోసె
నద్భుతంబదేమి యార్చటంబు"
అని టిట్టిభుం డడిగిన

సీ. అవఅవ మండు నెఱ్ఱని చండ్రమల్లెల
బోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి యలుఁగుల గనఁప పాతర్లకో
నుట్టి చేరులు గోసి యుఱుకువారు
గాలంపు గొంకిఁ గంకాళ చర్మము గ్రుచ్చి
యుడు వీథినుయ్యెల లూగువారు
కటికి హొన్నాళంబు గండకత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు

గీ. నందులను నారసంబులు నలుపువారు
యెడమ కుడిచేత నారతులిచ్చువారు
సాహసము మూర్తిగైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలార వీరభటులు

వీరు మైలారదేవర వీరభటులు గొండ్లి యాడించుచున్నారు"

[క్రీడాభిరామము 142-143]

పద్యమంటూ నాకు పూర్తి అర్ధం కాలేదు కానీ, ఈ మైలారదేవ వీరభటులు దెరుబుల్ పెలోస్ లాగ ఉన్నారు. వీరశైవ మతానికి వీరు "ఖడ్గబాహులు"గ ఉండివుంటారు. గౌరవయ్యాలు మేదకులు. గౌరవయ్యలను రాయలసీమలో మైలారదేవ వీరభటులనరు. మైలార వీరభటులు కర్ణాటకలోనూ వున్నారు.

గౌరవయ్యాలు వేరు మైలారదేవర వీరభటులు వేరు. శ్రీనాథుని దని చెప్పబడే ఒక ప్రసిద్ధ చాటువులో

"కైలాసగిరిఁబండె మైలారు విభుఁడేగి
దినవెచ్చ మేరాజు తీర్పగలఁడు"

ఈ మైలారవిభుడు శ్రీనాథుని రాజపోషకుడై వుండవచ్చును.

"త్రి"

## ఆంధ్రధూర్జటి పద్యాలు

సాహిత్య చరిత్రలో ఈ దత్తపదులు చింతలపూడి ఎల్లనార్యునివిగా ప్రసిద్ధి కాని సామాన్యులివి ధూర్జటి కవిగానే నమ్ముతారు. దాన్ని ఆధారంగా

చేసుకొని ఎవరో ఒక అజ్ఞాతకవి వీనిని చిన్న పద్యరూపకంగా కూర్చినాడు. నాకి పద్యాలు వేపూరు పెద్దలక్ష్మయ్యగారు వ్రాసిపెట్టుకున్న ప్రస్తావిక పద్యాలలో లభించినవి. వీనిని ఆయన ఒక భట్రాజుగారితో విని వ్రాసికొన్నారట.

అరుదుగ కృష్ణరాయ వసుధాధిపు దివ్య సభాంతరంబుకున్
నరగునవేశ్యలిర్వురును చక్కగ వెంబడి యుండ వాదిసిం
ధురహరియైన యాంధ్రకవి ధూర్జటి రాకడ జూచి భీతిచే
నరవర చంద్రుడిట్లనియె నమ్మికగల్గిన - అష్టకవులతోన్.

కవివరులార! నేడు మన గౌరవభంగ మొనర్ప పండితుం
డెవడొ మరాళయానలగు నింతుల నిర్వురగూడివచ్చె మీ
రవిమల చిత్తులై యతనికప్రతిమన నమస్యనీయుడి
వివశమునంది శీఘ్రముగ వెళ్లుటజూచి విచిత్రమందగన్.

దేవమహాంద్రవరులో! అతని దివ్యమహోద్ధతి జూడ మాకన్య
భావితమయ్యెమీరలు సభాజన సంతతిమెచ్చ గోప్య మ
ద్భావ విశేషశబ్దములు బల్కిన నాంధ్రకవీంద్రు వాక్యముల్
వేవిన గోరినారము వివేక సుశీలన! భూమిపాలనా!

ఘనతరాంధ్ర యాశుకవి శిరోమణి నేడు
నగరు తగరు తొగరు వగరు లనెడు
శబ్దనమితిగూర్చి చంపకం బొనరింపు
రామకథ జెలంగ రసమెనంగ!

నగరువగా యెనింక విపినంబుల కేగుడు రాజ్యకాంక్షకున్
తగరు కుమారులార! యని తల్లివగల్ మిగులంగదోప న
త్తొగరునరక్షగట్టి మదిదోచక గద్గదభిన్న కంఠియై
వగరుచున్న జూచి యినవంశవరేణ్యుడు తల్లికిట్లనున్!

భళిభళి యాంధ్రశబ్ద మణిబంధుర సింధువిచార! భారతో
ద్గత కథాసుధారసముగా నొనగూర్పు మటన్న తప్పితా -
మెరకు వెఱుంగ వేమిటిది మేదిని భర్తల చిత్తవృత్తి ని
మ్మళముగ విన్నవింతు పలుమారు వినందగు భారతార్థమున్

తొగరుచిదోచుకన్ను గవ తోగని కర్ణుడు భీమసేనునిన్
తగరు ధరాధరంబు వడిదాకిన కైవడి తాకినొచ్చితా
వగరుపుచున్ వెనన్ బరువువారిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మదినాటగజేసి ధరాతలేశ్వరా!

పలుకులకెంతొ వింతయగు భాగవతార్థము గోరనన్యమున్
బలుకగనేల మందమతి పాల్పడినట్టుల దోచె! రాజస
త్కులతిలకా వినందగును కృష్ణచరిత్రమె చెప్పినాను కే
వల పరిపూర్ణ వీక్షణ కృపామతినుప్పతిలన్ గ్రహింపుమీ.

నగరటువెళ్ళి చండికకునర్మిలి మొక్కిపడంతి మళ్ళినన్
తొగరుచిదోచు కన్నుగవతో చెలికై వలగొన్న రాజులన్
తగరు క్రియన్ విరోధితతి తల్లడమందగజేసి రుక్మిణిన్
వగరువడంగ జేసెనట వారిజనాభుని శౌర్యమెట్టిదో.

సాంద్రకవిత్వ నైపుణత సత్సభికుల్ ముదమందగా హరి
శ్చంద్రుని రీతిజెప్ప మనసారన భాగవతంబులో ఘనో
పేంద్రుని రీతి జెప్పితివి హెచ్చగు పండితవర్య! - నే హరి
శ్చంద్రుని రీతి జెప్పితిని చక్కగ విన్మిక రాజశేఖరా!

నగరటువీడి యాత్మజుని నాతని పారునకమ్మ జూపియున్
తగరని కాలకర్మమున ధర్మము తప్పక విక్రయించి తా
వగరుచు ద్రవ్యమిచ్చిన వారితుడై కొని కౌశికుండు బల్
తొగరుపుదోచుకన్ను గవ తోనిన వంశునే జూచి యిట్లనున్.

సాంద్రవలాహ కార్చటి వ చౌకములన్ నలరాజు భూమి పా
లేంద్రుని రీతిజెప్పుమన నేటికి జెప్పచునుంటివీ హరి
శ్చంద్రునిరీతి పండితవశంకర! కాదిదిగో నలావనీ
పేంద్రుని రీతి చెప్పితిని పేర్మిని విన్మిట రాజశేఖరా!

నగరుదొలంగి నట్టడవి నాతని బాసి మనంబులోవలన్
వగరుపుగల్గి వేగఖుతు వర్ణునిజేరి కృశించి దేహమున్ -
తొగరువు దోచుకన్ను గవతొ నలుడిట్లను నీకు దీటుగా
తగరుసుమీ నృపాలకులు ధారుణి నం గరుణించ వే యనెన్.

ధృతమతియైన యాంధ్రకవి ధూర్జటి వల్కులకెట్లు గల్గె నీ
యతులిత మాధురీమహిమ - హా తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనితా ఘనతావహారసం
తతమధురా ధరసుధారసధారలు గ్రోలగా సుమీ!

అని యిటు రామలింగకవి హాస్యపుమాటలు బల్కరాట్సభా
జనుల ముఖంబుజూచి కవిచందురు దద్భుతమైన నొక్క యూ
హను మదియందుబూని వసుధాధిప నీకవి సంఘమందు నా
స్పెనుగడ యొక్క చిత్రమును పేర్మితొ చెప్పెద నాలకింపుడీ!

ఆరవి వీరభద్ర చరణాహతి దుర్లినబోసి నోటికిన్
నేరడు రామకృష్ణకవి నేరిచెబో మనముక్కు తిమ్మన
క్రూరపదాహతింబడిన కొక్కెరవంటికి దుప్పికొమ్ము వ
ల్గారచియించినాడు రవిగాననిచో కవిగాంచె చూడగన్.

చిత్రవిచిత్ర పద్యములు చెప్పెరు ఆంధ్రకవీంద్రుజూచి యా
ధాత్రిని యెవ్వరిట్లు పదధాటిని గూర్పగజాలరంచు న
న్మిత్రతగాంచి నద్విమల మేదిని ధీశుడొసంగె సత్కవీ
గాత్రము వ్రజ్వరిల్లగ సుకాంతులు గల్గిన కంఠహారముల్.

ఈ పద్యములు కొంత లక్షణదోషముతో సమన్వయ దూరముతోకూడి యున్నవి. అయినను ప్రాచీనములు కనుక యధాతథముగా వ్రాసివంపితిని. వీనికి నడుమనడుమ చిన్న చిన్న సంధానవచనములు చేర్చుకొనిన చక్కని శ్రవ్యరూపకమగును.

### శ్రీ కపిలవాయి లింగమూర్తి

## గజశాస్త్రవేత్త పాలకాప్యుడు

ప్రాచీన భారతీయుల శాస్త్ర విజ్ఞానమునకు మూలకర్తలు మహర్షులు. వారి అవిశ్రాంత పరిశీలన తపోబలంతో ముడిపడి సూక్ష్మాతిసూక్ష్మమైన శాస్త్ర రహస్యాలను ప్రపంచానికి ప్రసాదించినది. ఆవిధంగా ఆవిర్భవించిన శాస్త్రాలలో వైద్యశాస్త్రమొకటి మానవ వైద్యశాస్త్రాన్ని చరక సుశ్రుత మహర్షులు రచించగా జంతు వైద్య శాస్త్రాలకు పలువురు మూలకర్తలైరి. శాలిహోత్రముని అశ్వశాస్త్రాన్ని రచించగా పాలకాప్యముని గజశాస్త్రాన్ని రచించాడు. ప్రధానమైన ఈ రెండు జంతు వైద్యశాస్త్ర గ్రంథాలు ప్రాచీన భారతదేశంలో బహుళ ప్రచారాన్ని పొందాయి అశ్వ, గజశాస్త్రాలను అధ్యయనంచేయని రాజులు ప్రాచీన కాలంలో లేరని చెప్పటం అతిశయోక్తి కాదు. శాలిహోత్రుని గూర్చి ఇంతకు ముందే తెల్పియున్నాను. (చూ. 'భారతి' మార్చి 81) ఇప్పుడు గజశాస్త్రాన్ని రచించిన పాలకాప్యునిగూర్చి యీ నాలుగుమాటలు వ్రాయదలచితిని.

బ్రహ్మదేవుడు ఆయుర్వేద వైద్యశాస్త్రాన్ని ఎనిమిది లక్షల గ్రంథంగా రచించగా అందులో గజశాస్త్రం నాలుగులక్షల గ్రంథంగా ఉన్నదట. దాని

సారాంశమే పాలకాప్యుని రచన.

"ఆయుర్వేదాష్టలక్షంతు బ్రహ్మణా సముదాహృతమ్
తన్మధ్యే గజవైద్యంతు చాతుర్లక్ష ముదాహృతమ్
తత్ర సంగ్రహతో రాజన్! వక్ష్యామి శృణుతత్పరం"

దీనినిబట్టి గజవైద్యం ఎంతటి విస్తారమైన శాస్త్రగ్రంథమో విశదము అవుతుంది.

పాలకాప్యముని అంగరాజైన రోమపాదుడికి (రేఖాకార పద్మానికి రోమమని పేరు. ఆ రోమముగల పాదములు గలవాడగుటచే రోమపాదుడైనాడని వివరణ) గజశాస్త్రాన్ని వివరించినట్లు గజశాస్త్ర గ్రంథాలలో చెప్పబడినది. దీనిని బట్టి పాలకాప్యముని అంగదేశంలోని చంపా నగరంలో ఈ గజశాస్త్రాన్ని చెప్పినట్లు తెలుస్తున్నది.

"అంగరాజో మహాప్రాజ్ఞ శ్చంపాయాం పృథివీపతిః,
మహాప్రభావ మాసీనం పాలకాప్యం స్మపృచ్ఛతి
"అంగదేశేష్వభూచ్ఛ్రీమా న్రోమపాదో మహీపతిః"

ఈ అంగరాజైన రోమపాదుడు ఇక్ష్వాకు వంశీయుడైన దశరథమహారాజుకు సమకాలికుడైనట్లు రామాయణమువలన తెలియుచున్నది. దీనినిబట్టి ఈ గజశాస్త్ర ప్రాచీనత నూహించుకొనవచ్చును.

ఈ శాస్త్రగ్రంథ రచయితఅయిన పాలకాప్యుని జన్మవృత్తాంత మీవిధముగా చెప్పబడినది.

వసువుల పుత్రికయైన గుణవతి అనేకన్య మతంగముని ఆశ్రమాన్ని చూచి ముచ్చటపడి ఆ ఆశ్రమంలోకి ప్రవేశించగా, ఆమె ఇంద్రుడుచేత తన తపో భంగ ముకై పంపబడినట్లు భావించి మతంగముని ఆమెనిట్లు శపించినాడు "నీవు అర ణ్యములో తిరిగే ఆడ ఏనుగు వౌదువుగాక. అరణ్యవాసంలో కూడ నీ బుద్ధి నశించదు" అని.

ఆ శాపానికి భయపడి గుణవతి ముని కాళ్ళమీదపడి "స్వామీ! రమణీయ మైన నీ తపోవనాన్ని చూడాలనే కోరికతోనే నీ ఆశ్రమాన్ని ప్రవేశించాను. నేనే పాపము ఎరుగను. ఈ ఏనుగు రూపానికి శాపావధిని ప్రసాదించుము అని అర్థిం చినది. అప్పుడు ముని తన ధ్యానబలంతో ఆమె నిర్దోషియని గ్రహించి ఆమెతో "అమ్మా! నీ తప్పులేదు నిజమే. కాని ఇది బ్రహ్మవ్రాత. కనుక తప్పదు. నీకు గజాయుర్వేద విదుడైన పాలకాప్యుడనే కుమారుడు పుట్టగలడు. అతనిని కని, పెంచిన తరువాత నీవు మరల వసురూపిణివై స్వర్గాన్ని చేరగలవు" అని చెప్పినాడు.

హిమవత్పర్వత ప్రాంతంలో సామగాయను డను మహర్షి ఆశ్రమంవెలుపల ఆ మహర్షిచే విసర్జింపబడిన మూత్రములోగల రేతస్సును గ్రహించి ఆ ఆడఏనుగు గర్భందరించి పాలకాప్యుని ప్రసవించింది. మనుష్యుని రూపంలో తాను ప్రస వించిన ఆ బాలునిచూచి ఆ ఆడఏనుగు అతనిని వెంటబెట్టుకొని సామగాయన మహర్షి ఆశ్రమానికి వెళ్ళి కుమారుని ఆ ముని కప్పగించినది. ఆ ముని ఆ బాలు నకు జాతకర్మాది సంస్కారాలు జరుపగా ఆకాశవాణి ఇట్లన్నది.

"గొప్ప కీర్తిగలవాడు, ధర్మాత్ముడు అగు ఇతడు ప్రతి కల్పములోను రోగాలతో బాధపడే ఏనుగులకు చికిత్సచేసి పరిపాలించగలడు" అని.

కాప్యగోత్రోద్భవుడై గజయూధాలను పరిపాలించేవాడు కనుక 'పాల కాప్యుడు' అనుపేరును ఆముని ఆ బాలునకు పెట్టాడు.

పాలకాప్యుడు కరిణీగర్భంలో పెరిగినవాడగుట చేత, బ్రహ్మదేవుని వర ప్రసాదమున సమస్త గజాయుర్వేద విజ్ఞానాన్ని పొందినవాడగుటచేత 11008 సంవత్సరములు ఏనుగులతో నివసించిన వాడగుటచేత ఏనుగుల జాతులు,స్థావరాలు ఆహార విషయాలు, చేష్టలు, మనోభావాలు, ఆరోగ్యఅనారోగ్య స్థితులు, రోగ విధానం చికిత్స, పోషణ గ్రహణాదులతో పరిపూర్ణజ్ఞానాన్ని సంపాదించినట్టు చెప్పబడినది.

పాలకాప్యుడేకాక గజశాస్త్రాన్ని వ్యాస, వైశంపాయన, గర్గ, గౌతమ, కశ్యప, మృగశర్మ, రాజపుత్ర, బృహస్పతి, యాజ్ఞవల్క్య, అగ్నివేశులు రచించి నట్టు తెలియుచున్నది. బ్రహ్మాండ పురాణాంతర్గతముగా గజశాస్త్ర విషయము కలదు.

పాలకాప్యుని కృతి "హస్త్యాయుర్వేద మనుపేర 1894లో ఆనందాశ్రమ గ్రంథమాలలో ప్రచురింపబడినది. దానిని నాలుగు వ్రాతప్రతుల ఆధారముగా పరిష్కరించినట్లు పరిష్కర్త పండిత శివదత్త శర్మగారు చెప్పిరి.

తంజావూరు సరస్వతీ మహలులోగల గజశాస్త్రగ్రంథాన్ని ఆధారంగా చేసికొని ఫ్రాంక్లిన్ ఎడ్గర్టన్ అనే అమెరికాదేశీయుడు "మాతంగలీల" అను గ్రంథాన్ని ప్రచురించినట్లు తెలియుచున్నది. వ్యాస, వైశంపాయనుల రచనలలోని కొన్ని భాగములతో తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమువారు పాల కాప్యుని గజశాస్త్రాన్ని ప్రకటించిరి.

ప్రతాపరుద్ర గజపతి ఆస్థానకవియైన గోదావరమిశ్రుడను కవి "హరిహర చతురంగ" మనుపేర వ్రాసిన గ్రంథములో గజశాస్త్ర విషయము సుమారు 800 శ్లోకములలో చెప్పబడినది. పాలకాప్యుని గజశాస్త్రములోని శ్లోకము లనేకము గోదావర మిశ్రుని గ్రంథమున కనపడుచున్నవి

మన ప్రాచీనులు వ్రాసిన ఈ గ్రంథాలలోని గజవైద్యశాస్త్ర విషయాలను ఆధునిక పశువైద్య విజ్ఞానశాస్త్ర విషయములతో పోల్చిచూడవలసిన అవసర మెంతేనికలదు.

**డా. సూర్యదేవర రవికుమార్**

# వేమన - కొన్ని సందేహాలు

వేమన్నను ఈనాటి పండితులందరూ ఉన్నత పీఠంపై కూచోబెట్టి ప్రజా కవి అని కీర్తిస్తున్నారు. ఆ కాలంలోనే ఆయన కులతత్వాన్ని వెక్కిరించాడనీ, ధిక్కరించాడనీ ప్రస్తుతిస్తున్నారు.

నిజమే. "కులము హెచ్చు తగ్గు గొడవల పనిలేదు, సానుజాతమయెనీ సకలకులము హెచ్చు తగ్గుమాట లెన్నెఱుంగగవచ్చును" అని ఆయన వర్ణవ్యవస్థ సమర్థనీయం కాదని అన్నాడు. అంతేకాదు. 'ఎరుకగలవాడె ఎచ్చైన కులుఁడు. అనికూడా అన్నాడు. కులంకంటె ప్రతిభకే ప్రథమపీఠం వేశాడు.

ఆచారాల పేరుతో మాలవారిని అస్పృశ్యులుగా చూచుటను ఆయన సహింపలేకపోయాడు. 'మాలవానినేల మరి మరి నిందింప ఒడలనున్న మాంస మొకటిగాదె వానిలోని వెలుగు వాని కులంబేది' అని ప్రశ్నించాడు. మాలకూడు కుడుచు మనుష్యునికన్నా మాలవాడే మేలని ఎలుగెత్తి చాటాడు. 'మాలకూడు' అంటే అధర్మసంపాదన అని వేమన భావమేమో. (ఈ అభిప్రాయం జాతి చండా లుడు కర్మచండాలునికంటే మేలన్న ప్రాచీన భావానికి మరొక కంఠస్వరం.)

ఇంతగా కులతత్వాన్ని విమర్శించినా, ఈయన పద్యాల్లో కొన్నిచోట్ల కుల ప్రసక్తి కానవస్తుంది మరీ నీచార్థంలో కుల ప్రసక్తిని తెచ్చాడే వేమన అని బాధకూడా కలుగుతుంది. అందుకు నిదర్శనమైన ఈ పద్యం చూడండి.

"సకల తీర్థములను సకల యజ్ఞంబుల తలలు గొరుగకున్న ఫలములేదు
మంత్రజలముకన్న మంగలి జలమెచ్చు ' అని అంటాడు వేమన.

ఈ పద్యంలో ఆయన తీర్థయాత్రలను, యజ్ఞాలను విమర్శించాలని ఉద్దే శించాడు. ఈ సందర్భంలో ఆయన మంగలివాళ్ళను తక్కువచేశాడు. ఇందలి మూడవపాదం మంత్రజలంకన్నా మంగలి జలం హెచ్చుకాదు అని వ్యంగ్యార్థాన్ని యిస్తుంది. ఆ రోజుల్లో మంత్రజలమంటే బ్రాహ్మణులచేతి జలమేగదా! (అనాడు

వేదమంత్రాలను బ్రాహ్మణులు మాత్రమే నేర్చుకునేవాళ్ళు కదా!) కనుక బ్రాహ్మణునికన్న మంగలి తక్కువవాడనే ఈ పద్యంలో ఆయన చెప్పినట్లు అవగతము అవుతుంది. ఇలాకాకుండా వేమన్న ఇంతకన్న బలవత్తరమైన కులప్రసక్తిలేని హేతువును చెప్పి యజ్ఞాదికాలు వ్యర్థమని చెప్పివుంటే బాగుండేది

మరోపద్యం. "కనకమృగము భువినికలదు లేదనకయె తరుణి విడిచిపోయె దాశరథియు తెలివిలేని వాడు దేవుడెట్లాయెరా?" అని ప్రశ్నించాడు వేమన. రాముడు వివేకహీనుడనీ, అలాంటివాడు దైవమయ్యే అవకాశం లేనేలేదని ఈ పద్యం చెబుతుంది. కానీ అలాచెప్పిన వేమన్నే 'రామనామ పఠనచే మహి వాల్మీకి పరగ బోయడయ్యె బాపడయ్యె కులముకన్న మిగుల గుణము ప్రధానము' అన్నాడు. ఈ పద్యంలో వేమన్న కిరాతుబోయవాడిని కవిగా, వాల్మీకి చేసింది- రామనామ పఠన మహిమ అంటున్నాడు. ఒక అజ్ఞానిని మహాకవిగా మలచిన మహిమ రామనామానికున్నప్పుడు ఆ రాముడు మిగుల మహిమాన్వితుడయిన వాడని ఆయన ఒప్పుకుంటున్నట్లేకదా! ఈ పద్యమునందలి భావము 'తెలివి లేని వాడు దేవుడెట్లాయెరా' అన్న వాక్యానికి పూర్తి వ్యతిరేకంగా లేదా? వేమన స్వవచో వ్యాఘాతానికి దీన్ని ఉదాహరణగా చెప్పవచ్చు. అలాకాదంటే వీనిలో ఏదో ఒక పద్యం ప్రక్షిప్తమై తీరాలి.

ఈ పద్యంలోని 'బోయడు, బాపడు' అనే రెండుశబ్దాలూ గమనార్హాలు. బోయడు, బాపడు కావడానికి మూలం రామనామ మహిమ. బోయడు రామనామ మహిమవల్ల గొప్పవాడై బ్రాహ్మణత్వాన్ని పొందాడన్నమాట. అంటే బోయవాడు బాపనికన్నా తక్కువ అని వేమన్న భావించినట్లేకదా. మరి అలాంటప్పుడు ఈయన కులాలు లేనేలేవని అన్నాడనీ, ఆ వ్యవస్థను కూకటివేళ్ళతో పెకల్చి వేయడానికి కవితా కుద్దాలాన్ని ప్రయోగించాడని ఎలా చెప్పగలం?

అంతేగాక ఈయన ఎన్నోచోట్ల ఇంకా కులప్రసక్తిని తెచ్చాడు. "పాల సాగరమున పవ్వళించిన వాడు గొల్ల యింట్ల పాలు గోరనేల?", "కోమటోని నిష్ఠ గురికి రాదెన్నడు", "కోమటి మదిగోరు క్షామమే ఎల్లెడ", "తిరపతికిని బోవ తురక దాసరిగాడు"— మొదలైనవి అందులకు ఉదాహరణలు.

'మాటనిలుపలేని మనుజుండు చండాలుడు' అన్నాడు వేమన. ద్విజుడంటే తపము చేసినవాడని ఆయనతలచినట్లు 'తపముచేత ద్విజుడు తర్కింపకులమెట్లు?' అనడంవలన తెలుస్తూంది. ఆయనే 'పరము గననివాడు బాపడుగాడురా!" అని కూడా అన్నాడు. మళ్ళీ తానే 'పదియు వేలకైన బాపడు కారాదు' అని మరోచోట అన్నాడు. ద్విజుడూ బాపడూ రెండూ ఒకటేగదా! మరి 'పదివేలకైన బాపడు కారాదు'— అని ఆయన అనటంలో పరమ నిగూఢముగానున్న రహస్యమేమిటో?

వేమన 'మాల మాలగాడు మహిమీదనే ప్రొద్దుమాట తిరుగువాడు మాలగాక వాని మాలయన్నవాడె పో పెనుమాల' అనీ; 'మాల, మాంసము తిన మహిమీద జనులెల్ల కొవ్వు త్రాపలేదొ కోర్కెదీర కులములన్ని ఒక్క కులముగా దెలియుడీ' అని; 'మాల మేలుగుణము మంచిది కలిగిన మాలకూడు కుడుచు మనుజుకంటె గుణము మేలుకాని 'కుల' మేమిమేలురా" అనీ; అనటంవల్ల గుణి అయితేచాలు మాలఐనా మహనీయుడే అనీ ఆయన అభిప్రాయం అని చెప్పవచ్చు.

కానీ ఆయనే 'మాల కన్నియలకు మించి రూపంబున్న ముట్టనే త్రిశంకు పట్టినాడు కాని పనులుసేయ ఘనులాసపడుదురా?' అనీ అన్నాడు. ఈ పద్యం ఎన్నో సందేహాలకు ఆలవాలంగా వుంది. త్రిశంకుపట్టి అయిన హరిశ్చంద్రుడు రూపవతులయినా ఆ స్త్రీలు మాలవాళ్ళు కనుక వాళ్ళను ముట్టక పోవడమే ఆయన ఘనకార్యమని వేమన అభిప్రాయమైనట్లు ఈ పద్యం చెబుతుంది. అలాకాక, హరిశ్చంద్రుడు మాటకోసం వలచివచ్చిన మగువలను తాకకుండా నిగ్రహంతో నిలబడినందువలన ఘనుడైనాడనా? ఇందలి భావం. ఇక్కడ కాని పని అంటే ఏమిటి? మాలవాళ్ళను ముట్టటమా? లేక స్త్రీలను తాకటమా? సత్యాన్ని వీడటమా? మంచి రూపంకూడా ఒక ముఖ్య సుగుణమే కదా. స్త్రీలలో ముఖ్యంగా అందాన్ని కూడా ఒక ప్లస్ పాయింట్‌గా గ్రహించాలిగదా. అలాంటప్పుడు రూపవతులయినా వాళ్ళు మాలవాళ్ళయినందున ముట్టరాదని వేమన అభిప్రాయమా? ఇలా ఈ చిన్న పద్యం ఎన్నో సందేహాలను రేకెత్తిస్తూ ఉంటుంది. కులవ్యవస్థకు వ్యతిరేకి అయిన వాడు ఇలాంటి దృష్టాంతాలను ఉట్టంకించటం దేనికి? లేక ఈ పద్యంకూడా ప్రక్షిప్తమే అయి ఉంటుందా?

ఇంకా ఈయన తక్కువ కులంవాడు, ఎక్కువ కులంవాడు అనేప్రసక్తిని తనపద్యాల్లో పలుచోట్ల తెచ్చాడు. ఉదా :- 'పూసపోగు, పసిడిపుట్టంబు విడియంబు కాయపుష్టి చాల కలిగెనేని కానికులజుడైన ఘనుడనీ రమ్మంద్రు" ఇక్కడ సందర్భాన్నిబట్టి కాని కులజుడంటే హీనకులంవాడని అర్థం వస్తుంది. వేషాన్నిబట్టి తక్కువ కులంవాడైనా ఘనుడిగా చలామణీ అవుతాడని ఈ పద్యం లోని భావం.

అలాగే కాని కులముదైన కంటికింపైనప్డు విటుడు వలచెనేని విడువలేడు మరగి గడ్డికుక్క మలమునుదిన్నట్లు' అన్నాడు మరోచోట ఈ పద్యంలో. 'కాని కులముది' అనే పదానికి హీనకుల స్త్రీ అనే అర్థం. విటుడియొక్క ఇంద్రియ బలహీనత ఎంతటిదో తెలపడానికి అలాంటివాడు తన కులంకన్నా తక్కువ కులంలోపుట్టిన స్త్రీ అయినా చక్కగావుంటే విడిచిపెట్టలేడని అంటున్నాడు వేమన' ముందు చూపిన పద్యంలోని 'మాలకన్నియ' అనే పదాన్ని, ఇక్కడ వాడిన 'కానికులముది' అనే పదాన్ని సమానార్థకాలుగానే ప్రయోగించాడేమో అని పరిశీలించాల్సిన అగత్యమూ, అవసరమూ ఎంతైనా వుంది.

'ఉర్విజనులకెల్ల నొక్క కంచముబెట్టి పొత్తుగుడిపి కులము పొలియజేసి తలను చేయిబెట్టి తగనమ్మజెప్పరా'అని వాపోయినట్టి వేమన్న ఇలా కులప్రసక్తిని తన పద్యాల్లోతేవడం నాకు చాలా విచారాన్ని కల్గించింది. అంతేగాక 'కలి యుగమున నున్న కాపుకులమునకు వేమన తనకీర్తి విక్రయించె' అని చెప్పుకున్నాడు వేమన. ఈ వాక్యాన్నిగూర్చి వ్రాస్తూ 'చింతచచ్చినా పులుపు చావనట్లు కులాతీతు

దైనా వేమనకు దానిపై అభిమానం ఆయనలో అప్పుడప్పుడు తెలియకుండానే పైకి ఉబికేటట్లున్నది' అని శ్రీ మరుపూరు కోదండ రామిరెడ్డిగారు 'లోకకవి' వేమన యోగి' అనే తమ గ్రంథంలో ౫౬వ పుటలో వ్రాశారు. అయితే ఆయన దానిని మానవ స్వభావంలోని దౌర్బల్యం అనిచెప్పి సమర్థింప జూచారు.

కానీ వేమన ఏ అర్థంలో ఈ కులశబ్దాన్ని వాడినాడో ఇంకా లోతుగా పరిశీలించాల్సి వుంది. ఆయన మతంలో బాపడు, ద్విజుడు-వేరువేరా? ఒకటేనా ! ఇవి ఆలోచించవలసిన విషయమే. ఇంకా ఈ కులప్రసక్తి వున్న పద్యాల్లో ప్రక్షిప్తాలున్నాయేమో పరిశీలించాల్సిన బాధ్యతకూడా పరిశోధకుల భుజస్కంధాలపై వుంది.

ఇందలి నా సందేహాలను జ్ఞానవృద్ధు లెవరయినా నివృత్తి చేయగలరని ఆశిస్తున్నాను.

శ్రీ శంకర గంటి రమాకాంత్

# నారాయణబాబు 'ఫ్రాయిడో-మార్క్సిజం'

శ్రీరంగం నారాయణబాబు (1906-61) 'సత్తివాడు', నిష్క్రమించిన లోకచుక్క', 'దిగంబరుల ఆదికవి', 'ఇమేజిస్టుకవి', 'అనార్కిస్టు', 'ఇమిటేటర్' మొదలు మొదలుగా సంభావితుడయినాడు. నా. బా ఉత్తరాలు (చా.సో గారి దగ్గర చాలా ఉన్నట్లు వినికిడి), కథలు, నాటికలు, గ్రంథ పీఠికలు, విమర్శ, రేడియో ప్రసంగాలు [వీటి సంగ్రహణ/సంకలనలో మానేపల్లి ఎంతదాకో మరి], డైరీలు, నోట్సులు (ఒకవేళ ఉండి, లభిస్తే) - ఇలా నా.బా సమస్త రచనలు లభించనిదే నా.బా సమగ్ర సాహిత్య వ్యక్తిత్వం, వికాసం సరితూకంలో అంచనా కట్టటం సులభసాధ్యం కాదు. నా.బా 'రుధిర జ్యోతి' (1972, 1977), 'సంఘర్షణ' కి రాసిన 'ప్రవర' [1950] లతో పాటు నా.బా పై పలువురు వ్యక్తం చేసిన అభిప్రాయాల ఆధారంతో నా.బా ని తూచటం అసమగ్ర ప్రయత్నమే అవుతుంది.

1926 లో ఏర్పడిన విశాఖ కవితా సమితిలో సభ్యుడవటానికి మునుపటి నించే నా.బా రచనా వ్యాసంగం ఆరంభమయింది. 1932-59 ల మధ్య 'రుధిర జ్యోతి' కవితలు రచించబడ్డాయి. వీటికిముందు అంటే 1925 నించి 1930 దాకా నా.బా అప్పటికి "సాహిత్య జగత్తుని గంగవెర్రులెత్తించే" భావ కవిత్వాన్ని "నసిలేకుండా నిరససగా చేయవలసిన రచన [విధానం] ఇదికాదు అని తెలిసికూడా గత్యంతరం లేక" అనుసరించాడు. భావకవితా "గాగుల్స్ లతో జీవిత గ్రీష్మాన్ని దర్శించటం" విలువడేది కాదని 1930 లో తెలుసుకో గలిగాడు. "వేదాంతాన్ని. జీవితాన్ని, ప్రకృతిని మార్చడం" ఒకటికావని గ్రహించాడు. పలాయనత్వం, నల్లమందు నిషా పనికిరాదన్నాడు. ఉష్ట్రపక్షిగా సంచరించలేనన్నాడు. జీవితాన్ని యథార్థంగా దర్శిస్తానన్నాడు. తాను విప్లవ ఋషిగా, విద్రోహికవిగా చెప్పుకున్నాడు. "అత్యంతాభి నివేశంతో రచనలద్వారా, సభాముఖానా అధివాస్తవికతని ప్రచారంచేసిన అతినవ్యుడ" య్యాడు. జార్జ్ హ్యూజనెట్ లాంటి సర్రియలిస్ట్ 'వార్‌బ్లెర్స్ ట్రౌజర్' (పక్షి అరువులవాని అంగీ) నీ, 'లా అవంచూర్ దాదా' [1957] సంకలన కర్తనీ 'ప్రవర' లో ఉదహరించాడు. తెలుగు 'అతివాస్తవికత' కి 'అధివాస్తవికత' గా సవరణ ప్రతిపాదించాడు.

పో, బోద్లేర్, మొపాసాలు తన ఋషులుగా శ్రీశ్రీ [ఆదిలో] చెప్పుకోగా మార్క్స్, ఫ్రాయిడ్‌లని తన ఋషులుగా నా.బా చెప్పుకోటం [1950] గమనార్హ విషయం అవుంది.

1929 లోని డిప్రెషన్ యావత్ ప్రపంచాన్ని ఒకవూపు వూపసాగింది. ఎటుచూసినా నిరాశ, నిస్పృహ, నిరుద్యోగం, కరువు, అనారోగ్యం, యుద్ధ భీతి, జీవిత భద్రతారాహిత్యం తాండవించాయి, పారంపర్య ఆలోచనాధార పటాపంచలవసాగింది. జీవిత విలువలు కొత్త అర్థాలతో, మూల్యాంకనలతో దర్శనమివ్వసాగాయి. ఆకటి దశాబ్దంగా పేరుపడిన 1930 లు ప్రపంచ రాజకీయ, ఆర్థిక, సాహిత్య ధోరణులపై గొప్ప మార్పుని తెచ్చినవయ్యాయి. అప్పటికి కొత్తగా ఏర్పడివున్న సోషలిస్టు జీవిత విధానం ఆ సంక్షోభంలో ఒక ఆశాకిరణం అనిపించసాగింది. సోవియట్ సోషలిస్టు విధానంపై ఉత్సుకత ప్రపంచానికి కలిగింది. సోషలిస్టు సిద్ధాంతాలూ, రచనలూ సోవియట్ సరిహద్దులు దాటి ప్రపంచంపై ప్రసరించసాగాయి. సామ్రాజ్యవాద కోరలమధ్య గింజుకునే అనేక వలసదేశాలు ప్రేరణ పొందసాగాయి. విముక్తికోసం ఉద్యమాలకి, విప్లవాలకీ సంసిద్ధమయ్యాయి.

1930 నాటి బ్రిటిష్ భారతదేశం లోకి మార్క్స్, ఏంగిల్స్ రచనల్తో పాటు లెనిన్, బకూనిన్, క్రొపొట్కిన్ మొదలయిన వారి రచనలుకూడా నిషేధాజ్ఞలుదాటి చాటుమాటుగా చేరినవయ్యాయి. భారతస్వాతంత్ర్య సమరంలో విప్లవపంథాని అనుసరించిన విప్లవకారులు ట్రాట్స్కీ, బకూనిన్, క్రొపొట్కిన్, లెనిన్ విప్లవ కార్యాచరణచేత ప్రభావితులయ్యారు. "నేను అరాచకవాద నాయకుడైన బకూనిన్‌ని చదివాను. సమాజవాద పితామహుడైన మార్క్స్ రచనల్ని కొన్నింటిని చదివాను. లెనిన్, ట్రాట్స్కీ ఇంకా కొందర్ని చదివాను. బకూనిన్ 'భగవంతుడు-దేశం' అనే గ్రంథం అసంపూర్ణమే అయినా మంచి రచన" అన్నాడు భగత్‌సింగ్. ఉరితీయటానికి [మార్చి 23, 1931 సాయంత్రం 8 గం॥] కొద్ది క్షణాలముందు జైలు అధికారులు భగత్‌సింగ్‌ని తీసుకెళ్లటానికి వచ్చినప్పుడు 'లెనిన్ జీవితచరిత్ర' ని చదువుతున్న భగత్‌సింగ్ "ఆగండి. ఒక విప్లవకారుడు ఇంకో విప్లవకారుని కలువబోతున్నాడు" అంటూ ఆ పుస్తకాన్ని జైలుగది పైకప్పుపైకి విసిరి "పదండి" అంటూ ఉరికంబంవైపు నడక సాగించాడు. భగత్‌సింగ్‌ని ప్రభావితం చేసినవి - లెనినిజం అనార్కిజం, నాస్తికవాదం. నిర్లభస్వామి 'సహజజ్ఞానం' గ్రంథంలోని 'ఆధ్యాత్మిక నాస్తికవాదం' తనను నాస్తికవాదిగా మార్చిందని భగత్‌సింగ్ చెప్పుకున్నాడు.

భగత్సింగ్ మొదలయిన యువ విప్లవకారులు మార్క్స్ మూలరచనల కంటే లెనిన్ విప్లవ ఎత్తుగడ, ట్రాట్స్కీ శాశ్వత విప్లవపంథా, బకూనిన్, క్రొపొట్కిన్‌ల అవాంగార్డిజం, అరాచకవాదం (బకూనిన్ రాజకీయ ఉద్యమం ముఖ్యోద్దేశంగా 1878 లో 'ల అవాంగార్డ్' పత్రికని స్థాపించాడు) వైపు మొగ్గటం ఆనాటి బ్రిటిష్ శాసకుల బర్బరతని ఎదుర్కోటానికి తక్షణ అవసర అనుసరణీయ పంథాగా భావించబడింది. ఆ విధంగా లెనిన్, ట్రాట్స్కీ, బకూనిన్, క్రొపొట్కిన్ రచనలు భారతదేశం నలుమూలల దాకా చాటుమాటుగా చేరినవయి వుండవచ్చు. మార్క్స్ రచనలకంటె ఈ రచనలు తెలుగుదేశంలోని అశాంత యువకవి ప్రతినిధులయిన శ్రీశ్రీ, నాబాలకి ముందుగా లభించి వుండవచ్చు, ఆకర్షించిన వయివుండవచ్చు. "ప్రిన్స్ క్రొపొట్కిన్ 'ఎన్ అప్పీల్ టు యూత్' నా దృష్టిని పూర్తిగా మార్చివేసింది. అప్పటికి మార్క్స్ ప్రభావం ప్రత్యేకంగాలేదు. అప్పుడు చదివిన సాహిత్యం నా కుటుంబపరిస్థితి, ముఖ్యంగా స్పెయిన్‌లోని అంతర్యుద్ధం (1936) నన్ను వామపక్షంవైపు లాక్కుపోయాయి. (శ్రీశ్రీ వ్యాసాలు పే. 193). మొదట్లో నన్ను ట్రాట్స్కీ, క్రొపొట్కిన్ బాగా ఇన్‌ఫ్లుయెన్స్ చేశారు. తరువాత నాకు ఇంగ్లండులో మన భారతీయ విద్యార్థులచే స్థాపించబడిన అభ్యుదయ రచయితల సంఘం ప్రచురించిన మానిఫెస్టోని అబ్బూరి రామకృష్ణారావు ఇచ్చారు. ఆ అరతావు మానిఫెస్టో ఇండియాలోకి స్మగుల్ అయివచ్చింది. అది నన్ను మార్క్సిస్ట్ లైన్‌లోకి పడివేసింది" అన్న శ్రీశ్రీ మాటలు ఇందుకు నిదర్శనాలవుతాయి. స్టాలిన్. ట్రాట్స్కీల మధ్య విభేదాన్ని చక్కగానే విడమర్చ గలిగాడు శ్రీశ్రీ. "ఒకప్పుడు సోవియట్ యూనియన్‌కూడా ధనస్వామ్యవిధాన

సముద్రం చుట్టుముట్టిన ఒకేఒక సామ్యవాద ద్వీపంగా ఉండేది. స్టాలిన్, ట్రాట్స్కీలకి పెద్ద పేచీ ఇక్కడే వచ్చింది. ప్రపంచమంతటా విప్లవం రగుల్తూ ఉంటేనే తప్ప మన సామ్యవాద ద్వీపం వర్ధిల్లలేదన్నాడు ట్రాట్స్కీ. ఒక దేశంలో సామ్యవాదం నిర్మిస్తే అది ప్రపంచమంతటకీ ఆదర్శప్రాయమవుతుం దన్నాడు స్టాలిన్" (శ్రీశ్రీ వ్యాసాలు పే. 55) "బూర్జువా శ్రీశ్రీ నుండి రెబల్ శ్రీశ్రీగా తయారయ్యా" నంటాడు శ్రీశ్రీ. "మార్క్సిజం ముదిరితే అనార్కిజం" అనటంలో శ్రీశ్రీ అనార్కిజంపట్ల మొగ్గుకనిపించే దవుతున్నది. "క్రొపాట్కిన్ శిష్యుణ్ణయిన నాలోకూడా కొంత అనార్కిజం ఉంది" అంటాడు శ్రీశ్రీ. నాబాని అనార్కిస్టు అన్నాడు.

దీన్నిబట్టి శ్రీశ్రీ, నా.బాలకి మార్క్స్ రచనలకంటె ముందె అనార్కిస్టు అవాంగార్డ్ రచనల్తో సిద్ధాంతాల్తో పరిచయం ఏర్పడిందనవచ్చు. 'కపాల మోక్షం' (1938), 'భగత్సింగ్ శాపం' రచించిన నా.బాకి భగత్సింగ్ ఒక ఆదర్శ, అనుసరణీయ విప్లవకారుడయినాడు.

శ్రీశ్రీ, నా.బా లు తెలుగు సాహిత్యంలో 'అధివాస్తవికత' ని ప్రవేశ పెట్టటం పాశ్చాత్య సాహిత్య ఉద్యమాల, వెల్లువలపై ఏదో ఒక కొత్తాక వింత వెర్రివ్యామోహం అనుకుంటే అది మన విమర్శక అహంకార వికారమే అవు తుంది. ఆంద్రీబ్రెతాఁ మొదలయిన వామపక్ష స్రియలిస్టులు కొన్నాళ్ళు ఫ్రెంచి కమ్యూనిస్ట్ పార్టీ సభ్యులుగా ఉండి విప్లవ కార్యాచరణని చేపట్టినవారు. అజ్ఞాతంలో ఉండినవారు. ట్రాట్స్కీచే ప్రభావితులు. ట్రాట్స్కీ, బకూనిన్, క్రొపాట్కిన్ రచనల్తో పరిచయమున్న శ్రీశ్రీ, నా.బా లు ట్రాట్స్కీని అనుస రించిన బ్రెతాఁ అధివాస్తవికతపై మొగ్గుపడటం అస్వాభావికం కాదు. రెండవ ప్రపంచయుద్ధం తెచ్చిన బీభత్స, భీతావహ పరిస్థితులలో తీవ్ర అలజడులకీ, నిరాశకీ, అశాంతికీ, కోపానికీ, విసుగుకీ గురిఅయిన శ్రీశ్రీ, నా.బా లాంటి నిరుద్యోగ యువకుల మానసిక నిర్మాణానికి స్రియలిస్టు ఆలోచనారీతి, అభి వ్యక్తి విధానం వెతుక్కుంటున్న ఒక సరివాహిక కాగలిగింది

పారిశ్రామిక ప్రాధాన్య పాశ్చాత్యదేశాల్లో ప్రాచుర్యంలో ఉండిన ఉత్పత్తి సిద్ధాంతాన్ని (ఉత్పత్తి కోసం ఉత్పత్తి. ఉత్పత్తి మానవ మహత్తరలక్ష్యం) వ్యతిరేకిస్తూవచ్చిన ఫ్రాయిడ్ ఆహ్లాదసిద్ధాతానికి బూర్జువా వ్యతిరేకగుణముందనీ, విప్లవాత్మక మయినదనీ ఎంచబడింది. ఆహ్లాదసిద్ధాంతంలోని పై గుణంనించి నరాసరి సోషలిస్టు, కమ్యూనిస్టు దశలలోకి ఏదో ఒక విప్లవ కార్యాచరణద్వారా దాటువెయ్యొచ్చనే ఆశ ఆంద్రీ బ్రేతాఁకి, ఆయన స్రియలిస్టు సహచరులకీ కలి గింది. ఫ్రాయిడ్ మూలసూత్రాన్ని సవరించి లిబిడో (కామవాంఛ)చేత ప్రపంచ విప్లవచక్రాన్ని తిప్పొచ్చనే అభిప్రాయం ఏర్పడింది. ఏదో ఒక విధంగా నిరంతర విప్లవ కార్యాచరణకి ట్రాట్స్కీ సమర్థన లభించింది. స్రియలిస్టులు ఫ్రాయిడ్ విలువల్ని మార్క్సిస్టు వెలుగులో మూల్యాంకన చేయనారంభించారు. ఇది స్రియలిజంలోని విశేషగుణం అయింది. (దాదాని వీడి స్రియలిజంని స్థాపించటంలో దాదాలోని "విధ్వంసక వెర్రి" ముఖ్యకారణం కాదు. దాదాని జారా "పరిశుద్ధంగా" ఉంచదలచాడు. బ్రెతాఁ రాజకీయంతో జోడింపుకోరాడు, అలానే స్రియలిస్టులు ఫ్రాయిడ్ని అర్థం చేసుకోకకాదు. కావాలనే అలా చేశారు). ఆ విధంగా స్రియలిస్టులు ఫ్రాయిడ్ మెటాసైకాలజీలోని ఆహ్లాద సిద్ధాంతంలోని బయాలాజికల్ పార్శ్వాన్ని చెక్కుచెదరనియ్యకుండా అందులోని అంతే ముఖ్యమయిన వాస్తవికతా సూత్రానికి మాత్రం మార్క్సీయ, హెగెల సీయ, పాశ్చాత్య మెలికలు ఇవ్వసాగారు. ఈ మిశ్రణ ఫలితంగా "ఫ్రాయిడో-మార్క్సిజం" లేక, వామపక్ష స్రియలిజం ఏర్పడింది. ఇది ఫ్రాయిడయ నిజంకి పూర్తిగా భిన్నమైనది అయింది. 1930 ప్రాంతాల్లో దీనిని విల్ హెం రిచ్, ఎరిక్ఫ్రోం లు మరింత ప్రాచుర్యంలోకి తెచ్చారు. 1950, 60 లలో ఇది రాజకీయ, లైంగిక సంయుక్త విప్లవంగా, "ఆల్ట్రా-మార్క్స్-ఫ్రాయిడి యనిజం"గ రూపుదరించింది. దీని సుదూర ప్రాచ్యసామ్యప్రతిధ్వనే తెలుగులో దిగంబర కవిత్వం అనిపిస్తుంది. దిగంబర కవితలో మార్క్సిజంని విడిగా వెతికి ఎనార్కిజంని మాత్రం చవిచూసిన మార్క్సిస్టు విమర్శకులు కూడా తీవ్రాగ్రహాలకి, భంగపాటులకి గురికావలసిరావటం మన అనుభవం అయింది. మార్క్స్-ఫ్రాయిడియనిజంతో వామాంశ ఉన్నట్టనిపించినా అది అటు మార్క్సిజంలోనూ, ఇటు ఫ్రాయిడియనిజంతోనూ పొత్తులేనిదే అయింది. తల పడినది అయింది. దేనికీ కట్టుపడని ఒక ప్రఖరముఖ '[illegible]చ్చా విప్లవ' ఉద్యమం అయింది.

నా.బా మార్క్స్నీ, ఫ్రాయిడ్నీ తన ఋషులుగా చెప్పుకోటం వామపక్ష స్రియలిజం (బ్రెతాఁ మొ॥) నించి తెచ్చుకున్నదని చెప్పవచ్చు. నా.బా మార్క్స్ వాదం స్రియలిస్టుల మార్క్సిజం అవుతుంది. విప్లవ ఋషిత్వం విద్రోహి కవితనం స్రియలిస్టు భూమికదవుతుంది. ఈ లక్షణ సామ్యం వల్లనే నా.బా దిగంబరుల ఆదికవిగా ఎంచబడి వుండాలి.

"పాశ్చాత్య సాహిత్యాల విప్లవాలూ, కొత్తకొత్త ప్రక్రియలూ, సరికొత్త పుస్తకాలూ తెచ్చి శ్రీశ్రీ వినిపించేవాడు. నారాయణబాబునీ చదవమని సలహా ఇచ్చేవాడు" (పురిపండా). కనక శ్రీశ్రీ చదివిన పుస్తకాలు నా.బా కి అందు బాటులో ఉండినవయ్యాయి. అయితే తెలుగు అధివాస్తవికతకి ఆద్యుడనని చెప్పుకున్న శ్రీశ్రీ, నా.బా లా మార్క్స్, ఫ్రాయిడ్లని ఋషులుగా చెప్పుకోక పోవటం సమాధానం లేని చిక్కుకాదు. శ్రీశ్రీ అప్పటికి ప్రతీకవాద దారి అనుసరించి పో, బోద్లెర్ లని ఋషులుగా చెప్పుకుని ఉన్నాడు. మార్క్స్ ఫ్రాయిడ్లని ప్రత్యేకంగా చెప్పుకోకపోయినా ఫ్రాయిడో-మార్క్సిజం, అవాఁ గార్డిజం, ఎనార్కిజంల్ని తన రచనల్లో ప్రవేశపెట్టి ఉన్నాడు. కాకుంటే వాటిని వాటి తాత్విక పంథాలోకాక ఆదరాబాదరాగా అనుసరించి అభాసుపాలు చేశాడు. నా.బా స్రియలిజంని "అమాయకం" గా అర్థం చేసుకున్నా 'మౌన-శంఖం' లాంటి ఉత్తమ స్రియలిస్టు ధోరణి కవితని కూర్చగలిగాడు. పౌరాణిక, కాల్పనిక, ప్రతీకవాద వాసనలనించి బైటపడలేని ఉత్కృష్టరచన 'కవితా! ఓ కవితా!' ని చదివి కవిసామ్రాట్టులు హర్షోత్సేక జర్జరితులై కంట తడితెచ్చుకుంటే, "మౌనశంఖం" చదివి శ్రీశ్రీ భయపడ్డాడు. గాబరాపడ్డాడు. నా.బా అవకాశవాది, ఇమిటేటర్ అనిపించాడు. శ్రీశ్రీ చదవగా రుక్మిణీనాథ శాస్త్రి విన్నాడు, పాదాభివందనాన్ని తిరుగు టపాలో నా.బాకి తెలుపుకున్నాడు.

భావకవిత్వంలో ఏకకాలంలో మునుగులాడి, ఏకకాలంలో దాన్నించి బయటపడి, అధివాస్తవికతలో కలిసి అడుగులేసిన శ్రీశ్రీ, నా.బాల తదుపరి వైరానికి నటోలీ నాటకానువాదం (చెహోవ్ "చెర్రి ఆర్చర్డ్"-"సంపెంగతోట"). అభ్యుదయ అనుయాయులు, చిత్రసీమలో అసమరాణింపులు, శ్రీశ్రీ నా.బా పట్ల "ఏకరక్త" పరుషం, నా.బా ఏకాకితనం, అసహాయస్థితులలోని మూగ తనం కారణాలయినా రోణంకి గారన్నట్టు నా.బా ఇమేజిస్టుకవే అయితే అది



కూడా ఆ వైరానికి మరో కారణం అయివుండాలి. శ్రీశ్రీ తన గేయాల్లో "ఛందోబద్ధ గజ్జలరవళికి, శ్రుతితాళ ప్రమాణ శ్రవణోపోతానికి" (నా.బా)," "శబ్దవిన్యాసానికి" (శ్రీశ్రీ), సింబాలిస్టుల "సంగీత సిద్ధాంతాన్ని" [కళని సంగీతంతో పోల్చి చెప్పటం, సర్వప్రపంచ మనుగడ సంగీత లయబద్ధ మనటం, "సూర్య సంగీతం", 'సర్వ సంగీతం' పేర్లతో చిత్రాలు, "రక్త నాళాలలో సంగీతం (శ్రీశ్రీ)] తాత్వికబలంగా తీసుకోటానికి పో, బోద్లేర్, స్విన్‌బర్న్‌లని ఋషిప్రాయులు చేసుకున్నాడు శ్రీశ్రీ. (శ్రీశ్రీ) ఇంతకుమించి సింబాలిజంలో కూరుకుపోవకపోవడం తెలుగు కవిత్వం ఒక గండం దాటటమే అయింది). నా.బా ఇమేజిస్టు కవి అవాలనుకునివుంటే ఎజ్రాసౌండ్ పైలో లోనైనా ఇష్టపడి ఉండాలి. అంటే తెలుగు కవితా రంగంలో సింబాలిస్టు నేతృత్వానికి శ్రీశ్రీ, ఇమేజస్టు ప్రాతినిధ్యానికి నా.బా లు పోటీ పడివుండాలి. ఇదే నిజమైతే పౌండ్‌కీ, ఫ్రెంచి సర్రియలిస్టులకీ మధ్య ఉండిన ముష్టియుద్ధ సంఘటనలు తెలుగులో అధివాస్తవికతని చేపట్టిన నా.బాకి తెలియనివి అయి వుండాలి. తరువాత తెలుసుకున్నాక తాను ఇమేజిస్టు కవినని ప్రకటించుకోక పోయివుండాలి.

నా.బా ఇమేజిస్టు కవి అనటంలో అభిప్రాయ ఐక్యతలేదు. పదచిత్రం పద చిత్రవాదం ఒకటికావు. కవితా ఉద్యమాలూ, రీతులూ మారినా కవితలో మారనిదీ, కాలంచేత కలుషితమవ్వనిదీ, మసకపడనిదీ ఆ కవితలోని పద చిత్రమే అనే గుర్తింపువుంది. కవిత్వాని పదచిత్రం ఒక అవసర మూలకంగా గొప్ప కవులచేత పరిగణన పొందింది. అయితే పదచిత్రాన్ని పదచిత్రం కోసంవాడి, పదచిత్రమే కవిత్వమన్నవాళ్లు ఇమేజిస్టులు. నా.బా కవితల్లో పదచిత్రాల సొంపుని ఎత్తిచూపొచ్చుగాని నా.బా ఇమేజిస్టుకవి అనటం నా.బాని కుదించివేయటం అవుతుంది. ఇమేజిస్టుల వ్యక్తీకరణ సంక్షిప్తతని దృష్టిలో పెట్టుకొని నా.బా కవిత్వాన్ని "హ్రస్వలిపి" గా చెప్పటం నా.బా. ని ఇమేజిస్టు కవిగా నిరూపించే అదనపు ప్రయత్నం అనిపిస్తుంది. ఛందోవిచ్ఛిత్తి, అర్థం కంటె పదచిత్రాధిక్యత, ఒకే కవితా ఖండికలో అసమపాద నిడివి, వ్యాకరణ సంబద్ధంకాక కవి మానసిక క్షితజంలోని బింబాకృతులపై ఆధారపడిన కవితా నిర్మాణం, స్థూలంగా చెప్పాలంటే అప్పటికి అనుసరించబడుతున్న కవితా నిర్మాణ రీతులనించి పూర్తిగా స్వతంత్రించటంలో నా.బా కవిత 20వ శతాబ్దిలో వచ్చిన ఏ ఒక్క పాశ్చాత్య ఆధునిక కవితా ఉద్యమ కవితానిర్మాణపద్ధతికైనా చేరువయ్యేదే అవుతుంది. సర్రియలిస్టు కవితా నిర్మాణరీతికి దగ్గరిదే అవుతుంది.

కమ్యూనిస్టులు పెంచితే శ్రీశ్రీ గొప్పవాడయ్యాడన్నది దుర్బుద్ధిలో కూడిన మాట అయినా శ్రీశ్రీ కమ్యూనిస్టుల మద్దతుని పొందగలిగాడంటే కయ్యంపడే అవసరంలేదు. నా.బా కి కూడా శ్రీశ్రీ కుండిన సమాన అవకాశమే ఉండింది. కాని శ్రీశ్రీ అగ్రగామిత్వం, ప్రపంచసాహిత్య రాజకీయ వరిణామాల్ని వెంటవెంటనే పసిగట్టగలగటం, స్పష్టంగా అంతర్జాతీయ శ్రామిక, అలగా పక్షపాతం వహించటం, ఏర్పరచుకోగలిగిన అభ్యుదయ బలగం, ఆ బలగంలో శ్రీశ్రీది తిరుగులేని నియంతస్థానం అవటం శ్రీశ్రీతో తొలినించీ పోటీ భావంతో వచ్చిన నా.బాని నిరాశకీ, నిరాశ్రిత బోదకీ చేర్చగలిగాయి. చివరికి కమ్యూనిస్టు వ్యతిరేకిగా బాహాటంగా ప్రకటించుకున్నట్టు చేశాయి. కమ్యూనిస్టు/అభ్యుదయ కవుల ఆచూకీ తెలిపేవాడిగా చేశాయి. ప్రజాస్వామ్య రక్షణ పేరుతో శ్రీశ్రీపై, మార్క్సిస్టు కవులపై దాడిచేసిన మహజరు సంతక సంఘానికి "కార్యదర్శి" గా చేశాయి.

లౌకికంగా అప్రయోజకత్వం, నిజ జీవితంలో పూర్తిగా ఓడిపోవటం కవి జీవితం అయితే నా.బా ది అచ్చమయిన కవి జీవితం అవుతుంది. నా.బాకి అన్యాయం జరిగింది. అయితే అది నా.బా చేతులారనే ఎక్కువగా జరిగింది. నా.బా ని లాగితెచ్చి మరింత దర్శనీయ అన్యాయ తద్దినం పెట్టటం అనవసర మవుతుంది.

నా.బా ఇంతలోనే విస్మృతుడు కాదగిన కవికాడు. ఆధునిక తెలుగు కవితా సంక్రమక సంధిలో నా.బాది విశిష్టమైన అతి నవ్యస్వరం. ఆధునిక కవితా వికాస చరిత్రలో నా.బా ది "ఫ్రాయిడో - మార్క్సిజం" కాగలిగిన చిరుపాయ.

**శ్రీ గూడ శ్రీరాములు**

# లేఖ

## అశోకుడి శాసనాలు

జూలై భారతిలో డా॥ సి. వి రామచంద్రరావుగారి వ్యాసం 'అశోక ధర్మశాసనాలు-ఒక సమీక్ష' అశోకచక్రవర్తి చరిత్రకుసంబంధించి అనేక కొత్త విషయాలు మాబోటి విద్యార్థులకు తెలిపింది. మేము రెండేండ్లుగా విశ్వవిద్యాలయంలో చదువుచున్నా, మా చరిత్రాచార్యులలో అధ్యాపకులలో, ఆంధ్రదేశంలో అశోకుని శాసనాలనుగురించికాని, ఇటీవల బళ్ళారిజిల్లాలోగాని, ఢిల్లీ మొదలైన ప్రదేశాలలోకాని వెలువడిన అశోకుని నూతన శాసనాలనుగురించీ, ఆఫ్ఘనిస్తాన్‌లో గ్రీకు, అరమైకభాషలలోఉన్న అశోకశాసనాలనుగురించి పొరపాటునగూడా చెప్పినవారు లేకపోయారు. ఆంధ్రప్రదేశ్‌లో అశోకశాసనాలగురించి డా॥ రావుగారు వివరణాత్మకంగా తెలిపినవిషయాలు ఆంధ్రులకు ఎంతో సంతోషం చేకూర్చేవి. క్రైస్తు మాతృభాష అరామైక్‌అని ఈ వ్యాసంనుండే నేము తెలుసుకొంటున్నాము. దీనినిబట్టి క్రైస్తుకు భారతదేశంతో (కాశ్మీర్‌లో) సన్నిహిత సంబంధం ఉందనేవిషయం నమ్మవలసిఉంది.

మన ప్రాచీన భారతదేశ చక్రవర్తులైన అశోకుడు, గౌతమీపుత్రశాతకర్ణి, సముద్రగుప్తుడు, హర్షుడు మొదలైన వారినిగురించి ఇట్టి సమగ్రమైన వ్యాసాలు భారతిలో ప్రచురించగలిగితే అవి మాబోటి విద్యార్థులకు ఎంతో ఉపయోగంగా ఉండటమేగాక ఆంధ్రులలో గొప్ప చారిత్రక స్పృహ కలిగించగలవు. డా॥ రామచంద్రరావుగారి కలంనుంచి ఇట్టి మరికొన్ని వ్యాసాలకు ఎదురుచూస్తుంటాము. అట్లే మీరు ఆంధ్రదేశచరిత్రకు సంబంధించిన వ్యాసాలు ఆంధ్రచరిత్ర-సంస్కృతి అనే పేరుతో ధారావాహికంగా ప్రచురించాలి. డా॥ రామచంద్రరావుగారి వ్యాసం పాత "భారతి"లలో డా॥ నేలటూరు, మల్లంపల్లి మొ॥ మహానుభావుల వ్యాసాలను జ్ఞాపకానికి తెచ్చింది.

**ఏ. సాయిబాబా**



# గ్రంథ విమర్శలు

## కట్నం కథలు

[కాలువ మల్లయ్య, చైతన్య పబ్లికేషన్స్, తెలుకుంట,
ఎనిమిది రూపాయలు]

ఇందులో వున్న పదిహేడూ కథలని అనేకన్నా రచయిత పొందిన చిరు ఆవేశానికి రూపకల్పనలని అనవచ్చు. చిన్నపిల్లలను కూర్చోపెట్టి కాకమ్మ కథలు చెప్పినంత సాఫీగా రచయిత తన అభిప్రాయాన్ని కథలుగా మలిచినట్టుంది. కథల్లో కథావస్తువుగాని, పాత్రలు - వాటి పోషణగాని, శైలిగాని .. వీటిలో ఏదైనా బాగుండాలి. పైగా పైవన్నీ ఎలా వున్నా తాను చెప్పదల్చుకున్నది చదువరిచేత వొప్పించే బాధ్యత రచయిత కచ్చితంగా తీసుకోవాలి దానికోసం కథా కల్పన చేయక తప్పదు ఈ కథలలో పైవేవీ కనబడవు.

**భూపతి**

## రెప్పలమధ్య ఆకాశం

[డాక్టర్ సుమనశ్రీ, వెల : రు. 10/-లు, ప్రతులకు : 1) దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, నారాయణగూడ; హైదరాబాద్, 2) వికాస పొయిట్రీ సర్కిల్; క్వా. నెం. సి 1; వికాసనగర్, హైదరాబాద్-500 598.]

సుమనశ్రీగారు గతంలో ఒక కవితాసంకలనాన్ని తెచ్చారు. అది రక్త నేత్రోదయం. రెప్పలమధ్య ఆకాశం వారి రెండవ కవితాసంకలనం. ఈ సంకలనంలో కవిగా సుమనశ్రీగారి ప్రాపంచిక దృక్పథం స్పష్టంగానే తెలుస్తుంది. కవిత్వంలో ఆధునికత వస్తువులో ముందుచూపు కలసి సుమనశ్రీగార్ని ఆధునిక వచన కవులలో మంచికవిగా గుర్తింపు తెచ్చినవి. పూర్వం భావకవులపై అస్పష్టత, అయోమయం పులుముడు దుర్లక్షణాలనే అపప్రథ ఉంది. ఈనాటి వచన కవిత్వంలో కూడా అస్పష్టత చోటుచేసుకొంటోందనే వాదం ఒకటుంది. ఆ వాదాన్ని ఖండించెయ్యటానికైనా ఈ కవులు తాము చెప్పదలుచుకున్నది సూటిగా కాకపోయినా 'ట్రాన్స్పరెంటు చీకటి'గానైనా చెప్పగలిగితే కవిత్వం ద్వారా తాము ఆశించిన సామాజిక ప్రయోజనం నెరవేరుతుంది. రెప్పలమధ్య ఆకాశంలో కవి అంతర్ముఖీనమైనప్పుడు అక్కడక్కడా ఈ అస్పష్టత కొంచెంగా చోటుచేసుకొంది.

ఈనాడు మనిషి అగ్నిపర్వతమై
　　　పేలడానికి సిద్ధంగాఉన్నాడు
ఈనాడు సూర్యుడుకూడా
　　　తుపాకులు పేలుస్తున్నాడు
　　　మంటల్ని విరజిమ్ముతున్నాడు
　　　ఈనాడు విప్లవాలు
　　　విజయాలవైపే దూసుకుపోతున్నాయి

అని సుమనశ్రీగారు అంటున్నారు ప్రతిమనిషి లోపలా ఒక అగ్నిపర్వతం ఉన్న మాట నిజమే. కాని అది పేలటానికి సిద్ధంగాలేదని ఈనాటి హింసా కళంకితమైన చరిత్ర చెబుతున్నది. శ్రామికవర్గం, పీడితవర్గం మొత్తంగా తిరుగుబాటుకు సిద్ధంగాలేదు. అక్కడా అక్కడా తిరుగుబాటుజెండా కనిపించినా అది నేల కొరగేదాకా దాని శత్రువు నిద్రపోవటంలేదు. ఈనాటి త్యాగమే రేపటి చరిత్ర అనుకోవటంతప్ప అధిక సంఖ్యాకులు ఏమీ చెయ్యలేకపోతున్నారు. ఆదర్శవాదం మీద అభిమానంతోపాటు ఆచరణలో ఉన్న కష్టనష్టాలను కూడా సుమనశ్రీగారు సరిగ్గా అంచనా కట్టగలగాలి.

కవిత్వం ఆకస్మాత్తుగా నీచెంత చేరి
నీ చేతిలో పిచ్చిగీతలు గీయదు
నిరంతరం తపస్సు చేస్తేతప్ప
నీ ప్రతి జీవకణంలోనూ
దాన్ని ప్రతిష్ఠించుకుంటే తప్ప
నీలో ఊపిరిపీలుస్తున్న సవాలక్ష నరాల్ని
అనుక్షణం మీటుకుంటే తప్ప
కవిత్వం నీలో బతకదు
నీ ఊపిరిలో కదలదు

అని సుమనశ్రీగారు 'ఋషి కానివాడు కవికాడు' అనే ప్రాచీన నిర్వచనానికి దగ్గరగా కవినిగురించి చెప్పారు. ఈనాటి తరానికి ఇది అవసరంకూడా. కవిత్వం రాయడం ఆషామాషీ వ్యవహారంగా ఒక దురదగా పరిగణింపబడుతున్న ఈరోజుల్లో కవిత్వం రాయడానికి అవసరమైన శక్తినిగురించి కవులు మననం చేసుకోవడం ఎంతైనా అవసరం. కవిత్వం రాయటమేకాదు; కవిత్వం చదవడం కూడా ఒక తపస్సేననే విషయాన్ని విస్మరించకూడదు.

ఈ కవితా సంకలనంలో సుమనశ్రీగారు చాలా సూక్ష్మాతి సూక్ష్మమైన అంశాలపై మంచి కవితా ఖండికలను రాశారు. రోజూ మనం చూస్తున్న ఆకాశమే ఆయన కలంలో కొత్త రూపుపొందింది. సాధారణ దృష్టికి సముద్రం ఉత్తి సముద్రమే. కాని కవి దృష్టిలో—

అనంత దుఃఖంలా పోగుపడ్డ సముద్రం
ఒక ఆశలుతెగిన పక్షి
కడుపులో పగిలే చిచ్చును దిగమింగుతూ
తన్నుతాను తవ్వుకుంటూ ఎటో పారిపోవాలని యత్నిస్తూ
పరామర్శకొచ్చే నిన్నూ నన్నూ
బరువైన విషాద గీతాల
కెరటాల్తో భయపెడుతూనేఉంటుంది

తాను చెప్పదలచిన సామాజిక విప్లవభావాన్ని నినాదప్రాయంగా కాకుండా కవితాత్మకంగా చెప్పారీకవి శబ్దసంయోజనం, శబ్దప్రయోగం రెండూ తెలిసి రాసిన కవిత్వమిది. ప్రతి కవితాభిమానులు తప్పనిసరిగా చదవవలసిన కవితా సంకలనం రెప్పలమధ్య ఆకాశం.

## తపన

[కె. యస్. రమణ, వెల రు 4/-లు ప్రతులకు: నిశి పబ్లికేషన్స్ కె. కె వారిపేట, సదుం (పోస్టు) చిత్తూరుజిల్లా-517 123]

ఈ సమాజాన్నిగురించి ఆలోచన ఉన్నవాడికి, ఆలోచన లేనివాడికి కూడా

తపన ఉంది. ఆలోచన ఉన్నవాడికి ఈ సమాజం ఎట్లా మారుతుందని; ఆలోచన లేనివాడికి యీపూట ఎట్లా గడుస్తుందని. ఆలోచన ఉన్నా లేకపోయినా ఇంకో విధమైన తపనగలవాళ్ళు కూడా ఉన్నారు. సంపాదించిన సొమ్ము చాలక దాన్ని పెంచే మార్గాలకోసం తపనపడేవాళ్ళు. ఇలా సంఘాన్ని, జీవితాన్ని గురించి ఎవడి తపన వాడిదిగుంటుంది.

రమణగారు ఆధునికమైన యీ జీవితగమ్యాన్ని గురించి, యీ వ్యవస్థను గురించి యీ కవితాసంకలనంలో ఎక్కువగా వేదనచెందారు.

"చీకటి ముళ్ళువిడని
కాంతి రెక్కవికసించని
యీ సుదీర్ఘ సంధ్యలో
బరువుగా
వెలితిన్ని మోసుకుని వెళ్తున్నాం
గుండెల్లో
చిరుల్ని దాచుకుని వెళ్తున్నాం"

అనటంలో సమాజస్వరూపం తేటతెల్లమవుతోంది. మనం ఇంకా రాత్రికి, ఉదయానికి మధ్యకాలంలో ఉన్నాం. ఇటు చీకటి పోదు; అటు వెల్తురు రాదు. ఇదొక సుదీర్ఘమైన సంధ్యాకాలం. దీంట్లో మానవుడు ఏకాకి. ఎవడి బాధ ఎవడికీ పట్టదు. జీవితం ఏకాంత శోకాంతం.

"కాతర వదనాలతో, వొంటరిగా సమూహంలో
వొంటరితనపు సమూహంలో
సకలమానవ సమాహారంగా
మణిబిల్లని రాజీల్లని
కోటవాళ్ళ కొంతల్లని
అజ్ఞాత గమ్యాంవేపు
జీవితమే ప్రమాణంగా
వెళ్తున్నాం; వెళ్తున్నాం"

యీ సంఘం ఎప్పుడికీ నీడనివ్వదు. జీవితంతాలూకూ ఆనందం జడత్వంలో దగ్ధంఅవుతోంది. ఎవడి మనస్సులో వాడు కూరుకుపోయాడు. అదైనా నిద్రిస్తున్న మనస్సులో. మానవునిలోని ఏకాకి మనస్తత్వాన్ని ఈ కవి చాలా బాగా చెప్పాడు.

"నేస్తం మనం చాలా మంచివాళ్ళం
మర్యాదస్తులం మస్తులు క్రింది రోగగ్రస్తులం
మాంసం నెత్తురూలేని వృత్తి ఎముకల పోగులం
యెవరికీ యేమీ హానిచెయ్యలేం
జెండాల చదరంగంలో అటూ, ఇటూ కదలాడే
నిమిత్తమాత్ర జీవులం అల్పసంతోషులం
యెవరిగదిలో వాళ్ళం స్వేచ్ఛగా బంధితులం"

యీ ఏకాంతంలోంచి, యీ జడత్వంలోంచి, యీ నిరాశలోంచి బాంబులు ధరిత్రికి చేస్తున్న గర్భస్రావాల్లోంచి, తెల్లటి పావురాలు తింటున్న తుపాకి దెబ్బల్లోంచి, ఒక సుందరస్వప్నాని నిజంచెయ్యటానికి మానవజాతి ముందడుగెయ్యాలనే ఈ కవి ఆశయం.

"నేస్తం

బతుకు
మధ్యే మార్గం మనికికాదు
ఆ వునికికి అర్థంలేదు"

అని ఘంటా పోషంగా చెబుతున్నాడియన. ఒక మంచి సంకలనాన్ని చదువుతున్నామనే స్పృహ యీ కవిత్వం చదువుతుంటే అనిపించకపోతే ఆ పాఠకుడు కవిత్వాన్ని చదవటానికి మరి పనికిరాడు.

# గురజాడ

[వి. ఆర్. నార్ల (ఆంగ్లమూలం) అనువాదం: కేతు విశ్వనాథరెడ్డి, వెల: రు. 4/- ప్రతులకు: సాహిత్య అకాడమీ, రవీంద్రభవన్. న్యూఢిల్లీ-110 001]

నార్ల వెంకటేశ్వరరావుగారు ఆంగ్లంలో రాసిన గ్రంథానికి శ్రీ కేతు విశ్వనాథరెడ్డి తెలుగుచేసిన గ్రంథం ఇది. సాహిత్య సామాజిక విషయాల్లో తెలుగువారి దృష్టిని ఆధునికతవైపు, సంస్కరణవైపు మళ్ళించిన మహనీయుడు గురజాడ అప్పారావుగారు వారి జీవిత సాహిత్యాలను గురించి సమగ్రంగా, సంపూర్ణంగా శ్రీ కె. వి. రమణారెడ్డిగారు 'మహోదయం' అనే గ్రంథంలో వివరించిఉన్నారు. భారతీయ సాహిత్య నిర్మాతలు అనే ఒక శీర్షికతో ప్రతి భాషలోని ప్రసిద్ధ సాహిత్య పురుషులను ఇతరభాషల్లోకి అనువదించి ప్రచురించే కార్యక్రమాన్ని కేంద్ర సాహిత్యఅకాడమీ చేపట్టి దివ్యంగా సాగిస్తున్నది. ఆ కార్యక్రమంలో భాగమే ఈ పుస్తకం.

ఈ పుస్తకంలో నార్లవారు గురజాడ జీవితరేఖలను, సాహిత్యయాత్రను విహంగావలోకంచేశారు. గురజాడపై పాశ్చాత్య తాత్త్విక కవుల ప్రభావం ఏమేరకు ఉందో ఆయన యీ గ్రంథంలో సూచించారు. వ్యావహారిక భాషను కావ్యభాషగాను, విశ్వవిద్యాలయాల్లో వాడుకునే భాషగాను ప్రవేశపెట్టడానికి ఆయనచేసిన కృషిని వివరించారు. నాటకరచన విషయంలో ముఖ్యంగా 'కన్యాశుల్కం' విషయంలో గురజాడ సాధించిన ఘనతను పొందిన వైఫల్యాన్నికూడా తన దృక్పథంలో అంచనాకట్టారు. గురజాడను 'ఓకవి'గా ఋజువుచెయ్యడానికి జరిగిన ప్రయత్నాలు తెలుగువారికి తెలియనివికావు. 'కన్యాశుల్కం' మీద జరిగిన శిల్పచర్చ సాహిత్యాభిమానులందరకూ తెలిసిందే. పెనుమార్పుకు మోకాలు అడ్డంపెడితే ఆగదని ఆ తరువాత చాలామందికి తెలిసింది.

గురజాడ తాత్త్వికచింతననూ, డైరీలు నోట్సులద్వారా ఆయన లోకజ్ఞతను; వ్యక్తిత్వాన్ని యీ చిన్నిగ్రంథంలో నార్ల బాగా విశ్లేషించారు. కవిత్వం, నాటకం, కథ మొదలైన సాహిత్యప్రక్రియలను గురించి అంతగా తెలియనివారికి కూడా వాటిపట్ల ఒక అభిరుచిని కలిగించేవిధంగా విశ్లేషణాత్మక వ్యాసాలు రాయటం కష్టం. కాని నార్లవారు చక్కనిభాషలో, సులువుగా బోధపరుచుకొనే పద్ధతిలో యీ గ్రంథాన్ని రాసి అదేమంత కష్టమైన పనికాదని భావించమన్నారు. ఆంగ్లమాతృకను జీవలక్షణంతో తెలుగుచేశారు విశ్వనాథరెడ్డిగారు. తెలుగులో కూడా మనం 'మూలమే' చదువుతున్నామనిపించేటంటి మౌలికమైన అనువాదం యిది. నార్లవారి తెలుగుశైలివేరు. మొత్తంమీద యీ పుస్తకం గురజాడను గురించి సమస్త సమాచారాన్ని విపులంగా కాకపోయినా వివరంగా అందిస్తుంది

# భీమన్న సాహితీ షష్టిపూర్తి సంచిక

[సంపాదకుడు : గనుమల జ్ఞానేశ్వర్, వెల: రు. 25/-లు, ప్రతులకు: 1) ఆంధ్ర సారస్వత పరిషత్; తిలక్‌రోడ్, హైదరాబాద్-500 001. 2) గనుమల జ్ఞానేశ్వర్; 6-3-825, బాలాపురం, హైదరాబాద్-500 004. 3) సుఖేలానికేతన్; ఐ.సి. 85, ఇరంమంజిల్ కాలని, హైదరాబాద్-500 004]

ఇది బోయి భీమన్నగారి సాహిత్యప్రస్థాన సంచిక. ఆయన రాసిన సర్వ సాహిత్య ప్రక్రియలను గురించి పలువురు పెద్దలు స్థూలంగానూ, సూక్ష్మంగానూ చేసిన సమీక్షలు ఈ సంచికలో కనిపిస్తై. భీమన్నగారు సంప్రదాయ పద్య

ఛందస్సులలోనూ, గేయాల్లోనూ, వచనగేయాల్లోనూకూడా కవిత్వం రాశారు. రూపకాలు రాశారు. నవలారంగ ప్రవేశంకూడా చేసినట్టుగా యీ సాహితీ షష్టిపూర్తి సంచిక చెబుతున్నది.

1911లో పుట్టిన భీమన్నగారు, 1922లో ఐదవతరగతి చదువుతుండగానే రచన ప్రారంభించినట్లుగా సంచిక చివర ఇచ్చిన జీవితవిశేషాలు చెపుతున్నై. యీమధ్యకాలంలో వారు అనేక సన్మానాలుపొందారు; బిరుదులు పొందారు; గౌరవాలు పొందారు. ఆయన రాసిన కవిత్వంకంటె పాలేరు నాటకం బాగా ప్రచారం పొందిందని జనవాక్యం.

ప్రతి కవి రచయితా, కళాకారుడూకూడా తన సృష్టివల్ల క్రొంత సాంఘిక ప్రయోజనాన్ని ఆశిస్తాడు. భీమన్నగారు తన రచనలవల్ల సంఘ సంస్కరణాన్ని ఆశించారు. కవిత్వంలో ఆయనొక వినూతనమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. అది రసాద్వైతం. ఆ సిద్ధాంతం ఏమంత ప్రచారంపొందినట్టులేదు" ఏక హృదయ సంసిద్ధే రసాద్వైతం, లోకహృదయ సంబుద్ధే దాని తత్త్వం" అని చెప్పారు భీమన్నగారు. శృంగార రసం ఉత్తమమైనదని, అందులో విప్రలంభ శృంగారం ఉత్తమోత్తమమైనదని వారి ఉద్దేశం.

భీమన్నగారు అనేక కావ్యాలు రాశారు. పతితజనోద్ధరణకోసం వారి సృష్టిని అంకితంచేశారు. సమకాలీన కవులలో ప్రతిభావంతులైన వారిలో శ్రీ భీమన్నగారు ఒకరు. ఏ కవికైనా ప్రాణవంతమైన కవిత్వమే ఆస్తికాని బిరుదులూ, సత్కారాలూ, సన్మానాలూకాదు. కొంతమంది కవులకు ఉత్తబిరుదులే మిగిలిపోతై చివరకు. ఎప్పుడూ రచయితకున్న ఇతరమైన అవార్డులకంటె అతని రచనే గొప్పది: అది నిజంగా గొప్పదైతే భీమన్నగారికిజరిగిన అనేక సత్కారాలు బిరుదుప్రదానాలకంటె ఆయన రచనలు గొప్పవని వేరే చెప్ప పనిలేదు. రాగ వైశాఖిమీద జరిగిన రగడ సాహిత్యవేత్తలకు తెలియని విషయంకాదు.

ఇంత ప్రతిభా వ్యుత్పన్నతలున్నకవి సమకాలీన కవిత్వంమీద అతితేలికైన అభిప్రాయాలివ్వటం దురదృష్టకరం. "ప్రాచీన- అభ్యుదయ - ఆధునిక సాహిత్యాలు నాకు గిట్టవు. ఇప్పుడువస్తున్న వచనకవిత్వమూ నచ్చదు. అందులో వచనంతప్ప కవిత్వంలేదు. నేటి సాహిత్యంలో కేవలం నినాదాలూ, మాటలు మాత్రమే ఉన్నాయి. సెక్సూ రాజకీయాలూ తప్ప సాహిత్యం లేదు" అని ఆయన అనటం సాహిత్యాన్ని చదవకపోవటం వలన మాత్రమే. శ్రీశ్రీ చెప్పినట్టుగా ఏ కవికి ఆ కవే శ్రోత అవటంవల్ల ఇట్లాంటిప్రమాదాలే వస్తై. "నేను ఏ సాహిత్యమూ చదవను" అని ఆయనే 'చెప్పారుగనుక ఇలా బోధించవలసి వస్తోంది. చదివితేనేగదా! మంచి చెడులు తెలిసేది. "శ్రీశ్రీ పుట్టి సాహిత్యాన్ని మంటసాలపుట్టి సంగీతాన్ని నాశనంచేశారని నా ఉద్దేశం. యువతరాల కళారాధకుల పాలిటికి వాళ్ళిద్దరూ పైడ్ పైపర్లు అయినారు.... సాహిత్యంమాత్రం శ్రీశ్రీ చేతుల్లో చావుదెబ్బతిన్నది"అన్న బాపురెడ్డిగారి గద్యకావ్యాలకు భీమన్నగారి పీఠికలో అంశాలను ఉదహరించి బాపురెడ్డిగారు ఆమాటలను రైట్‌సెన్స్‌లో సమర్థించటానికి చాలా ప్రయత్నించారు. దేవుడు సృష్టిచేశాడనేది కొంతమంది నమ్మకం. ఆ నమ్మకంప్రకారం చాలామంది తమను తాము కోల్పోయి ఆదేవుడికే అంకితం అయ్యారు కనుక దేవుడిచేతిలో సృష్టి చావుదెబ్బతిన్నది అని చెబుతామా? బాపురెడ్డిగారి మాటలలోనే" నిజానికి ఈతెగడడంకూడా ఒకరకంగా వారిని పొగడడమే" అయితే భీమన్నగారికి మరొకర్ని పొగడవలసిన అవసరంలేదు ఎంచేతంటే ఆయనకు ఈ కవిత్వం ఏదీ నచ్చదుగనుక. నిజంగా శ్రీశ్రీ చేతుల్లో సాహిత్యం చావుదెబ్బ తినిఉంటే భీమన్నగారివల్ల అది జీవించదని ఖండితంగా చెప్పవచ్చు. భీమన్నగారు వేసిన దారిలోనే కొంత ప్రతిభను ప్రదర్శించి ముందుకు వెళ్ళారేగాని ఆయన నూతనసృష్టికి కారకుడుకాదు. కాగా ఆయన రసాద్వైత సిద్ధాంతం ఆయనకే పరిమితమైంది కాని విస్తరించలేదు.

అభిప్రాయభేదాలెలాఉన్నా ఈ విశిష్ట సంచిక భీమన్నగారి జీవిత సాహిత్యాలకు ఎత్తిన జెండా.

## భారమింతి

(కవితా సంపుటి)

[కె. శివారెడ్డి, వెల: రు. 5/-లు, ప్రతులకు : దేశి బుక్‌డిపో, నారాయణగూడ, హైదరాబాద్.]

శివారెడ్డి ఈతరం వచన కవిత్వం రాస్తున్న కవులలో ఒక ప్రత్యేక వ్యక్తిత్వం కలిగిన కవి అని అయన లోగడ రాసిన వచన కవితాసంకలనాలు చెప్పినై. ప్రస్తుత ఈ కవితా సంకలనంతో వచన కవితా సంవిధానంలో, సామాజిక విప్లవదృష్టిలో ఇంకోమెట్టు పైకెక్కారు శివారెడ్డి. కవిత్వంలో రాజకీయాలు, సమకాలీన జీవిత వికృతి, దారిద్ర్యం, ఆకలి, అశాంతి ప్రవేశిస్తే అది కవిత్వం కాకుండా పోతుందని భావించేవాళ్ళు అనేకమంది ఉండవచ్చు. జీవితానికి అనేక కోణాలున్నై. ఏదో ఒకటిమాత్రమే చూసితృప్తిపడేవాళ్ళను పడనివ్వండి. జీవితాన్ని పాక్షికంగాకాక సంపూర్ణంగా దర్శించగలిగినవాడు మాత్రమే జీవితాన్ని మార్చటానికికూడా ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో అనేక వైఫల్యాలను, అవరోధాలను, అభిశంసలను అతను ఎదుర్కోవలసిరావచ్చు. చిత్తశుద్ధి, నిజాయితీ, నమ్మిన సిద్ధాంతంపట్ల అచంచలమైన విశ్వాసం, వారి కవితా సంవిధానంపట్ల దృఢమైన నమ్మకంగల ఈనాటి కవులు చాలామంది వీటిని ఎదుర్కొంటున్నవాళ్ళే.

శివారెడ్డి ఈ సంకలనంలో ఈనాటి వ్యవస్థను, దాని దురాగతాన్ని కావ్యస్తంచేశారు. ఈనాటి కవిత్వమంతా నినాదప్రాయమని కళ్ళుమూసుకొని కాగితాల్ని ఖరాబుచేస్తున్న వాళ్ళంతా ఒక్కసారి కళ్ళుతెరిచి యీ సంకలనాన్ని చదివితే కవిత్వం అయిందేదో, కవిత్వం కానిదేదో వాళ్ళకు తెలుస్తుంది. కవిత్వం అవటానికి కాకపోవటానికి కవిత్వంకాకుండా వేరేకారణాలు రాజ్యంచేస్తుండడం వల్ల ఈవివిధమైన అభిప్రాయాలు కలుగుతున్నై. ఏనాడూ కవిత్వానికి కాలం చెల్లదు. ప్రతి కాలంలోనూ ప్రతిభావంతులైన కవులు ఉండనే ఉంటారు. దృగంధులకు మాత్రమే కవిత్వం కనిపించదు.

కవిత్వానికి కాలం చెల్లిందంటున్నారు
కవిత్వానికి కాలం గాదంటున్నారు
•అంతటా స్తబ్దత ఆవరించిందంటున్నారు
అందరూ చేతులెత్తేశారంటున్నారు
రక్త మాగిపోయినవాడు స్పందనని కొలవలేడు

కళ్ళల్లో సూర్యుడు కదలాడనివాడు
ప్రపంచాన్ని స్పృశించలేడు

అని శివారెడ్డిగారు చెపుతున్నారు. ఇవి ఈ కవితాసంకలనానికి ప్రారంభ పాదాలు.



ఏ ఏ చోట్ల తనకు కవిత్వం కనబడుతోందో ఆయన చెపుతాడు అయాచోట్లను మనం గుర్తుంచుకుంటే శివారెడ్డి కవిత్వ పరమార్థం తెలుస్తుంది ఎకసించే పువ్వులో, ప్రేయసి ఒడిలో, కోయిల కూతలో, సెలయేటిగానంలో, స్త్రీ షోజాల్లో ఊరువుల్లో, పిరుదుల్లో కొంతమందికి కవిత్వం కనబడవచ్చు.

ఇటు తిరిగి చేయిచాస్తే శ్రీకాకుళ కవిత్వం
అటు తిరిగి కనుతెరిస్తే జగిత్యాల కవిత్వం
వెసు తిరిగి శిరసెత్తితే ధర్మపురి కవిత్వం
ఆర్కాటుజిల్లాల కవిత్వం

వాడు చేయెత్తితే కవిత్వం-వాడు పెళపెళార్భటుల్తో ఉరిమితే కవిత్వం-
చేతులన్ని ఒక్కసారిలేచి 'ఇంక్విలాబ్' అంటే ఆకాశమంతా కవిత్వమే-
గాలి గాలంతా కవిత్వమే-భూమి తనువంతా కవిత్వమే

అంటున్న శివారెడ్డి కవులలో ఏవైపు నిలబడిందీ స్పష్టమే కవిత్వం చెప్పటంలో రెండుపద్ధతులున్నై. ఒకటి సూటిగా చెప్పటం; రెండు ప్రతీకలద్వారానో పద చిత్రాలద్వారానో, భావచిత్రాలద్వారానో తను ఉద్దేశించిన భావాన్ని పాఠకునికి బట్వాడాచెయ్యటం ఈ రెండు పద్ధతులుకూడా శివారెడ్డి కవిత్వంలో కనిపిస్తయి సందర్భం, అవసరాన్నిబట్టిమాత్రమే ఈ పద్ధతులను అనుసరించటం సరైన కవి లక్షణం శివారెడ్డి కవిత్వనిర్మాణ రహస్యాలు తెలిసినవాడు కనుక ఆయా పద్ధతులను అవసరాన్నిబట్టి వినియోగించుకున్నాడు. ఉదాహరణకు ఈనాడు అమాయకజనంలో చైతన్యంకలిగిందని తాను ముగ్ధుడైన సందర్భాన్ని కవితా మయం చేస్తున్నప్పుడు పై రెండుపద్ధతులను ఏకకాలంలో ఉపయోగించాడు.

గిరిజనుల గర్జనల్తో మేల్కొన్న అడవినిజూచి
నేటికిగదా వీడికి లక్ష్యశుద్ధి కుదిరిందని-
నేటికిగదా వీడు పొరలు చించుకుని
బయటికొచ్చి వీరవిహారం చేయడంనేర్చుకొన్నాడని
నేటికిగదా వీడు తనని తొక్కిపెట్టినప్పుడు
లావాగా పుష్పించడం నేర్చుకున్నాడని
నేటికిగదా వీడు వేటగాణ్ణి వేటాడటం నేర్చుకున్నాడని
ఇంద్రవెల్లి ఏం ఖర్మ-సింగరేణి వొగ్గుగనులేం ఖర్మ
ఎక్కడ దోపిడీఉంటే అక్కడ నూత్నమానవుడుదయిస్తాడు
సిందూరం రక్తచందనరాగాల రగిల్‌ఝండాతో ప్రవేశిస్తాడు.

అని మేల్కొన్న జనంపట్ల తన హర్షాన్ని ప్రకటించేటప్పుడు కవి ఆత్మకావ్యాత్మగా ప్రతిఫలించింది.

ఈదేశంలో రక్తం ప్రవహించినంత సత్యంగానే / ఈ భూమిలో విత్తనాల జన్మలున్నంత సత్యంగానే / నేను నిజం - నా బాధ నిజం - నా ఉనికి నిజం - నా గొంతు నిజం / అని భౌతిక జీవితపు అస్తిత్వాన్ని, దాని యాధార్థ్యాన్ని యీ సంకలనంలో కవితామయం చేసాడు శివారెడ్డి ప్రతిఖండికా దేనికదే ప్రత్యేకత. ఈనాటి వచన కవిత్వమంతా చెత్త. మాటల పోగులు, ఉత్తనినాదాలు చౌకబారు ప్రేలాపనలు, అల్పమైన ఆలాపనలు అని చౌకబారు మాటలు మట్లాడే పరిశుద్ధ కళావాదులంతా ఈ కవితాసంకలనం చదివితే తాము ఎన్ని శతాబ్దాలు వెనకపడి ఉన్నారో తెలుస్తుంది.

**టి. ఎల్. కాంతారావు**

# ఇండియన్ లిటరేచర్

(భారతీయ సాహిత్యము)

[సాహిత్య అకాడెమి, న్యూఢిల్లీ ప్రచురిస్తున్న సాహిత్యపత్రిక, ద్వైమాసికము; సంపాదకుడు: యస్ బాలురావు, 1) నంబరు 109 సెప్టెంబరు-అక్టోబరు 1985, పుటలు 244 2) నంబరు 110 నవంబరు-డిసెంబరు 1985, పుటలు 196. ప్రతి వెల. రు. 2/-లు. డెమ్మీ 1/8. దొరుకుచోటు : సాహిత్య అకాడెమీ, రవీంద్రభవన్, న్యూఢిల్లీ-110 001]

కేంద్ర సాహిత్యఅకాడెమీ, న్యూఢిల్లీ "ఇండియన్ లిటరేచర్" (భారతీయ సాహిత్యం) అనే పత్రికను గత 28 ఏండ్లనుండి ప్రచురిస్తున్నది ఈ పత్రిక ఇంగ్లీషులో ఉంటుంది ఇరవైరెండు భారతీయ భాషాసాహిత్యాలకిది దోహదం చేస్తున్నది. ప్రకృతం సమీక్షిస్తున్న సంచికలు

1) నంబరు 109: ఇందు 1984లో సాహిత్య అకాడెమీ అవార్డులను పొందిన భారతీయ భాషలలోని పుస్తకాల పరిచయమూ, ప్రశస్తి, ఆయాభాషల నిష్ణాతులచే వ్రాయబడినది తెలుగులో బహుమతిపొందిన కీర్తిశేషుడు శ్రీ ఆలూరి బైరాగిగారి "ఆగమగీతి" గురించి శ్రీ వాడ్రేవు పతంజలిగారు వ్రాసిన సమీక్ష హృదయావగాహిగా ఉంది. ఇదేసంచికలో 1985లో భారతీయ జ్ఞానపీఠ పురస్కారంపొందిన మళయాళీ నవలాకారుడు శ్రీ తకళీ శివశంకరపిళ్లై ("చెమ్మీన్" నవలాకర్త) ఛాయాచిత్రమూ, ప్రశస్తి ఆయనవే రెండు చిన్న కథలూ ఉన్నాయి.

2) నంబరు 110. యీసంచికలో 1984లో వివిధ భారతీయ భాషలలో వెలువడిన సాహిత్య సమీక్ష (సర్వే) లున్నాయి. ఇందులోకూడా తెలుగు సాహిత్యంపై శ్రీ పతంజలిగారు వ్రాసినారు. సోమసుందర్ రచనలగురించి వ్రాసినది చాలా బాగున్నది;

యీ సంచికల ముద్రణ, గెటప్‌లు ఉన్నతస్థాయిలో ఉంటాయి. నేనీ పత్రికను గత కొన్నిఏండ్లనుండి చందాకట్టి తెప్పించుకొంటున్నాను. 1985 వరకు సంవత్సరం చందా రు. 12 ఉండేది 1986 నుండి హఠాత్తుగా రు. 20కి పెంచబడింది.

## నామదేవుడు

[మరాఠీ మూలం మాధవగోపాల్ దేశ్‌ముఖ్; హిందీ అనువాదం ప్రభాకర మాచ్వే; తెలుగుసేత భీమసేన్ నిర్మల్; సాహిత్య అకాడెమీ. ఢిల్లీ ప్రచురణ; డెమీ ⅛; పుటలు 76, వెల: రు. 4/-లు]

"భారతీయ సాహిత్య నిర్మాతలు" అనే ప్రణాళిక క్రింద కేంద్ర సాహిత్య అకాడెమీ, ఢిల్లీ భారతీయ భాషలలోగల ప్రాచీన అధునాతన రచయితల సాహిత్యాన్ని అందరి అందుబాటులోనికి తెచ్చేందుకు; ఆయాభాషలలోని పండితులచే చిరుపొత్తములను వ్రాయించి అన్నిభాషలలోకి తర్జుమాచేయించి సరసమైన ధరకమ్ముచున్నది.

ప్రకృత గ్రంథం "నామదేవుడు" ప్రాచీన మరాఠీ 'అభంగ" కర్త భక్తుడు అయిన నామదేవుని గురించినది ఈ గ్రంథం అనువాదానికి అనువాదం. ఇందు 13వ శతాబ్దంవాడయిన నామదేవుని ఉన్మాదికం అయన కుటుంబపరిస్థితులు భక్తితత్వం అయన "అభంగ్"లనే కీర్తనల సారస్యం తెలుపబడినవి. నామదేవుని అభంగులు భీమసేనజోషి, జితేంద్ర అభిషేకి, సుధీర్‌ఫడ్కే వంటి గాయకులు పాడగా వింటూంటే ఎంతో ఆనందం కల్గుతుంది మరాఠీలో "అభంగ్" అనే కీర్తన బాణీకి నామదేవుడు ఆద్యుడు. తర్వాత తుకారాం ఈ "అభంగ్"లను మహోన్నత స్థితికి తీసికొనిపోయినాడు. 67వ పుటలో ఇచ్చిన అభంగ్ వ్యాఖ్యానం సరికాదని నా యభిప్రాయం. "కారుచీకట్లు, నల్లని మేఘాలు, యమున, నామదేవుడి విష్ణువు నల్లనివాడు" అనే అభంగ్‌మీద మూలరచయిత ఇట్లా వ్యాఖ్యానిస్తున్నాడు. "పారమార్థికంలో నిమగ్నుడైన సాధకుడి మనోదశను పాశ్చాత్య రచయితలు "డార్క్‌నైట్ ఆఫ్ దిసోల్" అన్నారనీ, తన సాధనావస్థలోని పరీక్షాసమయాన్ని నామదేవుడు "చీకటిరాత్రి"తో పోల్చాడు. పాశ్చాత్యులేదో అంటే అనియుండవచ్చుకానీ, ఈ కీర్తనలో నాయికానాయకులు (నామదేవ-విష్ణువు) తాదాత్మ్య హర్షాతిరేకమే (ఇంగ్లీషులోనే చెప్పవలెనంటే ది ఎక్స్టసీ ఆఫ్ యూనియన్") వర్ణితం శ్రీకృష్ణుని నల్లదనం కాంతిని విరజిమ్ముతుంటే చీకటి ఎక్కడుంటుంది? శ్రీ భీమసేన్ నిర్మల్ తెలుగుసేత పఠనీయంగా వుంది. గ్రంథం నామదేవ రత్నఖనిని దిఙ్మాత్రంగా వెలుగులో చూపించే కరదీపిక.

**సర్దేశాయి తిరుమలరావు**

## శ్రీరమణ చరితామృతము

[రచన: శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మ, ప్రాప్తిస్థానం: ఆర్. శ్రీరాములు 15/62 కమలానగర్ అనంతపురం-515 001. వెల: 5/-]

శ్రీ రమణస్మరణము (గీర్వాణాంధ్ర పద్యాత్మకము) శ్రీరమణ చరితామృత సారము, శ్రీమహర్షి రమణోపదేశములు అనే మాటనే చేర్చి యీ కృతికి ఆకృతికలిగించారు శ్రీరమణ సత్సంగం- (అనంతపురం)వారు.

శ్రీ శర్మగారి సంస్కృతమూ తెలుగూ సరితూకంగా సులలిత పద బంధురములై ఉన్నాయి.

'రమణర్షే! నమస్తుభ్యం యస్య స్మరణమాత్రతః
కంపతే కిల కామోపి యేన సర్వే వయం జితాః'

'ఏకీతిని పరికించిన సారామలగుణమనోజ్ఞ సర్వజ్ఞుడు మా శ్రీరమణుడు పరిపూర్ణుండారాధ్యుడు వంద్యులగు మహాత్ములకెల్లన్'-

మహర్షి జీవితవిషయం ముఖ్యఘట్టాలతో క్షిప్రసం వేద్యమానమయి ఉన్నది. ఉపదేశభాగములో చివరిది 'మహామంత్రము! 'నేను'- నిర్వచనం అది. అలాచెప్పడం మహర్షికే చెల్లింది. దానిని అంత సులభబోధ్యంచేసి శర్మగారు జిజ్ఞాసువులకు అభినందనీయులయారు.

## "తెలుగు నాటకం" (నాటక సాహిత్య వ్యాసాలు)

[రచయిత : డాక్టర్ ఎస్. గంగప్ప ఎం.ఎ.పిహెచ్‌డి. ప్రచురణ : శ్రీమతి ఎస్. పార్వతమ్మ, శశీ ప్రచురణలు, . 73, శ్రీనివాసనగర్ కాలని, గుంటూరు-522 002. డెమ్మి 1/8-X+176 పుటలు-వెల:15 రూపాయలు.]

కోలా చలం శ్రీనివాసరావు నాటకాలపై పరిశోధన గావించి డాక్టరేట్ పట్టమందుకున్న, డాక్టర్ ఎస్. గంగప్పగారి నిత్యసాహిత్య పరిశోధనా ఫలితంగా వెలువడిన ఇరవై రెండు నాటక సాహిత్య వ్యాసాల సంపుటమిది.

'పందొమ్మిదో శతాబ్దిదాకా తెలుగులో నాటకాలు వెలయనందుకు కారణాలు' అన్న మొదటి వ్యాసంలో, ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో నాటకాలు లేనంత మాత్రాన తెలుగువారికి నాటక కళ అంటే తెలియదు అనుకోవటం సముచితం కాదన్నారు. వైదికమత ప్రాబల్యం వున్న ఆ కాలంలో సంస్కృత గ్రంథాల అనువాదాలే ప్రధానంగా వచ్చేవి. విజయనగర రాజులు, తంజాపూరు నాయకుల కాలంలో యక్షగానాలకున్న ప్రాచుర్యం నాటకాలకు లభించకపోయి వుండవచ్చునని గంగప్పగారి అభిప్రాయం. అంతేకాక నాటక వాఙ్మయమన్నా నటులన్నా సంఘంలో గౌరవం లేకపోవటం, తెలుగులో లక్షణ గ్రంథాలు లేకపోవటం, శ్రవ్య కావ్యాలకున్న ఆదరణ దృశ్య కావ్యాలకు లేకపోవటం మున్నగునవి ప్రధాన కారణాలుగా పేర్కొన్నారు.

రెండవ వ్యాసంలో, ఆంగ్ల, పార్శీ నాటకాలు తెలుగు నాటకాలను ప్రభావితం చేసిన తీరును విపులంగా చర్చించారు. తొలుత ఆంగ్లనాటక ప్రభావం పార్శీ, మరాఠీ నాటకాలపైబడి వాటిద్వారా తెలుగు నాటకరంగం ప్రభావితమైందన్నారు. 1880 లోనే 'ధార్వాడ నాటక కంపెనీ' ఆంధ్రదేశమంతటా సంచరించి ప్రదర్శన లిచ్చింది. ఆ విధంగా కన్నడ నాటక ప్రభావం తెలుగు వారిలో సంచలనం కల్గించిందని చెప్పవచ్చును. ఈ విషయాన్ని వీరేశలింగం పంతులుగారు తమ స్వీయచరిత్రలో వివరించారు.

'తెలుగు నాటక సాహిత్యం' అన్న వ్యాసంలో తొలి తెలుగు నాటకం 'మంజీర మదుకరీయము' అని, దానిని 1860లో కోరాడ రామచంద్రశాస్త్రిగారు రచించారని పేర్కొన్నారు. ఆంగ్ల నాటకాలను అనువదించిన వారిలో వావిలాల వాసుదేవశాస్త్రిగారు మొదటి వారని, "జూలియ సీజర్" వారి మొదటి ఆంగ్లానువాద నాటకం (1874) అన్నారు.

"నాటక కర్తగా కందుకూరి వీరేశలింగం పంతులుగారు" అన్న వ్యాసంలో పంతులుగారు ఇతరాధునికాంధ్ర సాహిత్య ప్రక్రియల కాద్యులైనట్లే నాటక రచనకు కూడా ఉత్తర సర్కారులలో మొదటివారనడం సత్యదూరం కాదు. పంతులుగారు పౌరాణిక నాటకాలలోను, అనువాదాలలోను గ్రాంధిక భాషను వుపయోగించారని, ప్రహసనాలన్నీ వ్యావహారిక భాషలోనే రచించారని డా॥ గంగప్పగారు పేర్కొన్నారు.

'చిలకమర్తివారి నాటకాలు' అన్న వ్యాసంలో వారి స్వతంత్ర నాటకాలను, అనువాద నాటకాలను పేర్కొని, గయోపాఖ్యాన నాటకం పట్ల ఆంధ్ర ప్రజాళికి గల ఆదరాభిమానాలను విశదీకరించారు. చిలకమర్తివారు జీవించి వుండగానే వారి గయోపాఖ్యాన నాటకం ప్రతులు లక్షకు పైగా అమ్ముడు పోయాయన్నారు.

'ఆంధ్ర నాటక పితామహుడు' అన్న వ్యాసంలో ధర్మవరం వారి నాటక రచనలోని ప్రత్యేకతను చక్కగా నిరూపించారు. మొట్టమొదటి విషాదాంత నాటకం రచించినవారు ధర్మవరం. తొలితెలుగు స్వతంత్ర నాటక

కర్తలుకూడా వారే.

ఆంగ్ల నాటకాలచే ప్రభావితులైన ధర్మవరంవారు స్వయంగా నటించి, రంగస్థలంపై అనుభవ పూర్వకంగా పెక్కు మార్పులు చేసిన మహనీయులన్నారు.

"ఆంధ్ర నాటక రంగానికి శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారి సేవ, కోలాచలంవారి నాటకాల్లోని సామాజికత, కోలాచలంవారి ప్రహసనాల ప్రాముఖ్యం, అన్న మూడు వ్యాసాలలో శ్రీనివాసరావుగారి నాటక రచనా ప్రతిభను విపులంగా వివరించారు. చారిత్రక నాటక రచన కాద్యులైన కోలాచలం వారు ప్రథమాంధ్ర నాటకశాల నిర్మాతగా సువిఖ్యాతులు. రావుగారు పదివేల రూపాయలు వెచ్చించి బళ్ళారిలో 1905లో నిర్మించిన వాణీవిలాస నాటకశాలను లోకమాన్య బాలగంగాధర తిలక్‌గారు ప్రారంభించారు. ప్రాచ్య పాశ్చాత్య నాటకాలను విస్తృతంగా అధ్యయనం చేసిన కోలాచలంవారు, "ప్రపంచ నాటక చరిత్ర" (దడ్రమెటిక్ హిస్టరి ఆఫ్ దవర్‌ల్‌డ్) అన్న ఉద్గ్రంధాన్ని ఆంగ్లంలో రచించారు. కోలాచలంవారి నాటకాలలోనే ఎక్కువగా పాల్గొని అఖండ యశస్సు నార్జించారు. బళ్ళారి రాఘవ, కోలాచలం వారు "ఆంధ్ర చారిత్రక నాటక పితామహ" బిరుదమును ఏ విధంగా సార్ధకపరచినదీ డా॥ గంగప్పగారి మూడు వ్యాసాలలో చక్కగా నిరూపించారు.

సమాజంలోని దురాగతాలను బహిర్గతం చేస్తూ, ఉన్నత నైతిక భావాల వ్యాప్తికి గురజాడ వారే విధంగా కృషి చేశారన్న విషయాన్ని "ప్రథమ సాంఘిక నాటక ప్రణేత గురజాడ" అన్న వ్యాసంలో వివరించారు.

"వేదం వేంకటరాయశాస్త్రిగారి రూపకాలు" అన్న వ్యాసంలో శాస్త్రిగారు' షేక్స్‌పియర్ కాళిదాసులను చదివి ఆశ్చర్యపడి నాటక రచనాభిలాష వహించితి' అని చెప్పికొన్నట్లు పేర్కొన్నారు. వేదంవారు పాత్రోచిత భాషను నాటకాలలోపెట్టి, దానికో స్థానం కల్పించారు. వేదం వారి రూపకాలలో హాస్యం సమున్నత స్థాయినందుకున్నదన్నారు.

వేదంవారు, బొబ్బిలియుద్ధం నాటకంలో పాత్రోచిత భాషను ఏ విధంగా వాడినదీ సోదాహరణంగా వివరించారు.

"పానుగంటివారి రాధాకృష్ణ-భక్తిరసం" అన్న వ్యాసంలో, రూపగోస్వామి, మధుసూదన సరస్వతిగార్ల భక్తి రసమును సిద్ధాంతీకరించిన తీరును, వివరించారు.

"రాయలసీమ నాటక కళలు" అన్న వ్యాసంలో రాయలసీమ నాటక రచయితలను, వారు రచించిన నాటకాలను పేర్కొన్నారు.

అవధానులుగ అఖండకీర్తి ప్రతిష్ఠలనార్జించిన తిరుపతి వేంకట కవులు పాండవోద్యోగ విజయాలనే నాటకాలతో ఆంధ్రుల ఆదరాభిమానాలను చూరగొన్న వైనమును చక్కగా విశదం చేశారు. "తిరుపతి వేంకట కవుల భారతనాటకాలు' అన్న వ్యాసంలో.

తెలుగు ఏకాంకికలు - సామాజిక స్పృహ అన్న వ్యాసంలో, పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో వెలువడినవిభిన్న ప్రక్రియలలో ఏకాంకికలు' పేర్కొనదగినవి. ప్రసిద్ధ ఏకాంకికా రచయితలను, వారి రచనలను ఉద్దేశాలను, లక్ష్యాలను తెలియజేశారు. నాటికల్లో రావలసిన ఉత్తమమైన మార్పులను గురించి డా॥ శ్రీ పాద గోపాలకృష్ణమూర్తిగారి మాటలను యీ రీతిగా పుటంకించినారు. 'తెలుగు ఏకాంకిక పత్రికాభూమి వదలి, రంగ భూమిలోకి రావాలి. శ్రీ రాజమన్నారు. నిశితమైన భాషా, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రికి లోతులు చూడగల దృష్టి అలవడాలి. నార్ల సందేశానికి బరువూ, బుచ్చిబాబు వాక్యాలకి వక్తృత్వమూ అలవడాలి. శ్రీ కృష్ణశాస్త్రి కవితా కన్యకి ఇహలోకయాత్రా, శివశంకరశాస్త్రి పాండిత్యానికి కార్యదీక్షా అలవాటవాలి. అయితే ఏకాంకికలకి రంగాభిషేకం. విశ్వసాహిత్యంలో ప్రవేశించిన తెలుగు ఏకాంకికలకి అప్పుడూ ప్రభావమహోత్సవం" (భారతి-విరోధి పుష్యమి-పు.46)

ఆధునిక నాటకంలో ఎన్నో కొత్త ధోరణులు వెలిశాయి. వాటిలో అబ్సర్ధ్ థియేటర్, ఎక్స్‌ప్రెషనిస్ట్ థియేటర్, ఎపిక్ థియేటర్, సింబాలిస్టిక్ థియేటర్, థియేటర్ ఇన్‌రౌండ్, ఎలియనేషన్, ఎక్స్‌టెంపోర్ వంటి ధోరణులు ప్రముఖంగా వున్నాయి.

గంగప్పగారు "తొలి అబ్సర్డ్ నాటక కర్త దోనేపూడి రాజారావు అన్న వ్యాసంలో అబ్సర్డ్ నాటకాల తీరుతెన్నులను, విశ్లేషిస్తూ ప్రధానంగా రాజారావుగారు రచించిన "వ్యాధిగ్రస్తుడు' చంద్రశిల. ఇదినిజం, దోషి, సరస్వతి. నిలయం నాటికల ఇతి వృత్తాంతాన్ని, శిల్పాన్నీ విపులంగా విశ్లేషించారు.

పై వ్యాసాలన్నీ ఒక ఎత్తు అయితే, గంగప్పగారు అనుబంధములో రచించిన "మృచ్ఛకటికమూలము-చారుదత్తము" అన్న వ్యాసమే ఒక ఎత్తు. ఈ వ్యాసం గంగప్పగారి నిశితమైన పరిశీలనకు తులనాత్మక అధ్యయనానికి మచ్చుతునక అని చెప్పవచ్చు. ఈ వ్యాసంలో గంగప్పగారు వివిధ పరిశోధకుల అభిప్రాయాలను పేర్కొంటూ భాసకృతమైన చారుదత్త నాటకాన్ని పెంచి "మృచ్ఛకటికంగా" శూద్రకుడు 10 అంకాల ఉత్తమ రూపకంగా రచించాడని నిరూపించారు. చారుదత్త - మృచ్ఛకటికాల సంబంధాలను మూడు విధాలుగ చెప్పటం జరిగిందన్నారు.

"విక్రమోర్వశీయము-విదూషకుడు" అన్న వ్యాసం సంస్కృత నాటకాల్లో విదూషకుని పాత్ర, ప్రతిపాదింప బడిన తీరుతెన్నులను తెలుపుతుంది.

చివరి వ్యాసం, కోలాచలంవారు రచించిన "ప్రపంచ నాటక చరిత్ర" యొక్క వైశిష్ట్యాన్ని, నాటకరంగ సంస్కరణావశ్యకతను చెబుతూ వారు చేసిన సూచనలను వివరిస్తుంది.

ఈ సంపుటిలోని ప్రతివ్యాసం డా॥ గంగప్పగారిపరిశోధనా దీక్షను, అధ్యయన శీలాన్ని నిరూపిస్తుంది.

విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం ఆర్థిక సహాయంతో ప్రచురింపబడిన యీ గ్రంథం నాగార్జున విశ్వవిద్యాలయం ఉపాధ్యాయులు డాక్టర్ కె. రాజా రామమోహనరావు గారికి అంకిత మివ్వబడింది.

తెలుగు నాటక సాహిత్యం గురించి అత్యంత వుపయుక్తమైన యీ గ్రంధాన్ని రచించిన డాక్టర్ గంగప్పగారిని మనసారా అభినందిస్తున్నాను.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phone: 75667 & 61247.

